RNI No.APTEL/15835/2019

# ప్రజా

మణిపూస తెలుగు మాసపత్రిక

సంపుటి - 1 సంచిక - 8 | సెప్టెంబరు - 2020 | పేజీలు : 80 | వెల : 25/-



**ఇ. జయకర్ డానియల్**
Chief Execuive Officer (CEO)

**చీఫ్ ఎడిటర్ & పబ్లిషర్**
**కనపర్తి రాజారావు**

**కొడుకుల శ్రీనివాస్,** యాక్టివ్ జర్నలిస్ట్

అసోసియేట్ ఎడిటర్
**శ్రీ కె.వెంకట అప్పారావు** (Ph.D)

సీనియర్ సబ్ ఎడిటర్ & టెక్నికల్ అడ్వయిజర్
**శ్రీ డా॥ ఎం.జయకుమార్**,MBA.,Ph.D,.

ఎడిటర్ : **శ్రీ బి.రాజేష్,** B.Sc,.

కరస్పాండెంట్
**కె.దినేష్,** B.Tech.,(M.J.M.C)

సీనియర్ జనర్నలిస్ట్, వైల్డ్‌లైఫ్ ఫొటోగ్రాఫర్
**ఎన్.భావన్నారాయణ (భాను)**

ఫొటోగ్రాఫర్ : **బి.వీరయ్య**

డిజైన్ & డి.టి.పి
**ఆర్.తేజేషు,** Cell : 9866789072

**Office Address**
D.No.10-12-6/44, Plot No.302,
Sai Towers 1, Rednam Gardens,
Visakhapatnam.530002
Cell : 9492423833

## విషయ సూచిక

**Registration No.1140/2019**




**ఇ. జయకర్ డానియల్**
Chief Executive Officer (CEO)

**కనపర్తి రాజారావు**
చీఫ్ ఎడిటర్ & పబ్లిషర్

సాయి టవర్స్-1, ఫ్లాట్ నెం.302, రెడ్నం గార్డెన్స్, విశాఖపట్నం, ఆంధ్రప్రదేశ్. ఫోన్ : 94924 23833.
హెచ్.నెం. 9-1-38, వైఎంసిఏ కాంప్లెక్స్, సర్దార్‌పటేల్ రోడ్డు, సికింద్రాబాద్, తెలంగాణ,
ఫోన్ : 9885715927, 9912202720

# ఆదివాసిల ఇక్కట్లు

సంపాదకీయం



దూరపు కొండలు నునుపు' అనే సామెత మనకున్నది. అడవి బిడ్డల జీవితాలను దూరంగా చూసినప్పుడు ప్రకృతి అందాల మధ్య వారి జీవితాలు కూడా చాలా అందంగా ఉంటాయనే భావన చాలా మందికి ఉంటుంది. వారి అమాయకత్వం, శ్రమైక జీవన సౌందర్యం, వారి మాటలు, పాటలు, సంస్కృతి ఆ విధంగా ముచ్చట కొల్పుతాయి కూడా. అయితే అదే సందర్భంలో వారి పేదరికం, ఆకలి, అజ్ఞానం, రోగపీడిత సమస్యలు చుట్టుముట్టి నప్పుడు వారి బాధలు చెప్పటానికి అలవికాదు. వాస్తవం ఎంత భయంకరంగా, చేదుగా ఉంటుందో దగ్గరగా చూసినవారికే అర్థమవుతుంది. ఈ కరోనా కష్టాలు నాగరిక ప్రపంచానికి దూరంగా ఉన్న ఆదివాసీలకు సైతం ఆశనిపాతంలా మారాయి. ఉపాధి కోసం నగర ప్రాంతాలకు వలసవెళ్ళిన యువతీ యువకులు చాలామంది పనుల కోల్పోవడంతో స్వగ్రామాలకు సొంత గూడాలకు చేరుకున్నారు. అరకొరగా లభించే వ్యవసాయ పనుల్లో తిరిగి ఇమడటానికి ఇబ్బందిపడుతున్నారు. అనాదిగా వారి సంప్రదాయ పద్ధతుల్లో జరిగే వారాంతపు సంతలు రద్దుకావడంతో అటవీ ఉత్పత్తుల మారకాలకు, బేరసారాలకు విఘాతం కలిగింది. అందరికీ అన్నీ సమకూరలేకపోతున్నాయి. కావాల్సినవి దొరకడం లేదు. నిజంగానే 'అమ్మబోతే అడవి.. కొనబోతే కొరివి..' అన్న చందంగా తయారైంది పరిస్థితి.

పిల్లలకు ప్రభుత్వ గిరిజన సంక్షేమ ఆశ్రమ పాఠశాలలు, అంగన్‌వాడీ కేంద్రాలు తెరిచి ఉంటే వారి భోజన సదుపాయాలు కొంతలో కొంత సమకూరేవి. ఇప్పుడా పరిస్థితి లేదు. ప్రభుత్వ సహాయం అంతంత మాత్రంగానే దక్కుతున్నది. ప్రతి కుటుంబానికి అవసరం గంపంత ఉంటే, రాబడి తట్టంతగా మారింది. ఈ సర్కస్ ఎంతకాలం కొనసాగించాలో తెలియక తిప్పలు పడుతున్నారు.

ప్రపంచీకరణ అమలు అవుతున్న నేపథ్యంలో ఒక పక్క గనుల కోసం, ఖనిజాల కోసం అడవులు శీఘ్రగతిన విధ్వంసం అవుతున్న విషయాన్ని చూస్తూనే ఉన్నాం. ఈ అభివృద్ధి మాటున విస్థాపనతో పాటు అత్యధికంగా నష్టపోతున్నది ఆదివాసీలే అన్నది జగమెరిగిన సత్యం. ఇది ఇలా ఉండగా, 'గోరుచుట్టుపై రోకటిపోటులా' అన్నట్టు గిరిజన యువత ఉపాధి అవకాశాలు దెబ్బతినేలా ఇటీవల సుప్రీంకోర్టు తీర్పు వచ్చింది. షెడ్యూల్ ప్రాంతా ల్లోని ఉపాధ్యాయ నియామకాల్లో గిరిజనులకు నూరుశాతం రిజర్వేషన్ కల్పిస్తూ జారీ చేసిన జీఓఎంఎస్ 3ను సుప్రీంకోర్టు ధర్మాసనం ఏప్రిల్ 22న రద్దుచేస్తూ తీర్పునిచ్చింది.

భారత రాజ్యాంగంలోని 5వషెడ్యూల్ నిబంధనల ప్రకారం రాష్ట్ర గవర్నర్ ద్వారా గిరిజనులకు కల్పించబడుతున్న ప్రత్యేక సదుపాయాలు, భద్రతా నియమాల స్థానంలో ఇక నుంచి సాధారణ పాలనా నియమాలు అమలు అవుతాయనేది ఆ తీర్పు సారాంశం. ఈ రకంగా ఇప్పటికే వెనుకబడి ఉన్న గిరిజనులు మరింతగా వెనుకబడిపోవడం ఖాయమని, తరతరాలుగా సాగుచేసుకుంటున్న తమ అటవీసాగు భూములు గల్లంతు అవుతాయని, అలాగే తమకు లభిస్తున్న ప్రభుత్వ ఉద్యోగ అవకాశాలు కూడా భవిష్యత్‌లో కోల్పోనున్నామని ఆందోళన చెందుతున్నారు.

అసలు ఆదివాసీ భూమి హక్కుల పరిరక్షణ కోసం రూపొందించిన భూ క్రమబద్ధీకరణ చట్టం-1/70 అమలులో ఉన్నప్పుడు షెడ్యూల్ ప్రాంతాలలోకి గిరిజనుల ప్రవేశమే ఓ ప్రశ్నార్థకం అవుతున్నప్పుడు ఈ తీర్పు ఏమిటి అని చాలామంది న్యాయవాదులు, సామాజికవేత్తలు ప్రశ్నిస్తున్నారు. భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ తను ప్రవేశపెట్టిన పంచశీల సిద్ధాంతాన్ని వివరిస్తూ.. ఆదివాసీల సొంత విజ్ఞానానికి ప్రాధాన్యతనిస్తూ తదనుగుణంగా వారి అభివృద్ధి చేపట్టాలే తప్ప బలవంతంగా ఏదీ రుద్దకూడదని స్పష్టం చేశారు. మరి ఆ ఫెడరల్ సమాఖ్య స్ఫూర్తికి ఇప్పటి పాలకులు ఎందుకు తిలోదకాలు ఇస్తున్నారో నిశితంగా పరిశీలించుకోవాలి.

ఆదివాసీ అభివృద్ధి అంటే వారి సంస్కృతి, స్వయం ప్రతిపత్తి, జీవన విధానాలకు రక్షణ అనే మౌలిక లక్షణం మృగ్యమైతే, మన భారత ప్రజాస్వామ్యమే ప్రమాదంలో పడుతున్నదని గ్రహించాలి. అటవీ భూముల విషయంలో ఆదివాసీలకు చారిత్రక అన్యాయం జరిగిందని గతంలో మన పార్లమెంటు కూడా ప్రకటించింది. ఆ అన్యాయాన్ని సవరించేందుకే అటవీ హక్కుల గుర్తింపు చట్టం (2006)ను తీసుకువచ్చినట్టు తెలిపింది. తరతరాలుగా అటవీ ప్రాంతంలో నివసిస్తున్న ఆదివాసుల అటవీ హక్కులను ఈ చట్టం ద్వారా గుర్తించనున్నట్టు పేర్కొంది.

ఆ అటవీ హక్కులను నమోదు చేయడానికి ఓ వ్యవస్థను కూడా ఏర్పరిచింది. హక్కుల గుర్తింపుకోసం ఎలాంటి సాక్ష్యాలు అవసరమో తెలిపింది. కేవలం వ్యక్తిగత అటవీసాగు (పోడు) భూమి హక్కే కాకుండా, వివిధ రకాల సామాజిక, గ్రామ అటవీ వనరులపై ఉన్న సాముదాయక హక్కులను కూడా గుర్తించనున్నట్టు వివరించింది. ఆనాటి యూపీఏ ప్రభుత్వానికి వామపక్షాలు వెన్నుదన్నుగా నిలవబట్టే ఇది జరిగిందనేది ఎల్లరకూ తెలిసిందే. అయితే చట్టం అమలులో ఆదివాసీలకు ప్రతిబంధకాలే ఎక్కువ ఏర్పడుతున్నాయి. హక్కుల కోసం ఆదివాసీలు పెట్టుకున్న దరఖాస్తులలో అంగీకరించినవాటి కంటే, తిరస్కరించినవే ఎక్కువగా ఉంటున్నాయి. తిరస్కరించడానికి గల కారణాలు పరిశీలిస్తే చట్టబద్ధమైన ప్రాతిపదికలు పెద్దగా కనిపించవు. అంటే, రకరకాల పద్ధతుల్లో ఆదివాసీలు మోసపోతున్నారని అర్థమవుతున్నది.

ఆదివాసీలకు 1/70 చట్టం ఎంత ముఖ్యమో, ఈ అటవీహక్కుల చట్టం కూడా అంతే ముఖ్యం అన్న విషయం కొందరు పాలకులు, అధికారులు ఇప్పటికీ గుర్తించడం లేదు. ఇది పూర్తిగా ఆదివాసీ వ్యతిరేక ధోరణి తప్ప మరేమీ కాదు. ఇలాంటి విపత్కర పరిస్థితుల్లో ఆదివాసీలు నేడు జీవిస్తున్నారు. కాగా, మరోపక్క ఆదివాసీ యువత కొన్ని చోట్ల త్వరితంగా విష సంస్కృతి ఉచ్చులో చిక్కుకుంటున్నారు. గంజాయి ఉత్పత్తి, రవాణా వంటి చీకటి కార్యక్రమాలకు అలవడుతున్నారు. సులువుగా డబ్బు సంపాదించవచ్చు అనే ఊబిలోకి నెట్టబడుతున్నారు. మార్కెట్ వినిమయ సంస్కృతిలో చిక్కుకుని జల్సాలు చేసుకోవడం, వ్యసనాలకు లోబడటం, లైంగిక విశృంఖలత్వానికి పాల్పడటం.. ఇవన్నీ కౌమారదశ నుంచే ప్రారంభించడం ఆందోళన కలిగిస్తున్న విషయం. అంతిమంగా శ్రమ సంస్కృతికి వారు దూరమవుతున్నారు. ఆదివాసీ మండల కేంద్రాల గ్రామాల్లో ఇంటర్నెట్ సెంటర్‌లు వెలుస్తున్నాయి. టచ్‌స్క్రీన్, స్మార్ట్ ఫోన్‌లకు ఆదివాసీ పిల్లలు అందరిలాగనే అలవాటు పడుతున్నారు. స్మార్ట్‌ఫోన్ ఇప్పుడు అందరికీ ఆధునిక జీవితావసర వస్తువైంది. అయితే వీడియోగేమ్స్, పబ్జీలు, టిక్‌టాక్‌లు పెరిగిపోతున్న విషయం కాదనలేం. ఈ గేమ్స్ వలన పిల్లల్లో, యువతలో అశ్లీల హింసా ప్రవృత్తి నైజం పెరుగుతుందని గమనించాలి. వారి సహజమైన సున్నితత్వాన్ని కోల్పోతారు. వీటికి సంబంధించి ఆదివాసీ పిల్లల్లో ఎలాంటి నిఘా, నియంత్రణ లేకపోవడం శోచనీయం. కడకు తమవేళ్ళతో తమ కండ్లు పొడుచుకునేలా మూలవాసి మానవీయ సంస్కృతికి విరుద్ధమైన దోపిడీ సంస్కృతికి బానిసలుగా మారుతున్న స్థితిని చూస్తున్నాం.

(signature)

చీఫ్ ఎడిటర్

# తెలంగాణా విప్లవాగ్ని.. ఐలమ్మ

- డా॥గంగాధర్, ఎం.ఎ., బి.ఎల్. పిహెచ్‌డి



నైజాం తొత్తు, మధ్య యుగాల భూస్వామ్య వ్యవస్థ ప్రతినిధి, నరరూప రాక్షసుడైన విసునూరు దేశ్‌ముఖ్‌ను ఎదిరించిన మట్టి మనిషి చాకలి ఐలమ్మ. 'నీ కాళ్ళు మొక్కుత దొరా! నీ బాంచెన్ దొరా!' అన్న తెలంగాణ రైతు కూలీ బిడ్డలు, ఆ దొరలకు వ్యతిరేకంగా గుతపలు, వడిసెల, తుపాకులతో తిరగబడ్డారు. ఐలమ్మ ఆ మహత్తర తిరుగుబాటుకు స్ఫూర్తి, సంకేతం. ఆంధ్ర మహాసభ నాయకత్వంలో ఎర్రజెండా పట్టింది. పోరాడింది. పంటను, భూమిని దక్కించుకుంది. దొరలనెదిరిస్తే కష్టాలు తప్పవని, ప్రాణాలు తీస్తారని ఆమెకు తెలుసు. అయినా, లొంగి బతకడం కన్నా, పోరాడి మరణించటమే మేలనుకుంది.

పరమ దుర్మార్గుడు రామచంద్రారెడ్డి. 40 వేల ఎకరాల ఆసామి, 60 గ్రామాలకు అధిపతి. నైజాంకు నమ్మినబంటు. ఇతని కొడుకు బాబుదొర (జగన్‌మోహన్ రెడ్డి) దుర్మార్గాలకు, ఆగడాలకు పెట్టింది పేరు. చాకలి, మంగలి, చేతివృత్తుల వారు, రైతులు, కూలీలు వీరి పీడనలో పీల్చి పిప్పి చేయబడ్డారు. ప్రజల ధన, మాన, ప్రాణాలకు రక్షణ లేదు. నైజాం రాజు, రజాకార్ల నాయకుడు ఖాశీం రిజ్వీ, భూస్వాముల, దేశ్‌ముఖ్‌ల అధికారాలకు, దుర్మార్గాలకు, అత్యాచారాలకు అంతేలేదు. ప్రజల నుంచి కొల్లగొట్టిన సంపదతో భోగలాలస జీవితాలు గడిపేవారు. ఈ పూర్వ రంగంలో పీడించబడిన ఆ మట్టి మనుషుల జీవితాలకు ఆనాడు సంఘం (ఆంధ్ర మహాసభ) ఎర్రజెండా ఆశాకిరణంగా ముందుకొచ్చింది.

ఐలమ్మకు స్వంత భూమి లేదు. మల్లంపల్లి భూస్వామి కొండల్‌రావు దగ్గర నాలుగు ఎకరాలు కౌలుకు తీసుకుంది. కుల వృత్తిమీద వచ్చే మాన్యం గింజలతో పాటు, కౌలు వ్యవసాయం మీద వచ్చే ఆదాయం ఐలమ్మ కుటుంబానికి ఆసరాగా ఉండేది. సంఘం నాయకులు చెప్పే విషయాలన్నీ ఐలమ్మ జాగ్రత్తగా వినేది. గ్రామంలో జరుగుతున్న విషయాలన్నీ అర్థం చేసుకునేది. పాలకుర్తిలో సంఘం కార్యక్రమాలకు ఐలమ్మ ఇల్లే కేంద్రమైంది. భువనగిరిలో జరిగిన ఆంధ్ర మహాసభకు ఐలమ్మ తన కుటుంబ సభ్యులతో పాటు వెళ్లి పాల్గొన్నది. మహాసభ ఐలమ్మలో చైతన్యాన్ని రగిలించింది.

ఇంత కాలం తమకు ఎదురు లేకుండా విర్రవీగుతున్న దేశ్‌ముఖ్, భూస్వామ్య దోపిడీగాళ్ళకు సంఘం పేరుతో పేదలు సంఘటితం కావడం, ఎదురు తిరగటం వారిలో కలవరం లేపాయి. "సంఘాన్ని" విచ్ఛిన్నం చేయాలని దేశ్‌ముఖ్ రామచంద్రారెడ్డి తన ప్రయత్నాలు ప్రారంభించాడు. తన కింద వందమందికి పైగా ప్రయివేటు సైన్యాన్ని, గూండాలను పోగేసుకున్నాడు. యీ గూండాల దాడులను ప్రతిఘటించడం కోసం గ్రామాలలో పేదలు ఆంధ్ర మహాసభ శాఖలు ఏర్పాటు చేసుకోవడం ప్రారంభించారు.

పోలీస్ పటేల్ దాడి

పాలకుర్తిలో వీరపనేని శేషగిరిరావు దేశ్‌ముఖ్ రామచంద్రారెడ్డికి నమ్మినబంటు. ఈయన పోలీస్ పటేల్. ఎప్పటికప్పుడు పాలకుర్తి విషయాలన్నీ దేశ్‌ముఖ్‌కు చేరవేస్తూ, సంఘం బలపడకుండా ప్రయత్నాలు ప్రారంభించాడు. దేశ్‌ముఖ్ తన పొలంలో ఐలమ్మ కుటుంబం అంతా వచ్చి పని చేయాలని మనుషులను పంపించాడు. ఐలమ్మ వ్యతిరేకించింది. ఐలమ్మ తన మాట వినడం లేదని, కమ్యూనిస్టులకు, సంఘం కార్యకర్తలకు తన ఇంట్లో ఆశ్రయం కల్పిస్తున్నదని, సంఘాన్ని నామ రూపాలు లేకుండా చేయమని దేశ్‌ముఖ్ రామచంద్రారెడ్డి ఆజ్ఞాపించాడు. ఐలమ్మ ఇంటిపైకి శేషగిరిరావు తన గూండాలను పంపించాడు. ఐలమ్మ ప్రతిఘటించింది. గూండాలు ఇంటిని లూటీచేసి భీభత్సం సృష్టించారు. సజ్జలు, జొన్నలు, యింట్లో సామాగ్రి అంతా ఎత్తుకెళ్ళారు. నిరుపేద

అయిన ఐలమ్మ లొంగిపోలేదు. సంఘం అండతో మరింత పట్టుదల, కసితో దొరకు ఎదురు నిలబడింది.

**పోలీసుల చిత్రహింసలు**

పాలకుర్తిలో శివరాత్రి ఘనంగా జరుగుతుంది. ప్రజలు పెద్ద ఎత్తున ఉత్సవాలకు వస్తుంటారు. ఉత్సవాలలో సభ జరపాలని సంఘం నాయకులు నిర్ణయించారు. ఎట్టి పరిస్థితులలోనూ సభ జరగనీయవద్దని, అడ్డుకోవాలని, వచ్చిన నాయకులపై దాడి చేయాలని, అవసరమైతే హత్య చేయాలని దేశ్‌ముఖ్ తన గూండాలను పాలకుర్తికి పంపించాడు.

ఐలమ్మ ఇంటి ముందు సభ జరుగుతున్నది. దేశ్‌ముఖ్ గూండాలు గొంగళ్ళు కప్పుకొని వాటి మాటున గొడ్డళ్ళు, కత్తులు పట్టుకొని సభకు వచ్చారు. యీ ప్రమాదాన్ని పసిగట్టిన ఐలమ్మ భర్త నర్సయ్య, కొడుకులు సోమయ్య, లచ్చయ్యలు వెళ్ళి గూండాలను అడ్డుకున్నారు. జనం గూండాలను తరిమికొట్టారు. గూండాలలో ఒకతనికి దెబ్బలు బాగా తగిలాయి. రెచ్చిపోయిన దేశ్‌ముఖ్ పోలీసులతో ఐలమ్మ భర్త, ఇద్దరు కొడుకులతో పాటు, గ్రామంలోని సంఘం కార్యకర్తలందరిపైన హత్యాయత్నం కేసులు బనాయించాడు. పోలీసుల చిత్రహింసలకు, కొట్టిన దెబ్బలకు ఐలమ్మ భర్త నర్సయ్య చెయ్యి పడిపోయింది. ఇద్దరు కొడుకులు పోలీసుల దెబ్బలకు తల్లడిల్లిపోయారు. దీర్ఘకాలం ఐలమ్మ కుటుంబం అంతా కోర్టుల చుట్టూ తిరిగింది.

**భూమి కోసం**

దేశ్‌ముఖ్ రామచంద్రారెడ్డి దృష్టి మొత్తం ఐలమ్మ కుటుంబంపై పడింది. పోలీసుల చిత్రహింసలకు, కేసులకు కూడా ఐలమ్మ లొంగకపోవడంతో మరింత రెచ్చిపోయాడు. ఐలమ్మ కౌలుకు తీసుకున్న భూమిని కాజేయాలని రామచంద్రారెడ్డి ప్లాన్ వేశాడు. గత ఇరవై ఏండ్లుగా ఐలమ్మ సాగుచేస్తున్న మల్లంపల్లి భూస్వామి కొండల్‌రావు భూమిని తనకు కౌలుకు యిచ్చినట్లు కొండల్‌రావుతో కాగితం వ్రాయించుకున్నాడు. యీ దెబ్బతో ఐలమ్మ తన చేతుల్లోకి వస్తుందని దేశ్‌ముఖ్ భావించాడు. అప్పటికే భూమిలో ఐలమ్మ సాగు చేసుకున్న పంట వుంది. ఆ పంటను కాజేయాలని కుట్ర చేసాడు. ఐలమ్మ బెదరలేదు. రెవెన్యూ, పోలీసు అధికారులందర్నీ కలిసింది. తన గోడునంతా చెప్పుకున్నది. అరవై ఊళ్ళ ఆసామి, నైజాం నమ్మిన బంటు రామచంద్రారెడ్డి కావడంతో, ఏ ఒక్క అధికారీ ఐలమ్మ పక్షాన నిలబడలేదు. పంటను కోసుకొని రావాలని దేశ్‌ముఖ్ తన గూండాలను ఐలమ్మ పొలం పైకి పంపించాడు.

పండిన ధాన్యాన్ని దేశ్‌ముఖ్ అపహరించకుండా ఐలమ్మ ఇంటికి చేర్చాలని సంఘం ఆదేశించింది. భీమిరెడ్డి నర్సింహారెడ్డి, కట్కూరి రామచంద్రారెడ్డి, చకిలం యాదగిరిరావు, ధర్మ భిక్షం తదితర కార్యకర్తలు పాలకుర్తికి చేరుకొని, ఐలమ్మ పొలంలోకి దిగారు. ఐలమ్మ సంఘం నాయకులతో కలిసి దేశ్‌ముఖ్ గూండాలను ఎదుర్కొన్నది. నాలుగు వందల మంది దేశ్‌ముఖ్ గూండాలను సంఘం కార్యకర్తలు తరిమికొట్టారు. బిత్తరపోయిన గూండాలు పారిపోయారు.

"ఈ భూమి నాది... పండించిన పంట నాది... తీసుకెళ్ళడానికి దొరెవ్వడు?... నా ప్రాణం పోయాకే యీ పంట, భూమి దక్కించుకోండి" అంటూ ఐలమ్మ మాటలను తూటాలుగా పేల్చింది. సంఘం నాయకులు పండించిన ధాన్యాన్ని, మోపులు కట్టి, కొట్టి ఐలమ్మ ఇంటికి చేర్చారు.

రామచంద్రారెడ్డి ఆగ్రహంతో ఊగిపోయాడు. జరిగిన పరిణామాలను జీర్ణించుకోలేకపోయాడు. పోలీసులను పురమాయించాడు. 'ధాన్యాన్ని నా ఇంటికి తెండి. సంఘం నాయకులను చావగొట్టండి' ఇ అని హుకుం జారీచేశాడు. తన పొలంపై దాడిచేసి కమ్యూనిస్టులు ధాన్యాన్ని దొంగతనంగా తీసుకెళ్ళారని పోలీసులతో కుమ్మక్కై కేసు బనాయించాడు. సంఘం నాయకులు భీమిరెడ్డి నర్సింహారెడ్డి తదితరులను అరెస్టు చేసి చిత్రహింసలు పెట్టారు. మూత్రం తాగించారు. తలల్ని వంట పొయ్యిలో పెట్టారు. ఆసనాల్లో కారం చల్లారు. యీ చిత్రహింసల్ని, తప్పుడు కేసుల్ని ఆంధ్ర మహాసభ తీవ్రంగా ఖండించింది.

ఐలమ్మ భూ పోరాటం మొత్తం తెలంగాణ నైజాం సంస్థానంలో భూ పోరాటాలకు ఊపునిచ్చింది. పోరాటాలు విస్తృతమయ్యాయి. అజ్ఞాతంలో ఉన్న నాయకులకు అన్నం పెట్టేందుకు ఐలమ్మ పడరాని పాట్లు పడ్డది. గంపల్లో తీసుకెళితే పోలీసులు పట్టుకుంటారని చాకలి బట్టల మూటల్లో అన్నం తీసుకెళ్ళి కమ్యూనిస్టు దళాలకు పెట్టింది. సాహసం, ధైర్యం ఐలమ్మ ఊపిరి. ఐలమ్మ భూ వివాదంలో ఓటమి పాలైన దేశ్‌ముఖ్ రామచంద్రారెడ్డి పాలకుర్తిపై అనేకసార్లు దాడులు జరిపించాడు. బాబు దొర పోలీసులతో ఐలమ్మ ఇంటికొచ్చి "కమ్యూనిస్టులకు ఎందుకు సాయం చేస్తున్నావు" అని ప్రశ్నించాడు. ఐలమ్మ బెదరలేదు. రోకలి బండను అందుకున్నది. బాబు దొర తోక ముడిచాడు.

**రజాకార్ల దాడులు**

సంఘం ఆధ్వర్యంలో పోరాటాలు ఉధృతంగా జరుగుతున్న యీ కాలంలోనే ఐలమ్మ ఇంటి మీద రజాకార్లు, దేశ్‌ముఖ్ గూండాలు దాడి చేశారు. ఇంటికి నిప్పు పెట్టారు. గాబులు, కుండలు, కాగులు పగులగొట్టారు. ధాన్యాన్ని దోచుకున్నారు. ఐలమ్మ కుటుంబ సభ్యులపై దాడి చేశారు. ఐలమ్మ బిడ్డ సోమనర్సమ్మ దుర్మార్గులకు దొరికింది. రజాకార్లు సోమనర్సమ్మను ఆగం చేశారు. ఈ పోరాటంలో ఐలమ్మ కుటుంబం చెల్లాచెదురైంది. అష్ట కష్టాలు పడ్డది. అయినా ఐలమ్మ ధైర్యంగానే నిలబడ్డది.

ఐలమ్మ ఇంటిపై రజాకార్ల దాడి అనంతరం పాలకుర్తి ప్రజలు ఆగ్రహంతో పోలీస్ పటేల్ శేషగిరిరావు ఇంటిపై దాడి చేసి కూల్చివేశారు. భూస్వామి వీరారెడ్డి ఇంటిని ధ్వంసం చేశారు. ఆంధ్ర మహాసభ ఈ ఘటనల్లో కీలకపాత్ర వహించింది. ప్రజలు నూతనోత్తేజంతో విసునూరు, కడవెండి గడీలపై దాడి చేశారు. కడవెండిలో ప్రజలపై విస్నూరు దొర గూండాలు, నైజాం రజాకార్లు జరిపిన కాల్పుల్లో 1946 జూలై 4న దొడ్డి కొమరయ్య ప్రాణాలు కోల్పోయి అమరుడైనాడు.

ఐలమ్మ భూమి కోసం, నమ్మిన ఆశయం కోసం ఆంధ్ర మహాసభ నాయకత్వంలో పోరాడింది. ఎన్ని కష్టాలు వచ్చినా చలించలేదు. ఎర్ర జెండాను ఎత్తుకున్నది. 1985 సెప్టెంబర్ 10న పాలకుర్తిలో తన మనుమరాలి ఇంట్లో మరణించింది. ఆ విప్లవమూర్తి, పోరు తల్లికి విప్లవ జోహార్లు.

# తెలుగు పిడుగు.. వెలుగు.. గిడుగు...

– **పి.సుమతి**, అధ్యాపకరాలు, ప్రభుత్వ జూనియర్ కళాశాల, విశాఖపట్నం

గ్రాంథికభాషలో ఉన్న తెలుగు వచనాన్ని ప్రజల వాడుకభాషలోకి తీసుకు వచ్చి, నిత్య వ్యవహారంలోని భాషలో ఉన్న అందాన్నీ, వీలునూ తెలియజెప్పిన మహనీయుడు, ఆంధ్రదేశంలో వ్యావహారిక భాషోద్యమానికి మూలపురుషుడు, బహుభాషా శాస్త్రవేత్త, చరిత్రకారుడు, సంఘసంస్కర్త, హేతువాది,శిష్టజన వ్యవహారికభాషను గ్రంథరచనకు స్వీకరింపజేయడానికి చిత్తశుద్ధితో కృషిచేసిన అచ్చతెలుగు చిచ్చర పిడుగు గిడుగు. గిడుగు ఉద్యమంవల్ల ఏ కొద్దిమందికో పరిమితమైన చదువు వ్యావహారికభాషలో సాగి, అందరికీ అందుబాటులోకి వచ్చింది. పండితులకే పరిమితమైన సాహిత్యసృష్టి, సృజనాత్మకశక్తి ఉన్న ప్రతి ఒక్కరికీ వీలైంది. గిడుగు రామ్మూర్తి జయంతి ఆగష్టు 29న "తెలుగు భాషా దినోత్సవం"గా జరుపుకుంటున్నాము. ఆంగ్లేయులు మన దేశాన్ని విడిచివెళ్లినా మనకు భావదారిద్ర్యం, భాషా బానిసత్వం వదల్లేదు. లేకపోతే, అన్ని రంగాల్లోనూ ఆంగ్లాన్నే పట్టుకుని వేలాడటమేంటి పిల్లలకు విద్యానైపుణ్యాలు పక్కాగా ఒంటబట్టాలంటే, ప్రాథమిక స్థాయిలో వాళ్ల విద్యాభ్యాసం మాతృభాషలోనే జరగాలన్నది నిపుణుల మాట. దీన్ని మనం పట్టించుకోవట్లేదు. కానీ, గిడుగు రామ్మూర్తి మాత్రం కొన్ని దశాబ్దాల కిందటే.. ఎవరూ చెప్పకముందే ఈ వాస్తవాన్ని అర్థంచేసుకున్నారు. ఆ అవగాహనకు అనుగుణంగా ఆయన చేసిన కృషి.. నేటి భాషోద్యమానికి స్ఫూర్తిమంత్రం.ఆనాడు దుర్భర పరిస్థితుల్లో ఉన్న సవరలు– చదువు నేర్చి, వ్యవహార జ్ఞానం అలవరచుకుని ఆర్థికంగానూ, సామాజికంగానూ అభివృద్ధిలోకి రావాలని ఆకాంక్షించారు గిడుగు. ఆయన మాటల మనిషి కాదు, చేతల మనిషే! అందుకే వాళ్ల జీవన స్థితిగతులను మెరుగుపరచడానికి అనువుగా సవర భాషని నేర్పడం కోసమని తాను కష్టపడి వాళ్ల భాషను నేర్చుకున్నారు. వాళ్లకి ఆ భాషని నేర్పడానికి సొంత ఖర్చుతో బడులు నడిపారు. సవరల పాటల్ని సేకరించారు. కొన్నింటిని సవర భాషలో తానే సొంతంగా రాశారు. కొన్ని సవర కథలను సేకరించి వాచకాలుగా రూపొందించారు. సవర భాషా వ్యాకరణ నిరూపణగా ఓ వివరణ గ్రంథాన్ని రాశారు. సవర– ఇంగ్లీషు, ఇంగ్లీషు– సవర, సవర– తెలుగు, తెలుగు– సవర నిఘంటువుల్ని రూపొందించారు.

లిపి, గ్రంథాలు లేని భాషకు వీటిని సమకూర్చడానికి ఎంతో ప్రయాసపడాల్సి వచ్చిందన్నారు గిడుగు. అంతేకాదు– గ్రంథ రచనకు ఒక భాషని, మాట్లాడడానికి వేరొక భాషను ఉపయోగించే తెలుగువాళ్ల తీరుని నిరసించి, మాట్లాడే భాషలోనే గ్రంథ రచన, విద్యాబోధన జరిగేట్టు చేశారు. పాఠశాల, కళాశాల స్థాయి పాఠ్యపుస్తకాలలో ఇప్పుడు తెలుగు వచనం ఆధునిక భాషలోనే కనిపిస్తోంది. ఈ భాషలో మాట్లాడటం, రాయడం, రాసింది చదువుకుని బాగా అర్థం చేసుకోవడం, అర్థం చేసుకుని వ్యవహరించడం అందరివల్లా అవుతుంది. ఇలా పలికే నోటికి, రాసే చేతికి, చదివే కంటికి, మనసులో మెదిలే ఆలోచనకు చక్కటి సమన్వయాన్ని మాట్లాడే భాషలో ఏర్పరిచారు గిడుగు.



**పునాది ముఖ్యం**

రామ్మూర్తిచిన్నప్పుడు చదువుకున్న తెలుగు, సంస్కృతం, ఆంగ్ల భాషలకు తోడుగా ఒడియా, సవర భాషల్ని నేర్చుకున్నారు. ఇన్ని వచ్చినా ఆయనకు మాతృభాషా ప్రాధాన్యం తెలుసు. అందుకే లిపిలేని సవరలు మాతృభాషని సక్రమంగా మాట్లాడేటట్లు, తమ జీవన విధానాన్ని చక్కగా తీర్చిదిద్దుకునేందుకు వీలుగా సవర భాషని తెలుగు, ఇంగ్లీషు లిపులలో భద్రపరచి వాళ్లర్థం చేసుకునేట్టు చేశారు. అలాగే లిపి ఉన్న తెలుగులోనూ అందరికీ అర్థంకాని గ్రంథ భాషని విస్మరించి, మాట్లాడే భాషలోనే వ్యవహారాలు, గ్రంథరచన జరిగేట్టు చూశారు. మానవ జీవితంలో భాషకి ఎంత ప్రాధాన్యముందో, మాతృభాషలో ఎందుకు ప్రాథమిక విద్యను అభ్యసించాలో, జీవితాన్ని మలచుకోవడానికి అదెలా తోడ్పడుతుందో చెప్పారు గిడుగు.

పుట్టినప్పటి నుంచి వినేది, మాట్లాడటానికి ప్రయత్నించి నేర్చుకునేది అమ్మభాష. అప్పటికే ఆ భాషలో ఆలోచించడం మొదలవుతుంది. అందుకని మాతృభాషలో రాయడం, చదవడం కూడా నేర్పితే ఒక భాష వాళ్లకి పూర్తిగా వస్తుంది. ఆ పట్టుతో మరికొన్ని భాషలూ నేర్చుకోగలరు. కాబట్టి ప్రాథమిక స్థాయిలో మాతృభాషలోనే విద్యాబోధన జరగాలి. ఆ తర్వాత ఏ భాషలో చెప్పినా పిల్లలు సులభంగా అర్థం చేసుకోగలరు. ప్రాథమికంగా మాతృభాష నేర్చుకోవడంవల్ల ఆలోచనలు ఆ భాషలోనే చకచకా సాగుతాయి. అందుకే ఆ తర్వాత ఎన్ని భాషలు నేర్చుకున్నా– వాటిని అనువాద పద్ధతిలోనే ముందు మనసులో మాతృభాషలో అనుకుని అనువదించుకుని చెప్పగలరు. కాబట్టి ప్రాథమిక స్థాయిలో ఎవరికైనా మాతృభాషలో విద్యాబోధన జరగాలన్నది గిడుగు ఆలోచన.

ఇంతకుముందే అనుకున్నట్లు పాఠశాలలో ప్రవేశించే నాటికే పిల్లలు

మాతృభాషలో చక్కగా సంభాషించగలిగిన స్థాయిలో ఉంటారు. ఆ సమయంలో బడిలో మాతృభాషాబోధన లేకపోతే నేర్చుకున్న భాష నిరుపయోగమవుతుంది.ప్రస్తుతం కొత్త భాషా బోధన ఏదైనా అనువాద పద్ధతిలోనే జరుగుతోంది. బీవోవై- బాయ్- బాలుడు అంటూ కొత్త భాషని నేర్పడం అనువాద పద్ధతి. ఆంగ్ల పదాలకు తెలుగులో అర్థాలు చెప్పడం, వాక్యార్థాన్ని తెలుగులో చెప్పడం, ఆంగ్ల వ్యాకరణాన్ని తెలుగులోకి అనువదించి బోధించడం పాఠశాలల్లో చూస్తున్నాం. ఇది సులువైన పద్ధతే కానీ, ప్రయోజనకారి కాదు. ఎన్నాళ్లు చదివినా ప్రతిపదార్థ తాత్పర్యాలు రాయడం, వ్యాసాల్ని కంఠస్థం చేయడం తప్ప విద్యార్థులు సొంతంగా ఒక్క వాక్యం కూడా రాయలేకపోతున్నారు. అనువాద పద్ధతిని వదిలిపెట్టి, ప్రత్యక్ష పద్ధతి గురించి ఆలోచించి గిడుగు ఏం చెప్పారంటే.. "నూతన పద్ధతైన ప్రత్యక్ష పద్ధతిలో- తెలుగు మాటలు దొర్లించకుండా, తెలుగులోకి అనువాదం చేయకుండా ప్రారంభం నుంచి చిన్న చిన్న ఇంగ్లిష్ వాక్యాలు మాట్లాడటం అలవరచడం, అభినయంతో అర్థమయ్యేట్టు పదాలు- వాక్యాలు చెప్పడం, ఇంగ్లిష్ స్పెల్లింగ్‌తో కాక, ఫొనెటిక్ లిపిలో చదివించడం రాయించడం నేర్పాలి. నేడు ఉపాధ్యాయ శిక్షణా కళాశాలలో ఇంగ్లిష్ బోధించడానికి ప్రత్యక్ష పద్ధతిని అనుసరిస్తు న్నారు. విద్యార్థులకు అంతర్జాతీయ ధ్వని లిపి తెలిస్తే ఏ భాషలోనైనా మాట్లాడేటట్లు రాసుకోవచ్చు. ఐ.పి.ఎ. నేర్పించి, ప్రత్యక్ష విధానంలో పిల్లలకు నేర్పాలి. ప్రత్యక్ష పద్ధతిలో ఇంగ్లిష్ తరగతిలో ఇంగ్లిష్ తప్పితే మరో భాష వాడకూడదు. ఇంగ్లిష్ పదాలకు అర్థాలు కూడా వస్తువులు చూపించిగాని, అభినయం ద్వారా గాని చెప్పాలి. అంటే పాఠశాలలో చేరకముందు మాతృభాషని ఎలా నేర్చుకుంటారో అలా ఇంగ్లీష్‌ని గాని మరో భాషని గాని నేర్పాలి. ఇది కష్టమైనా మంచి పద్ధతి. విద్యార్థికి సందేహాలుంటే ఇంగ్లిష్‌లోనే అడగాలి. మాతృభాషలో అడగకూడదు".

ఇప్పుడు విద్యాలయాల్లో ఆధునిక భాషా బోధకులు అవలంబిస్తున్న పద్ధతి ఇది.. ముందుగా మాట్లాడటం నేర్పుతారు. భాషలో సంభాషించడం వచ్చిన తర్వాత రాయడం నేర్పుతారు. వాస్తవానికి భాష వచ్చిన తర్వాతే రాయడం చదవడం నేర్పాలి. ఇంగ్లండ్‌లో ఓ పిల్లాడు బడిలో అడుగుపెట్టేసరికే మాట్లాడటం వస్తుంది. రాయడం, చదవడం నేర్చుకుంటాడు. అందుకే అక్కడ ప్రాథమికస్థాయిలోనూ ఆంగ్లం నేర్పుతారు. మన దగ్గర ఆ పునాది ఉన్నత పాఠశాలలో వేయాలి. అలా కళాశాలలోకి వచ్చేసరికి విద్యార్థులు ఇతర భాషల్లోనూ చదవడం రాయడం నేర్చుకుని ఉంటారు. అందుకని అప్పుడు ఆంగ్ల మాధ్యమంలో బోధించినా ఇబ్బంది పడరు.

ఏదిఏమైనా ప్రాథమిక స్థాయిలో మాతృభాషలో కాకుండా ఇతర భాషా మాధ్యమాల్లో చెప్పడం సరైన పద్ధతికాదు. ప్రాథమిక స్థాయిలో మాతృభాష చదవడం రాయడం తెలిస్తే- ఒక భాష వస్తుంది. తర్వాత ఉన్నతపాఠశాలలో ప్రత్యక్ష పద్ధతిలోనే ఆంగ్లంలో మాట్లాడడం, చదవడం, రాయడం నేర్పాలి. మాతృభాష బాగా వచ్చినవాళ్లు ఎన్ని భాషలనైనా నేర్చుకోగలరు. మాతృభాషతో బాటు ఎన్ని ఎక్కువ భాషలు నేర్చుకుంటే అంత మంచిదేగా!

# టాస్‌లో గెలిచిన గుర్రపు బగ్గీ

- ప్రజామీడియా నెట్‌వర్క్



స్వాతంత్ర్యం వచ్చాక ఇండియా-పాకిస్తాన్‌లు వేర్వేరు దేశాలుగా విడిపోయాయి! ఆ సందర్భంలో జనాభా ప్రాతిపదికన బ్రిటీషర్ల సమక్షంలోనే ఇరు దేశాలకు ఆస్తి పంపకాలు జరిగాయి. అయితే ఓ గుర్రపు బగ్గీని ఏ దేశానికి ఇవ్వాలి అని నిర్ణయించడానికి మాత్రం టాస్ వేశారు. ఆ టాస్‌లో గెలిచి .. ఇండియా గుర్రపు బగ్గీని దక్కించుకుంది.

అప్పట్లో అధికారిక సమావేశాలకు, సందర్శనలకు వెళ్లేందుకు బ్రిటీష్ వైస్రాయి బంగారు తాపడంతో చేయించిన గుర్రపు బగ్గీని వాడేవారు.! దేశ స్వాతంత్ర్యం తర్వాత ఈ బగ్గీ విషయంలో ఇరుదేశ నేతల మధ్య వాగ్వాదం నడిచింది. బగ్గీ తమకే దక్కాలని వాదులాడుకున్నారు. దీంతో ఆ సమస్యను భారత లెఫ్టినెంట్ కల్నల్ ఠాకూర్ గోవింద్ సింగ్, పాకిస్థాన్ ఆర్మీ అధికారి షహబ్జాదా యాకుబ్ ఖాన్‌లు రూపాయి బిళ్ల సాయంతో తీర్చారు.

అందరి సమక్షంలో రూపాయి బిళ్లను టాస్ వేశారు.. బొమ్మ అని ఇండియా కోరగా, బొరుసు అని పాక్ కోరింది. కాయిన్ బొమ్మ పడింది, బగ్గీ ఇండియాకు దక్కింది. అప్పటి నుండి రాష్ట్రపతి ప్రతి అధికారిక కార్యక్రమానికి దీన్నే వాడేవారు. 1984 వరకు ఈ బండిని అన్ని వేడుకలకు రాష్ట్రపతి అధికార వాహనంగా ఉపయోగించేవారు. తర్వాత సెక్యూరిటీ రీజన్స్ వల్లవాడడం ఆపేశారు. మళ్లీ ప్రణబ్ ముఖర్జీ అదే బగ్గీ మీద ప్రమాణ స్వీకారానికి వచ్చారు. ఆయన తర్వాత రామ్‌నాథ్ కోవింద్ కూడా పాత పద్ధతిని పాటిస్తూ ఈ బగ్గీ మీదే ప్రమాణ స్వీకారానికి వచ్చారు.

ఈ బండిలో మొదట పదవీ విరమణ చేస్తున్న రాష్ట్రపతి, నూతన రాష్ట్రపతి చెరో పక్కన కూర్చుంటారు. కొత్త రాష్ట్రపతి ప్రమాణ స్వీకారం తర్వాత వారిద్దరూ గుర్రపు బండిలో తమ తమ స్థానాలను మార్చుకోవడం ఆనవాయితీ.

# అజాత శత్రువు ఈ భీష్ముడు

**జి.చిన్నబ్బాయి, జిల్లా ప్రధాన కార్యదర్శి, UTF విశాఖపట్నం జిల్లా.**

ప్రణబ్ దాదా'గా సన్నిహితులు ఆత్మీయంగా పిలుచుకొనే 84 ఏళ్ల ప్రణబ్ ముఖర్జీ భారత రాజకీయాల్లో అత్యంత కీలక నేతల్లో ఒకరు. యాభై ఏళ్ల సుదీర్ఘ రాజకీయ జీవితంలో అనేక ఉన్నత పదవులు నిర్వహించిన ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. కాంగ్రెస్‌లో వివాద పరిష్కర్తగా పేరు పొందారు. కరుడుగట్టిన కాంగ్రెస్ వాదే అయినప్పటికీ.. ఒకానొక సందర్భంలో మాజీ రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ ప్రవర్తనపై సొంత పార్టీనే కస్సుబుస్సులాడింది. తప్పు చేస్తున్నావు దాదా అంటూ పలువులు కాంగ్రెస్ పార్టీ నేతలు ఆ పెద్దాయనకే హితవు పలికారు. ఇంతకాలం పాటు కాంగ్రెస్ పార్టీకే సేవ చేసిన ఈ పెద్దాయన ఈ వయస్సులో ఇలా ఎందుకు చేస్తున్నారు అంటూ కామెంట్ చేసిన వాళ్లూ లేకపోలేదు. కానీ వాటన్నింటికీ పట్టించుకోని ప్రణబ్ ముఖర్జీ మాత్రం తనకు తోచిందే చేశారు. అదేంటో కాదు... 2018లో జూన్ 7న నాగపూర్‌లో జరిగిన ఆర్ఆర్ఎస్ సమావేశానికి హాజరవడమే. అవును, బీజేపికి అనుబంధ సంస్థ అనే పేరున్న ఆర్ఎస్ఎస్ వాళ్లు అతిథిగా ఆహ్వానిస్తే వెళ్లడం ఏంటంటూ ప్రణబ్ దాదాపై కాంగ్రెస్ పార్టీలో తీవ్ర వ్యతిరేకత, విమర్శలు వ్యక్తమయ్యాయి.

ప్రణబ్ ముఖర్జీ జీవితంలో రెండేళ్ల క్రితం జరిగిన ఈ ఘటన అప్పట్లో తీవ్ర చర్చనీయాంశమైంది. కానీ ఆర్ఎస్ఎస్ సమావేశానికి అతిథిగా వెళ్లిన ప్రణబ్ ముఖర్జీ అక్కడ సభావేదికపై మాట్లాడిన తీరు చూశాకా మాత్రం.. ఆయన్ని విమర్శించి వాళ్లందరి నోర్లు మూతపడ్డాయి. కారణం లేనిదే దాదా ఏదీ చేయరనే నిర్ణయానికొచ్చాయి.

రెండు సార్లు ప్రధానమంత్రి పదవి దరిదాపుల్లోకి వెళ్లారు. రెండు సార్లూ ఆ హోదాను సంపాదించుకోలేకపోయారు. అయితే రాష్ట్రపతిగా గౌరవమర్యాదను పొందారు. భారతరత్నగా నిలిచారు. సంకీర్ణ రాజకీయంలో కాంగ్రెస్ ట్రబుల్ షూటర్ గా ఆయన సాగించిన రాజకీయ పయనం అలాంటిలాంటిది కాదు. ఆ సుదీర్ఘ ప్రస్థానానికి తెరపడింది. మాజీ రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ కన్నుమూశారు. అనారోగ్యంతో ఆసుపత్రి పాలైన ఆయన కోమాలో ఉంటూ చికిత్స పొందుతూ మరణించడంతో దేశ రాజకీయాల్లోనే ఒక శకం ముగిసినట్టు అయ్యింది. రాష్ట్రపతి పదవి నుంచి దిగిపోయాకా కూడా.. ఏదోలా ప్రణబ్ పేరు రాజకీయాల్లో వినిపించసాగింది. ప్రత్యేకించి గత ఎన్నికల ముందు.. మోడీకి ప్రత్యామ్నాయంగా ప్రణబ్ ను ప్రధానిగా దించాలనే వ్యూహాలను కూడా కొంతమంది రచించారు. దేశ రాజకీయాల్లో అంత ప్రాధాన్యతను పొందిన వ్యక్తి ప్రణబ్.

కాంగ్రెస్ రాజకీయాల్లో తలపండిపోయి, కొన్నేళ్ల పాటు ఆ పార్టీకి దూరమై చివరకు ఆ పార్టీకే దగ్గరైన నేత ప్రణబ్. కాంగ్రెస్ రాజకీయాలను ప్రణబ్ తరహాలో అవపోసన పట్టిన వారిలో మరొకరు లేరని చెప్పుచ్చు. సంకీర్ణ రాజకీయాల్లో పార్టీ కష్టాల్లో ఉన్నప్పుడల్లా ప్రణబ్ చక్రం అడ్డేస్తూ వచ్చారు. అందరిని కలుపుకుపోతూ ప్రభుత్వాలను రక్షిస్తూ వచ్చారు.

2004 నుంచి 2009 వరకూ కూడా సోనియాగాంధీ ఏదో తన చాతుర్యంతో ప్రభుత్వాలను నిలబెట్టుకోలేదు. ప్రణబ్ తో సహా ఆంటోనీ వరకూ అనేక మంది ఆ సంకీర్ణ ప్రభుత్వాలను నిలబెట్టడానికి శతథా ప్రయత్నించారు. వారి మాటకు పార్టీలో విలువున్నంత వరకూ కాంగ్రెస్ పరిస్థితి బాగానే ఉండింది. ఎప్పుడైతే ప్రణబ్ ను క్రియాశీల రాజకీయాల నుంచి సోనియా తప్పించారో, ఆంటోనీ వంటి వారు మెత్తబడ్డారో.. అక్కడి నుంచినే కాంగ్రెస్ పార్టీ పతనావస్థ కూడా మొదలైంది.

ఇందిరాగాంధీ మరణించిన సమయంలో సీనియర్ కాంగ్రెస్ నేత హోదాలో ప్రధాన మంత్రి పదవిని ఆశించారు ప్రణబ్. తాత్కాలికంగా అయినా తను ఆ బాధ్యతలను చేపట్టాలని ఆయన ఓపెన్ గానే తన ప్రతిపాదన పెట్టారంటారు. ఆ ప్రతిపాదనతోనే రాజీవ్‌గాంధీ ఆగ్రహానికి గురయ్యారట ప్రణబ్. ఆ సమయంలో ఆయన కాంగ్రెస్ పార్టీని వీడారు. సొంత పార్టీ పెట్టుకున్నారు. అయితే చివరకు రాజీవ్‌గాంధీనే ఆయనతో రాజీకి వచ్చారంటారు.

రాజీవ్ మరణానంతరం కూడా ప్రణబ్ కు అలాంటి అనుభవమే ఎదురయ్యిందంటారు. కాంగ్రెస్ పార్టీకి అధికారం దక్కిన ఆ సందర్భంలో ప్రణబ్ పీఠాన్ని ఆశించగా, సోనియా ఛాయిస్ పీవీ అయ్యారంటారు.

ఇక 2004లో కాంగ్రెస్ పార్టీ మళ్లీ అధికారానికి చేరువైనా.. ప్రణబ్‌ను మాత్రం సోనియా పరిగణనలోకి తీసుకోలేదు. మన్మోహన్ వైపు ఆమె మొగ్గు చూపారు. అయితే కీలక శాఖలు, కీలక బాధ్యతల్లో ప్రణబ్ రాణించారు. యూపీఏ రెండోసారి అధికారం చేపట్టాకా ఒక దశలో మన్మోహన్ ను పీఠం నుంచి దింపి , ప్రణబ్ ను ప్రధానిగా చేస్తారనే వార్తలు వచ్చాయి. దానికి మన్మోహన్ కూడా అభ్యంతరం వ్యక్తం చేసే పరిస్థితి లేకపోయింది. అయితే ఈ కాకలు తీరిన నేతను ప్రధానిగా చేస్తే అది రాహుల్‌కు ఇబ్బంది అవుతుందని తన మాటను జవదాటని మన్మోహన్ నే ఆఖరు వరకూ సోనియా కొనసాగించారు. ఎంతో కొంత గౌరవాన్ని ఇస్తూ ప్రణబ్ ను రాష్ట్రపతిగా చేశారు.

జననం: డిసెంబర్ 11, 1935
1969: రాజకీయ ప్రవేశం
1973: కేబినెట్ మంత్రిగా ఎంపిక, ఇందిరకు సన్నిహితుడిగా ముద్ర

1991: ప్రణాళికా సంఘం డిప్యూటీ చైర్మన్‌గా ఎంపిక

1998: సోనియా కాంగ్రెస్ అధ్యక్షురాలు కావడంలో ప్రధాన సూత్రధారి

2004: తొలిసారి లోక్‌సభకు ఎంపిక

2004-2012: యూపీఏ ప్రభుత్వంలో నంబర్ 2గా గుర్తింపు

2004-06: రక్షణమంత్రి

2006-09: విదేశాంగ మంత్రి

2009-12: ఆర్థిక మంత్రి

2012: భారత రాష్ట్రపతిగా ఎన్నిక

2018: ఆరెస్సెస్ సమావేశానికి హాజరైన తొలి మాజీ రాష్ట్రపతిగా గుర్తింపు

2019: భారతరత్న పురస్కారానికి ఎంపిక



రాష్ట్రపతి పదవి నుంచి దిగిన అనంతరం ప్రణబ్ ఇంటికే పరిమితం అయ్యారు. కాంగ్రెస్ కు ఉచిత రాజకీయ సలహాలు ఇచ్చే ప్రయత్నాలు కూడా ఆయన చేయలేదు. బెంగాల్‌లోని ఒక చిన్న దీపపు వెలుగు నుంచి దిల్లీ షాండ్లియర్ వెలుగు జిలుగులను చేరుకునే క్రమంలో నేను అనేక ఒడుదొడుకులను ఎదుర్కొన్నాను" అని తన జీవన ప్రయాణాన్ని ఈ మేరునగధీరుడు ఓ సందర్భంలో వివరించారు.

ప్రణబ్ ముఖర్జీ డిసెంబరు 11, 1935న పశ్చిమ బెంగాల్ లోని బిర్భుమ్ జిల్లా మిరాఠీ గ్రామంలో బెంగాలీ కులీన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. అతని తండ్రి కమద కింకర ముఖర్జీ భారత స్వాతంత్ర్యోద్యమంలో క్రియాశీల సభ్యుడు. అతని తండ్రి 1952 నుండి 1964 వరకు పశ్చిమ బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో భారత జాతీయ కాంగ్రెస్ తరపున సభ్యునిగా, ఎ.ఐ.సి.సి సభ్యునిగా ఉన్నాడు. అతని తల్లి రాజ్యలక్ష్మీ ముఖర్జీ.

అప్పటి కాలంలో కలకత్తా విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఉన్న సూరి (బిర్భుమ్) లోని సూరి విద్యాసాగర్ కళాశాలలో చదివాడు. తరువాత రాజనీతి శాస్త్రం, చరిత్రలో ఎం.ఎ. చేసాడు. కలకత్తా విశ్వవిద్యాలయం నుండి ఎల్.ఎల్.బి డిగ్రీని పొందాడు.

అతను 1963లో కలకత్తా లోని డిప్యూటీ అకౌంటెంట్ జనరల్ (తపాలా, టెలిగ్రాఫ్) కార్యాలయంలో అప్పర్ డివిజనల్ క్లర్క్ (యు.డి.సి) ఉద్యోగంలో చేరాడు. తరువాత విద్యానగర్ కళాశాలలో రాజనీతి శాస్త్రం బోధించే అధ్యాపకునిగా విధులను నిర్వర్తించాడు. రాజకీయాలలోనికి రాక పూర్వం దేషెర్ దక్ పత్రికకు జర్నలిస్టుగా ఉండేవాడు. రాజకీయ అరంగేట్రం..1969లో జరిగిన కాంగ్రెస్ సభలో అతను బంగ్లా కాంగ్రెస్ ప్రతినిధిగా ప్రసంగించాడు. ఆ ప్రసంగం విన్న అప్పటి ప్రధాని ఇందిరాగాంధీ ముగ్ధురాలైపోయింది. అతని తండ్రి స్వాతంత్ర్య సమరయోధుడని, కాంగ్రెస్ పార్టీలో అనేక హోదాల్లో పనిచేశాడని తెలుసుకున్న ఆమె ఒక ఏడాది ముగిసేలోపే అతనికి కాంగ్రెస్ తరపున రాజ్యసభ సభ్యుడయ్యే అవకాశం కల్పించింది. ఇందిరాగాంధీకి అత్యంత విశ్వసనీయమైన వ్యక్తులలో ఒకడైనందున అతను 1973లో కేంద్ర ప్రభుత్వంలో స్థానం పొందాడు. ఓ సాధారణ ఉద్యోగిగానే మొదలైన ఆయన జీవితం దేశ ప్రథమ పౌరుడి స్థాయి వరకు ఎదిగింది. ఈ క్రమంలో ఆయన పడిన కష్టం, చేసిన కృషి, పట్టుదల ఆయన్ను దేశ రాజకీయాల్లో విలక్షణమైన ధ్రువతారలా వెలిగేలా నిలిపింది. రాజకీయ ప్రస్థానంలో ఆయన ఎక్కిన ఒక్కొక్క మెట్టూ నల్లేరు మీద నడకలా ఏమీ సాగలేదు. జీవితంలో ఎన్నో దక్కాముక్కలు తిన్నారు. రాజకీయాల్లో ఎన్నో ఉత్థానపతనాలను చూసిన ప్రణబ్ దాదాకు కేంద్రమంత్రి పదవి అనూహ్యంగా ఎలా దక్కింది.

ప్రమాణస్వీకారం చూడ్డానికెళ్లి.. మంత్రిగా వచ్చి..!

అది 1973.. ప్రణబ్‌కు కేంద్ర సహాయ మంత్రి వరించిన సంవత్సరం.. ఈ పదవి విచిత్రకర పరిస్థితుల్లో దక్కింది. మంత్రివర్గం ప్రమాణ స్వీకారం చూడటానికి రాష్ట్రపతి భవన్‌కు వెళ్లిన ప్రణబ్ ముఖర్జీ కేంద్ర సహాయ మంత్రిగా బయటకొచ్చారు. ప్రమాణం చేయబోయే మొత్తం మంత్రుల సంఖ్య అశుభకరమని 'పెద్దలు' భావించడంతో ప్రణబ్‌ను పారిశ్రామిక అభివృద్ధి శాఖ సహాయ మంత్రిని చేసి 'లెక్క'ను సరిచేశారు. దీంతో అప్పటి నుంచి ప్రణబ్ రాజకీయ 'లెక్కలు' దాదాపుగా తప్పలేదు. రాజీవ్ హయాంలో రాజకీయ చీకటి అంటే ఏమిటో రుచి చూసి మళ్లీ 'వెలుగు'లోకి వచ్చిన తర్వాత ఇక పల్లమంటూ ఎరగలేదు. 1978లో సీడబ్ల్యూసీకి ఎంపికైన ప్రణబ్ 1980లో పార్టీలో నంబర్ 2 స్థానానికి ఎదిగారు. ఇందిరకు కీలక సలహాదారుడిగా ఉన్నారు.

**పల్లెటూరి అబ్బాయి అనిపించుకోవడమే ఇష్టం.**

దాదాగా సుపరిచితుడైన ప్రణబ్‌ను సన్నిహితులు ముద్దుగా పొల్తు అని పిలుచుకొనేవారు. ప్రణబ్ ముఖర్జీకి రోజూ డైరీ రాసే అలవాటు ఉంది. ఎంత తీరిక లేకున్నప్పటికీ రోజూ ఒక పేజీ అయినా రాయడం అలవాటు. రోజూ ప్రణబ్ వేకువజామునే నిద్ర లేచేవారు. పూజ అనంతరం ఇక విధుల్లో మునిగిపోయేవారు. రాత్రి నిద్రకు ఉపక్రమించే ముందు పుస్తక పఠనం అలవాటు. మధ్యాహ్నం ఓ గంట పాటు కునుకు తీయడం అలవాటు. దాదాపు 17 ఏళ్లు స్వగ్రామంలోని పూర్వికుల ఇంట్లోనే ఉన్న ప్రణబ్‌కు స్వగ్రామం, ఆ ఇల్లు అంటే ఎంతో మమకారం. ఇప్పటికీ ఆయన తనను పల్లెటూరి అబ్బాయి అనిపించుకోవడానికే ఇష్టపడేవారు. ప్రణబ్ ముఖర్జీకి చేపల కూర అంటే ఎంతో ఇష్టం. మంగళవారాలు తప్పించి దాదాపు రోజూ చేపల కూర ఉండాల్సిందే!

**లక్కీ నంబర్ 13**

అందరూ దురదృష్టమైనదిగా భావించే '13' ప్రణబ్ ముఖర్జీకి అదృష్ట సంఖ్య. ఈ సంఖ్యతో ప్రణబ్‌కు ఎంతో అనుబంధం ఉంది. భారత 13వ రాష్ట్రపతిగా ఆయన ఎన్నికకావడం గమనార్హం. ఆయన లోక్‌సభకు తొలిసారిగా ఎన్నికైంది 2004 మే 13న. ప్రణబ్‌కు వివాహమైంది 1957 జులై 13న. ఆయన అప్పట్లో నివసించిన తల్కతొరా రోడ్డులోని 13వ నంబర్ ఇంటిలోనే. యూపీఏ ప్రభుత్వంలో వివాదాల పరిష్కర్తగా ప్రముఖ

పాత్ర పోషించిన ప్రణబ్‌కు పార్లమెంటు రూమ్ నంబర్ 13లోనే కార్యాలయం ఉండేది. దివంగత రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీకి తెలంగాణతో ప్రత్యేక అనుబంధం ఉంది. ఎన్నో పోరాటాల ఫలితంగా ఏర్పడ్డ తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు బిల్లుపై రాష్ట్రపతి హోదాలో ప్రణబ్ సంతకం పెట్టారు. పార్లమెంట్ ఉభయ సభలు ఆమోదించిన ఆంధ్రప్రదేశ్ పునః విభజన బిల్లుపై సంతకం చేశారు. ఆయన జారీ చేసిన ప్రత్యేక గెజిట్ ద్వారానే తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా గుర్తింపు పొందింది. అంతేకాకుండా తెలంగాణ ఏర్పాటుకు అప్పటి కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన కమిటీకి ప్రణబ్ నాయకత్వం వహించారు. 2005లో ప్రణబ్ నేతృత్వంలో మంత్రివర్గ ఉపసంఘం ఏర్పాటు చేశారు.

దీంతో కేంద్ర ప్రభుత్వం 2005 మార్చిలో ప్రణబ్ ముఖర్జీ నేతృత్వంలో మంత్రివర్గ ఉపసంఘాన్ని నియమించింది. 8 వారాల్లో ఈ కమిటీ తన నివేదికను ఇస్తుందని కేంద్రం ప్రకటించింది. అన్ని పార్టీల అభిప్రాయాలను తెలుసుకోవడానికి ఈ కమిటీని ఏర్పాటు చేశారు. తెలంగాణపై తమ అభిప్రాయం చెప్పాలని ప్రణబ్ కమిటీ అన్ని పార్టీలకు లేఖలు రాసింది. అప్పట్నుంచి రాష్ట్రం ఏర్పడే వరకూ.. తెలంగాణ ఏర్పాటు ప్రక్రియలో ప్రణబ్ ముఖర్జీ కీలకపాత్ర పోషించారు. రాష్ట్రపతి హోదాలో ప్రణబ్ పెట్టిన సంతకంతోనే తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడింది. రెండుసార్లే లోక్‌సభకు.. భారత మాజీ రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ 45 ఏళ్ల రాజకీయ ప్రస్థానంలో కేవలం రెండుసార్లు మాత్రమే ఆయన లోక్‌సభకు ఎన్నికయ్యారు. ఐదుసార్లు రాజ్యసభకు ప్రాతినిధ్యం వహించారు. 2004, 2009 పార్లమెంట్ ఎన్నికల్లో జంగీపూర్ నియోజకవర్గం నుంచి పోటీ చేసిన దాదా.. ఎంపీగా ఎన్నికయ్యారు. యూపీఏ-1, 2లో కేంద్రమంత్రిగా పని చేశారు. తొలిసారిగా 1982లో ఆర్థిక మంత్రిగా సేవలందించారు. నాడు ఆర్బీఐ గవర్నర్‌గా ఉన్న మన్మోహన్ సింగ్‌ను కలిసి ఆర్థిక వ్యవస్థ ప్రణబ్ గాడిలో పెట్టి తన సత్తా ఏంటో చూపించారు. పీవీ హయాంలో ప్లానింగ్ కమిషన్ చైర్మన్‌గా పని చేసిన అనుభవం ఉంది. ప్రధాని కోరిక తీరలేదు..... ప్రణాళికా సంఘానికి నాయకత్వం వహించిన, ఆర్థిక, రక్షణ, విదేశీ వ్యవహారాలు వంటి మూడు ముఖ్యమైన దస్త్రాలను నిర్వహించిన రాజకీయ నాయకుడిగా ప్రణబ్ ముఖర్జీ ఎంతో పరిణతి చెందిన రాజకీయ నాయకుడిగా భారతీయుల గుండెల్లో చిరస్థాయిగా నిలిచిపోతారు. గాంధీ కుటుంబంలోని మూడు తరాల వ్యక్తులతో కలిసి పనిచేసినప్పటికీ.. ప్రధానమంత్రి పీఠాని అధిరోహించాలన్న కోరిక మాత్రం తీరలేదు. మూడు సార్లు ప్రధాని పీఠం అధిష్టించే అవకాశాలు వచ్చాయి. తుదకు ఆ కోరిక తీరకుండానే మనల్ని వీడి వెళ్లిపోయారు.

1984 లో ఇందిరాగాంధీ హత్యానంతరం తనకు ప్రధాని పదవి వరిస్తుందని ఆశించాడంట మన దాదా. అయితే, అప్పుడు పైలట్ గా ఉద్యోగం చేసుకుంటున్న రాజీవ్ గాంధీని అదృష్టం వరించింది. అప్పుడు కోపంతో కాంగ్రెస్ పార్టీని వీడి సమాజ్ వాది కాంగ్రెస్ పార్టీని నెలకొల్పారు. ఐదేండ్ల అనంతరం 1989 లో రాజీవ్ గాంధీ కోరిక మేరకు తన పార్టీని కాంగ్రెస్ లో విలీనం చేశారు. రెండోసారి 1991 లో రాజీవ్ గాంధీ హత్యానంతరం కూడా ప్రణబ్ పేరు ప్రధాని పదవికి పరిశీలనకు వచ్చింది. ఈ సారి అదృష్టం పక్కదారి పట్టి పీవీ నరసింహారావును వరించింది.

తిరిగి మూడోసారి 2004 లో యూపీఏ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన సమయంలో కూడా అంతా ప్రణబ్ దాదాకే ప్రధాని పీఠం అని భావించారు. అయితే, ప్రధాని పీఠం తనకు వద్దన్నసోనియాగాంధీ.. ఆర్థికవేత్త మన్మోహన్ సింగ్ ను ప్రధాని పదవికి ఎన్నుకున్నారు. దాంతో మరోసారి దాదా ప్రధాని పదవి అధిష్టించే అవకాశం కోల్పోయారు.

ప్రణబ్ ముఖర్జీ ఆటో బయోగ్రఫీ పుస్తకావిష్కరణ సభలో మన్మోహన్ 2017 లో మాట్లాడుతూ, "నేను ప్రధాని అయినప్పుడు ప్రణబ్ ముఖర్జీ ఈ పదవికి మరింత అర్హత సాధించారు. కానీ నేను ఏమి చేయగలను? నన్ను కాంగ్రెస్ అధ్యక్షురాలు సోనియా గాంధీ ఎన్నుకున్నారు. నాకు వేరే మార్గం లేదు. అని ప్రణబ్ అర్హతలు బైటపెట్టారు.  ఐదు దశాబ్దాలపాటు పార్లమెంటుతో తన అనుబంధం కొనసాగించిన ప్రణబ్ ముఖర్జీ.. సామాన్యుడి నుంచి రాష్ట్రపతి స్థాయికి చేరుకోవడం వెనుక ఎంతో శ్రమ ఉన్నది.

చిన్న తనం నుంచి ఎన్నో కష్టాలకు ఓర్చి అంచెలంచెలుగా ఎదిగారు ప్రణబ్‌ముఖర్జీ. 1935 డిసెంబర్ 11న పశ్చిమబెంగాల్లోని ఓ మారుమూల గ్రామంలో  జన్మించిన ఆయన... బాల్యంలో పాఠశాలకు వెళ్లడం కోసం రోజూ 10 కిలోమీటర్లు నడిచారు. 'అప్పట్లో మాకు ఎలాంటి రవాణా సదుపాయాలు ఉండేవి కాదు. చిన్న తనంలో చదువు కోసం రోజూ 10 కిలోమీటర్లు కాలినడకన వెళ్లాల్సి వచ్చేది. వేసవిలో, వర్షాకాలంలో పరిస్థితి దారుణంగా ఉండేది' అని ప్రణబ్‌ముఖర్జీ గతంలో ఓ సందర్భంలో గుర్తుచేసుకున్నారు.

బీర్భూమ్‌లోని సూరి విద్యాసాగర్ కళాశాలలో, కోల్‌కతా యూనివర్సిటీలో ప్రణబ్ ఉన్నతవిద్య కొనసాగింది. పొలిటికల్ సైన్స్, హిస్టరీలో ఎంఏ డిగ్రీతోపాటు ఆయన ఎల్ఎల్‌బీ డిగ్రీ కూడా చేశారు. ప్రణబ్‌ముఖర్జీ తండ్రి కమదా కింకార్ ముఖర్జీ ఓ స్వాతంత్ర్య సమరయోధుడు. మహాత్మాగాంధీ నేతృత్వంలో స్వాతంత్ర్య పోరాటం, ఉద్యమాల్లో పాల్గొన్న కారణంగా ఆయన పలుమార్లు జైలుకు వెళ్లారు. ఆ రోజుల్లో ప్రజలకు తిండి దొరికేది కాదని, బెంగాల్లో దాదాపు 50 లక్షల మంది ఆకలితో చనిపోయారని పార్లమెంటులో ఆహారభద్రతా బిల్లు ప్రవేశపెట్టిన సందర్భంగా ప్రణబ్ గుర్తుచేశారు. దేశ రాజకీయాల్లో మాజీ రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీకి రాజనీతిజ్ఞుడిగా ప్రత్యేక గుర్తింపు ఉంది. సాధారణ క్లర్క్ ఉద్యోగం నుంచి దేశ అత్యున్నత పౌర పురస్కారం భారతరత్న వరకు ఎదిగారు. 1935, డిసెంబర్ 11న పశ్చిమ బెంగాల్‌లోని బీర్‌భమ్ జిల్లాలో ఉన్న మిరాటీ గ్రామంలో ఆయన జన్మించారు. సుర్వ ముఖర్జీని పెళ్లి చేసుకున్నారు. వారికి ఇద్దరు కుమారులు, ఓ కుమార్తె ఉన్నారు. 80 దశాబ్దాల జీవితంలో 50 దశాబ్దాల రాజకీయ జీవితంలో ఎన్నో కీలక పదవులు చేపట్టడంతో పాటు గౌరవ సత్కారాలను పొందారు.

**ముఖ్యమైన ఘట్టాలు.. 1935-2020**

డిసెంబర్ 11, 1935 : పశ్చిమ బెంగాల్ బీర్‌భమ్ జిల్లాలో ఉన్న మిరాటీ గ్రామంలో జననం.

పొలిటికల్ సైన్స్‌లో ఎంఏఅండ్ కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి ఎల్.ఎల్.బీ.

1963 : విద్యానగర్ కళాశాలలో పొటికల్ సైన్స్ అధ్యాపకుడిగా కెరీర్ ప్రారంభం. 1969 : రాజ్యసభ సభ్యుడిగా నియామకం. 1973-1974 : కేంద్ర పరిశ్రమల అభివృద్ధి మంత్రిగా కొనసాగింపు. 1974 : కేంద్ర షిప్పింగ్, రవాణా మంత్రిగా బాధ్యతల నిర్వహణ. 1974-1975 : కేంద్ర ఆర్థికశాఖ మంత్రిగా.. 1975-1977 : రెవెన్యూ, బ్యాంకిగ్ కేంద్ర

మంత్రిగా.. 1978-79 : ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ కోశాధికారిగా.. 1980-82 : కేంద్ర వాణిజ్య, ఉక్కు, గనుల శాఖ మంత్రిగా బాధ్యతల నిర్వహణ. 1980-85 : రాజ్యసభ నాయకుడిగా.. 1982-85 : అంతర్జాతీయ ద్రవ్య నిధి గవర్నర్ల బోర్డు.. 1984 : కేంద్ర వాణిజ్య మంత్రిగా.. 1984-91-96-98 : కాంగ్రెస్ ఐ ప్రచార కమిటీ చైర్మన్‌గా.. 1984,2009-12 : గ్రూప్ ఆఫ్ 24 కు చైర్మన్ (ఐఎంఎఫ్.. ప్రపంచ బ్యాంకుకు సంబంధించిన మంత్రుల వర్గం) 1985,2000-10 : కాంగ్రెస్ పార్టీ రాష్ట్ర విభాగానికి అధ్యక్షుడిగా.. 1961-96 : ప్లానింగ్ కమిషన్ డిప్యూటీ చైర్మన్.. 1993-95 : కేంద్ర వాణిజ్యశాఖ మంత్రిగా.. 1995-96 : విదేశీ వ్యవహారాల శాఖ, కేంద్ర మంత్రిగా.. 1995 : సార్క్ కౌన్సిల్ ఆఫ్ మినిస్టర్స్‌కు అధ్యక్షుడిగా.. 1998-99 : ఏఐసీసీ జనరల్ సెక్రెటరీగా.. 1999-2012 : సెంట్రల్ ఎన్నికలు కోఆర్డినేషన్ కమిటీకి చైర్మన్.. 2004-2012 : లోక్‌సభ నాయకుడిగా.. 2004-06 : కేంద్ర రక్షణశాఖ మంత్రిగా బాధ్యతలు.. 2006-09 : విదేశీ వ్యవహారాల శాఖ కేంద్ర మంత్రిగా.. 2008 : పద్మ విభూషణ్ అవార్డు స్వీకరణ.. 2009-2012 : కేంద్ర ఆర్థికశాఖ మంత్రిగా..

2012 జూలై 25 - 2017 జూలై 25 వరకు భారత 13వ రాష్ట్రపతిగా కొనసాగింపు.. 2019 : భారత అత్యున్నత పౌర పురస్కారం భారతరత్న స్వీకరణ.. ఆగస్ట్ 10,2020 : కరోనా పాజిటివ్‌గా నిర్ధారణ. ఆగస్ట్ 13, 2020 : మెదడులో రక్తం గడ్డకట్టడంతో కోమాలోకి వెళ్లారు.

ఆగస్ట్ 31 : 84 ఏళ్ల వయసులో కన్నుమూత. మేరునగధీరుడు... ప్రణబ్ దాదా'గా సన్నిహితులు ఆత్మీయంగా పిలుచుకొనే 84 ఏళ్ల ప్రణబ్ ముఖర్జీ భారత రాజకీయాల్లో అత్యంత కీలక నేతల్లో ఒకరు. యాభై ఏళ్ల సుదీర్ఘ రాజకీయ జీవితంలో అనేక ఉన్నత పదవులు నిర్వహించిన ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. కాంగ్రెస్‌లో వివాద పరిష్కర్తగా పేరు పొందారు. కరుడుగట్టిన కాంగ్రెస్ వాదే అయినప్పటికీ.. ఒకానొక సందర్భంలో మాజీ రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ ప్రవర్తనపై సొంత పార్టీనే కస్సుబుస్సులాడింది. తప్పు చేస్తున్నావు దాదా అంటూ పలువులు కాంగ్రెస్ పార్టీ నేతలు ఆ పెద్దాయనకే హితవు పలికారు. ఇంతకాలం పాటు కాంగ్రెస్ పార్టీకే సేవ చేసిన ఈ పెద్దాయన ఈ వయస్సులో ఇలా ఎందుకు చేస్తున్నారు అంటూ కామెంట్ చేసిన వాళ్లూ లేకపోలేదు. కానీ వాటన్నింటికీ పట్టించుకోని ప్రణబ్ ముఖర్జీ మాత్రం తనకు తోచిందే చేశారు. అదేంటో కాదు... 2018లో జూన్ 7న నాగపూర్‌లో జరిగిన ఆర్ఆర్ఎస్ సమావేశానికి హాజరవడమే. అవును, బీజేపికి అనుబంధ సంస్థ అనే పేరున్న ఆర్ఎస్ఎస్ అతిథిగా ఆహ్వానిస్తే వెళ్లడం ఏంటంటూ ప్రణబ్ దాదాపై కాంగ్రెస్ పార్టీలో తీవ్ర వ్యతిరేకత, విమర్శలు వ్యక్తమయ్యాయి.

ప్రణబ్ ముఖర్జీ జీవితంలో రెండేళ్ల క్రితం జరిగిన ఈ ఘటన అప్పట్లో తీవ్ర చర్చనీయాంశమైంది. కానీ ఆర్ఎస్ఎస్ సమావేశానికి అతిథిగా వెళ్లిన ప్రణబ్ ముఖర్జీ అక్కడ సభావేదికపై మాట్లాడిన తీరు చూశాకా మాత్రం.. ఆయన్ని విమర్శించి వాళ్లందరి నోర్లు మూతపడ్డాయి. కారణం లేనిదే దాదా ఏదీ చేయరనే నిర్ణయానికొచ్చాయి.

రెండు సార్లు ప్రధానమంత్రి పదవి దరిదాపుల్లోకి వెళ్లారు. రాష్ట్రపతిగా గౌరవమర్యాదను పొందారు. భారతరత్నగా నిలిచారు. సంకీర్ణ రాజకీయంలో కాంగ్రెస్ ట్రబుల్ షూటర్‌గా ఆయన సాగించిన రాజకీయ పయనం అలాంటిలాంటిది కాదు. ఆ సుదీర్ఘ ప్రస్థానానికి తెరపడింది. అనారోగ్యంతో ఆసుపత్రి పాలైన ఆయన కోమాలో ఉంటూ చికిత్స పొందుతూ మరణించడంతో దేశ రాజకీయాల్లోనే ఒక శకం ముగిసినట్టు అయ్యింది. రాష్ట్రపతి పదవి నుంచి దిగిపోయాకా కూడా.. ఏదోలా ప్రణబ్ పేరు రాజకీయాల్లో వినిపించసాగింది. ప్రత్యేకించి గత ఎన్నికల ముందు.. మోడీకి ప్రత్యామ్నాయంగా ప్రణబ్‌ను ప్రధానిగా దించాలనే వ్యూహాలను కూడా కొంతమంది రచించారు. దేశ రాజకీయాల్లో అంత ప్రాధాన్యతను పొందిన వ్యక్తి ప్రణబ్.

కాంగ్రెస్ రాజకీయాల్లో తలపండిపోయి, కొన్నేళ్ల పాటు ఆ పార్టీకి దూరమై చివరకు ఆ పార్టీకే దగ్గరైన నేత ప్రణబ్. కాంగ్రెస్ రాజకీయాలను ప్రణబ్ తరహాలో అవపోసన పట్టిన వారిలో మరొకరు లేరని చెప్పుచ్చు. సంకీర్ణ రాజకీయాల్లో పార్టీ కష్టాల్లో ఉన్నప్పుడల్లా ప్రణబ్ చక్రం అడ్డేస్తూ వచ్చారు. అందరిని కలుపుకుపోతూ ప్రభుత్వాలను రక్షిస్తూ వచ్చారు.

2004 నుంచి 2009 వరకూ కూడా సోనియాగాంధీ ఏదో తన చాతుర్యంతో ప్రభుత్వాలను నిలబెట్టుకోలేదు. ప్రణబ్ తో సహా ఆంటోనీ వరకూ అనేక మంది ఆ సంకీర్ణ ప్రభుత్వాలను నిలబెట్టడానికి శతథా ప్రయత్నించారు. వారి మాటకు పార్టీలో విలువున్నంత వరకూ కాంగ్రెస్ పరిస్థితి బాగానే ఉండింది. ఎప్పుడైతే ప్రణబ్ ను క్రియాశీల రాజకీయాల నుంచి సోనియా తప్పించారో, ఆంటోనీ వంటి వారు మెత్తబడ్డారో.. అక్కడి నుంచినే కాంగ్రెస్ పార్టీ పతనావస్థ కూడా మొదలైంది.

ఇందిరాగాంధీ మరణించిన సమయంలో సీనియర్ కాంగ్రెస్ నేత హోదాలో ప్రధాన మంత్రి పదవిని ఆశించారు ప్రణబ్ . తాత్కాలికంగా అయినా తను ఆ బాధ్యతలను చేపట్టాలని ఆయన ఓపెన్ గానే తన ప్రతిపాదన పెట్టారంటారు. ఆ ప్రతిపాదనతోనే రాజీవ్ గాంధీ ఆగ్రహానికి గురయ్యారట ప్రణబ్. ఆ సమయంలో ఆయన కాంగ్రెస్ పార్టీని వీడారు. సొంత పార్టీ పెట్టుకున్నారు. అయితే చివరకు రాజీవ్ గాంధీనే ఆయనతో రాజీకి వచ్చారంటారు.

రాజీవ్ మరణానంతరం కూడా ప్రణబ్‌కు అలాంటి అనుభవమే ఎదురయ్యిందంటారు. కాంగ్రెస్ పార్టీకి అధికారం దక్కిన ఆ సందర్భంలో ప్రణబ్ పీఠాన్ని ఆశించగా, సోనియా ఛాయిస్ పీవీ అయ్యారంటారు.

ఇక 2004లో కాంగ్రెస్ పార్టీ మళ్లీ అధికారానికి చేరువైనా.. ప్రణబ్ ను మాత్రం సోనియా పరిగణనలోకి తీసుకోలేదు. మన్మోహన్ వైపు ఆమె మొగ్గు చూపారు. అయితే కీలక శాఖలు, కీలక బాధ్యతల్లో ప్రణబ్ రాణించారు. యూపీఏ రెండోసారి అధికారం చేపట్టాకా ఒక దశలో మన్మోహన్ ను పీఠం నుంచి దింపి , ప్రణబ్ ను ప్రధానిగా చేస్తారనే వార్తలు వచ్చాయి. దానికి మన్మోహన్ కూడా అభ్యంతరం వ్యక్తం చేసే పరిస్థితి లేకపోయింది. అయితే ఈ కాకలు తీరిన నేతను ప్రధానిగా చేస్తే అది రాహుల్ కు ఇబ్బంది అవుతుందని తన మాటను జవదాటని మన్మోహన్ నే ఆఖరు వరకూ సోనియా కొనసాగించారు. ఎంతో కొంత గౌరవాన్ని ఇస్తూ ప్రణబ్ ను రాష్ట్రపతిగా చేశారు.

రాష్ట్రపతి పదవి నుంచి దిగిన అనంతరం ప్రణబ్ ఇంటికే పరిమితం అయ్యారు. కాంగ్రెస్ కు ఉచిత రాజకీయ సలహాలు ఇచ్చే ప్రయత్నాలు కూడా ఆయన చేయలేదు. బెంగాల్‌లోని **ఒక చిన్న దీపపు వెలుగు నుంచి ఢిల్లీ షాండ్లియర్ వెలుగు** జిలుగులను చేరుకునే క్రమంలో నేను అనేక ఒడుదొడుకులను ఎదుర్కొన్నాను" అని తన జీవన ప్రయాణాన్ని ఈ మేరునగధీరుడు ఓ సందర్భంలో వివరించారు. కాంగ్రెస్ భీష్ముడికి నివాళి.

# కరోనా - ఒక విశ్లేషణ!

– ప్రొఫెసర్, పూర్వ ఎమ్మెల్సీ, **కే.నాగేశ్వర్,** ఎనాలసిస్

ఇంతటితో ప్రపంచం అంతం అవుతుందని అనుకోవడం సరికాదు. WHO అభిప్రాయం ప్రకారం కోవిడ్ –19 వైరస్ సోకిన వారిలో 3-4 శాతం మాత్రమే మృత్యువాత పడుతున్నారు. కొన్ని దేశాలలో మరణించే వారి శాతం కొంచెం ఎక్కువుగా ఉండవచ్చు. చార్లెస్ డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం ప్రకారం కొత్తగా పుట్టే జీవులు, ముందే వున్న జీవుల తగ్గుదలకూ లేదా అంతానికి కారణం కావచ్చు. ఇది ప్రకృతిలో సాధారణం. మనుషుల వల్ల ఇప్పటికే చాలా జీవజాతులు అంతరించిపోయాయి. వైరల్ ఎపిడమిక్స్ మానవజాతి అంతానికి కారణం కాగలవని కొందరు శాస్త్రవేత్తలు అంచనా వేశారు. అయితే మానవ మేధస్సు వాటి ప్రభావాన్ని అడ్డుకోగలదు. రోజు రోజుకీ మనిషి మేధస్సుతో ఎంతో అభివృద్ధిని సాధిస్తున్నాడు. ఈ అభివృద్ధితో పాటు కొన్ని అనర్థాలకూ కారణం అవుతున్నాడు. ఆ అనర్థాల ప్రభావాన్ని తగ్గించే దిశగా కూడా కొన్ని ప్రయత్నాలు చేస్తున్నాడు.

కరోనా వైరస్‌ను చైనా సృష్టించిందనీ, ఈ అనర్థం వెనుక సైన్స్ పరిశోధనలే కారణమనీ ఆధారం లేని ఆరోపణలు వస్తున్నాయి. అయితే మనం చరిత్రని చూస్తే ఇలాంటి మహమ్మారులు ఎన్నో పుట్టాయి! అసలు సైన్స్ అభివృద్ధి చెందని కాలంలో ఎన్నో వైరసులు, బాక్టీరియాలు కోట్ల మంది మరణాలకు కారణమయ్యాయి. 1918 ప్రాంతంలో స్పానిష్ ఫ్లూ దాదాపు 5 కోట్ల మందిని హరించింది. 1346-53 ప్రాంతంలో ప్లేగు యూరోప్ లో 1/3 వంతు జనాభాని మాయం చేసింది. ఇలా మానవ చరిత్రలో ఎన్నో దారుణ సంఘటనలు చోటు చేసుకున్నాయి. అయితే భవిష్యత్తులో ఇలాంటి మహమ్మరులను మానవ సమాజం అడ్డుకోగలదా?

ఈ కోవిడ్-19 - శాస్త్రవేత్తల అభిప్రాయంలో ఓ బలహీనమైన వైరస్. అందుకే మరణాలు 3-4 శాతం లోపే వుంటున్నాయి!

ఒకవేళ ఇంతకన్నా బలమైన వైరస్ పుట్టి మరణాలు 30-40 శాతం ఉంటే? అది కరోనా కన్నా వేగంగా వ్యాప్తి చెందితే వాటి ఇంక్యూబేషన్ సమయం కొన్ని గంటలు మాత్రమే అయితే అది గాలి, నీరు ద్వారా వ్యాప్తి చెందితే? అది సోకిన మనిషి కేవలం కొన్ని గంటలలో మరణిస్తే? కొన్ని హాలీవుడ్ సినిమాలలో మాదిరి మనుషులు జాంబిల్లా తయారయితే ఇవన్నీ వూహలే కానీ అసంభవాలు మాత్రం కాదు. అయితే వీటికి మనిషి సిద్దంగా ఉన్నాడా? వాటిని ఎదుర్కోగలడా ఇప్పటికే అభివృద్ధి చెందిన దేశాలైన అమెరికా, ఇటలీ, స్పెయిన్ కరోనాతో తల్లడిల్లుతున్నాయి. ఇక ఆసియా, ఆఫ్రికా దేశాలలో పరిస్థితులు ఎలా ఉండబోతున్నాయి! మానవ జాతి ఇలాంటి విపత్తులని ఎలా ఎదుర్కోవాలి

ముందు విద్యా, వైద్యం పట్ల అన్ని దేశాల వైఖరీ మారాలి. జాతీయవాదం లాంటి సంకుచిత భావాలను విడనాడాలి. ప్రజల్లో జాతీయావాదాన్ని రెచ్చగొడుతూ తమ ఉనికి కోసం ప్రజాస్వామ్య నియంతల వైఖరిని ప్రజలు తిప్పి కొట్టాలి. రక్షణ రంగం మీద పెట్టే ఖర్చుని తగ్గించుకోవాలి. అయితే ఇవన్నీ అసాధ్యం అనుకోవచ్చు! కానీ మానవ ఉనికి కోసం ఇది జరగాలి.

తరువాత చెప్పుకోబోయేది ఎన్నో యేళ్లుగా మనిషిని అంధకారంలో ఉంచడానికి కారణం అవుతోన్న, సైన్స్ అభివృద్ధికి విఘాతంగా ఉన్న, మనుషుల్లో మూఢత్వాన్ని పెంపొందిస్తున్న, మనుషుల్లో విచక్షణా జ్ఞానాన్ని అణచి సాటి మానవుల చావుకు కారణం అవుతున్న 'మతం'. మనిషి సంఘజీవిగా ఉన్నప్పటి నుంచి ఈ మతం చేసిన అరాచకాలను ఒప్పుకోవడానికి ఏ మతానికీ ధైర్యం చాలదు. చేసిన తప్పులని ఆత్మవిమర్శ చేసుకునే నిజాయితీ అసలు లేదు. భారత్ లో అంటరాని తనానికి, కుల వ్యవస్థకి, పేదరికానికి, అజ్ఞానానికీ, యూరోప్ దేశాల్లో ఎంతో మంది శాస్త్రవేత్తల క్రూరమైన చావులకీ, ప్రస్తుత అరబ్ దేశాల్లో నియంతృత్వానికీ, తీవ్రవాదానికీ కారణమైనదీ ఇదే. మత మౌఢ్యం మనిషి పతనానికి ఏ రకంగా కారణం అవుతుందో చూద్దాం.

కార్ల్ మార్క్స్ చెప్పిన సోమరి జాతుల్లో మత ప్రబోధకుల జాతి ఒకటి. వీళ్ళు దేశానికి గానీ, మానవ సమాజానికి గానీ ఎటువంటి శ్రమను, మూల ధనాన్ని గాని అందించకుండా శ్రమ జీవుల నుంచి దక్షిణలు, దశమ భాగాల పేరుతో శ్రమ దోపిడీకి పాల్పడతూ ఉంటారు. పైగా శ్రమజీవుల విశ్రాంతి దినాలనూ, సమయాన్నీ దోచుకుంటారు. ఇంకా కొందరు కొంచెం ముందడుగేసి పని చెడగొట్టే పనికిమాలిన ప్రబోధాలతో విలువైన జాతి సంపదకు గండి కొడుతున్నారు. పైగా వీరి దోపిడీకి ఎటువంటి పన్నులూ ఉండవు. చిన్న చిన్న గుడిసెల్లో, రోడ్డు పక్క గుడారాలతో ప్రారంభం అయ్యే వీరి ప్రస్థానం పెద్ద బంగాళాల్లో, ఖరీదైన కార్లలో, విమానాల్లో తుల తూగుతుంటుంది. పైగా వీరు విశ్వ మానవ సౌభ్రాతృత్వాన్ని చెడగొట్టి, ప్రజల్లో సంకుచిత భావనలు నాటుతారు. మత గ్రంథాల్లో ఉన్న అజ్ఞాన అంధకారం చాలదన్నట్టు కొత్త కొత్త భాష్యాలతో,సరికొత్త పూజలు, ప్రార్థనలు, నూతన దుస్సంప్రదాయాలకు, విష బీజాలను ప్రజల మనసుల్లో ప్రతిష్టిస్తారు. పైగా తమ మత గ్రంథాల్లో సమస్త విజ్ఞానం ఉందనే అజ్ఞానపు వాదనలతో మెదడుకు మేకులు కొడతారు! ప్రార్థనలు,యాగాలు, రకరకాల వికారపు విన్యాసాలు, భయానక భీభత్స ప్రసంగాలు, ఆశ్రమాల పేరుతో భూకబ్జాలు, చిన్న పిల్లల, సాయం కోరి వచ్చిన ఆడవాళ్ళ పై అఘాయిత్యాలు ఇలా చెప్పుకుంటూ పోతే వీరి దుర్మార్గాలకి అంతులేదు. కొ(చె)త్త వైద్య ప్రక్రియలు కనిపెట్టి, అన్ని రోగాలనూ ప్రార్థనలతో నయం చేస్తామని ప్రగల్బాలు

పలికే మత బోధకులు ఈ కరోనా పై నోరు మెదపరు. కొన్ని రోజుల కిందటి చైనా క్రైస్తవుల్ని హింసిస్తుంది కాబట్టి అక్కడ కరోనా విజృంభించింది అన్న మత ప్రబోధకుడు సెయింట్ పీటర్స్ చర్చ్ నెలవైన ఇటలిలో ఎందుకు విజృంభిస్తుందో సమాధానం చెప్పడు. బాలాజీ దయ వల్లే భారత్ లో కరోన లేదన్న పూజారులు కరోనా ప్రభావంతో సదరు గుడినే ఎందుకు మూసేశారో చెప్పడు. అన్ని శాస్త్ర సాంకేతిక విశేషాలూ తమ మత గ్రంథాల్లో ఉన్నాయని డప్పు కొట్టుకునే వాళ్ళు ఈ కరోనా కి మందు కనిపెట్టి, నోబెల్ ప్రైజ్ ని వాళ్ళ దేవుడికి అంకితం చెయ్యొచ్చు కదా. కరోనా తగ్గడానికి కొత్త యోగాసనం కనిపెట్టి వాళ్ళ దేవుడి పేరుతో పేటెంట్ తీసుకోవచ్చు కదా? ఇవేమీ చేయలేరు. సామూహిక ప్రార్ధనలు, హిస్టీరియా ఏడుపులు, పొర్లు దండాలు, తెల్లవారు జాము మైకు గోలలు, ఇవేమీ వైరస్ ల నుండి కాపాడలేవు. దేవుడి పేరుతో చేసే రికార్డింగ్ నృత్యాలు, పబ్లిక్ న్యూసెన్సు. పెద్ద స్పీకర్లు పెట్టి మరీ ఏడ్చే ఏడుపులే కదా వీరు చేసే దైవ కార్యాలు. ఈ పిచ్చి ఇంకా విస్తృతమయి, తమ దేవుడే నిజమైన దేవుడని వాదిస్తారు! మత మార్పిడులు, మారని వారి పై దాడులు, ఇది ఇంకా ముదిరి తీవ్రవాదం చోటుచేసుకుంటుంది. ఈ తీవ్రవాదం వల్ల మానవ సమాజం ఎదుర్కొంటున్న సమస్యలు తెలియనివి కాదు. ఇదే ప్రస్తుతం అభివృద్ధి తీవ్ర ఆటంకం. నాస్తికులు అత్యధికంగా ఉన్న దేశాలైన నార్వే, ఫిన్లాండ్, ఆస్ట్రేలియా వంటి దేశాలు మానవాభివృద్ధి, సంతోషకర దేశాల సూచికల్లో ముందున్నాయి. దాదాపు ఆస్తికులదేశాలైన పాకిస్తాన్, బంగ్లాదేశ్, ఇండియా మరియు ఆఫ్రికా దేశాలు ఎందుకు వెనుకబడ్డాయి? పైగా నేరనార్వే, ఫిన్లాండ్, ఆస్ట్రేలియా వంటి దేశాల్లో చాలా తక్కువగా ఉంది. దీన్ని బట్టి మతానికీ నైతికతకూ ఎలాంటి సంబంధం లేదు. మతం మనకు ఎలాంటి నైతికత నేర్పుతుంది అనే విషయం పై రిచర్డ్ డాకిన్స్ అనే రచయిత గాడ్ డేల్యూజన్ అనే పుస్తకంలో చక్కగా వివరించారు.

ఇప్పటికైనా అజ్ఞానాన్ని విడిచిపెట్టి విలువైన సమయాన్నీ, డబ్బునూ, జనం విద్య – వైద్యానికి ఖర్చు పెట్టండి లేదా మదుపు చేయండి . ప్రభుత్వాలు కూడా సంక్షేమం పేరిట ప్రజా ధనాన్ని పప్పు బెల్లాల్లా పంచి పెట్టకుండా విద్యా, వైద్యానికీ సరైన కేటాయింపులు చేయాలి. మతం పేరుతో తిరిగే సోమరిపోతుల ఆదాయాన్ని టాక్స్ పరిధిలోకి తీసుకురావాలి. కాలు కదపకుండా ప్రజల దక్షిణల, దశమ భాగాల, కానుకలతో జల్సా చేసే వాళ్ళను ప్రజలు గుర్తించాలి! వారికి శ్రమ విలువ తెలియచేయాలి. ప్రజలు హేతువాదంతో, తర్కంతో కూడిన ఆలోచనలతో,, ప్రశ్నించే స్వభావాన్ని కలిగివున్నప్పుడే ఇవన్నీ సాధ్యమవుతాయి. అప్పటి వరకూ ఈ సోమరిపోతులు సామాన్యుల అజ్ఞానాన్ని ఆసరాగా తీసుకుని వారిపైనే స్వారీ చేస్తూ ఉంటారు.

# ఫోటోగ్రఫీ దినోత్సవం సందర్భంగా

**పి.లక్ష్మణ్ రావ్,** అసిస్టెంట్ రిజిస్ట్రార్ (సహకార శాఖ) విజయనగరం, 9441215989

ఫోటోగ్రాఫర్
స్మైల్ ప్లీజ్ .......
కాస్త నవ్వండి .........
అంటూ
తమ ఏకాగ్రతను
మన ముఖాల మీద నిలిపి
మనల్ని అందంగా చూపించడానికి
వాళ్ళు అపసోపాలు పడుతుంటారు !
ఫోటోలు తీయడమంటే ....
మనం సెల్ఫీల్లో తీసుకున్నట్టు
బండ ముఖాలుగా చిత్రించడం కాదు కదా
అది ఓ అందమైన కళ !
నాలుగ్గోడల మధ్య చిత్రీకరించినా
ఆరు బయట అందరి మధ్య చిత్రీకరించినా
అర్జునుడి గురి చిలుక కన్నుపై పెట్టినట్లు
తమ దృష్టంతా ఆబ్జెక్టుపైనే అతికిస్తారు !
శుభాశుభకార్యాల్లో చిత్రీకరణకు
సరాసరి సర్కస్ విన్యాసాలే చేస్తారు
కార్యక్రమం ప్రారంభం నుండి
పూర్తయినంతవరకు
బాధ్యతను మెడలో వేలాడదీసి
భుజం మీద బరువుగా మోసి
వేదిక చుట్టూ ప్రదక్షిణాలు చేస్తూనే
వుంటారు !
ప్రమాదాలను చిత్రీకరించి నప్పుడు
నిర్జీవ భౌతిక కాయాలను
చిత్రీకరించినప్పుడు
కన్నీటి సుడులు మధ్య
వారి మనసంతా ద్రవీభవిస్తుంది !
ఉద్యమాలను, ఆందోళనలను
చిత్రీకరించినప్పుడు
లారీలు, తూటాల మధ్య
ప్రాణాలను పణంగా పెడతారు !
సామాజిక బతుకు చిత్రాలను చిత్రీకరించి
మానవతా వాదులుగా
మరో అవతారం ఎత్తుతారు !
జాతరలు, తీర్థయాత్రలు
మోహాలు, సమ్మోహనాలు
సభలు, సమావేశాలు
ఆటలు, పాటలు
ఉత్సవాలు, వేడుకలు అన్నీ
వారి కెమెరా నేత్రంలో నిక్షిప్తమై
ఛాయా చిత్రాలుగా ప్రత్యక్షమౌతాయి
మదిలో మెదిలే చిత్రాలుగా కనువిందు
చేస్తాయి !
వర్తమానంలో వారు తీసిన చిత్రాలు
చరిత్ర పుటల్లోకి జారిపోయి
భావితరాలవారికి సాక్ష్యాలౌతాయి !
వ్యక్తిగతంగా వారు తీసిన చిత్రాలు
మధుర జ్ఞాపకాలుగా మిగిలిపోయి
వారసత్వానికి ప్రతినిధులుగా
ముచ్చటగొల్పుతాయి !
ఛాయాచిత్రాలతో మనల్ని అలరించిన
ఈ అపురూప కళాకారులు
అదృశ్య రూపాలుగా
తెరవెనుకే మిగిలిపోయినా
చెక్కు చెదరని రూపాలుగా
మన మనస్సులో మెదులుతూనే ఉంటారు!
**జై ఫోటోగ్రాఫర్ ! జై జై ఫోటోగ్రాఫర్ !**

# కవిసామ్రాట్ విశ్వనాథ

– డా॥ ఆదినారాయణ, ఎం.ఎ.పిహెచ్‌డి

**మా**ట్లాడే వెన్నెముక –పాటపాడే సుషుమ్న, అంటూ విశ్వనాథ సత్యనారాయణను మహాకవి శ్రీశ్రీ అభివర్ణించాడు. శ్రీశ్రీ వంటి విప్లవభావ కవితామూర్తులను కూడా వెంటాడిన కవితావతారుడు విశ్వనాథ. సెప్టెంబర్ 10వ తేది విశ్వనాథ జయంతి. ఈ మహాకవి పుట్టి 125 పూర్తయ్యాయి. తెలుగుదనాన్ని, భారతీయతను ప్రేమించేవారంతా విశ్వనాథను ప్రేమిస్తారు. తెలుగుదనాన్ని అణువణువూ నింపుకొని కవిత్వం సృష్టించిన ఆంధ్రపౌరుషుడు. విశ్వనాథ పట్టుకోని సాహిత్యప్రక్రియ లేదు. ప్రతి క్షేత్రంలోనూ అద్భుతమైన పంటలు పండించాడు. కల్పవృక్షాలు వేశాడు. కావ్యాలు, శతకాలు, నవలలు, నాటకాలు, పీఠికలు, విమర్శనా వ్యాసాలు, కథలు, గాథలు అన్నీ రాశాడు. రాసిన ప్రతి చోటా, బంగారుబాటలు వేశాడు. భారతదేశ సాహిత్యలోకంలో తెలుగుభాషా గౌరవాన్ని చాటి చెప్పాడు. తెలుగులో మొట్టమొదటి జ్ఞానపీఠం పురస్కారం పొందిన ఘనుడు విశ్వనాథ. ఆ కాలంలో తెలుగు ఉపాధ్యాయుడు లేదా ఉపన్యాసకుడు ఎవరూ ప్రిన్సిపాల్ పదవిని అలంకరించలేదు. అది కూడా సాధించిన ఘటికుడు. సారస్వత ప్రభ –లౌకిక ప్రతిభ రెండూ సమానంగా ఉన్న సవ్యసాచి. తదనంతర జీవితంలో మహానటుడుగా అవతరించిన ఎన్టీఆర్‌లో, నటుడు దాగి ఉన్నాడని గుర్తించి, మొట్టమొదటిసారిగా నాగమ్మ పాత్ర వేయించి, ప్రోత్సహించినవాడు విశ్వనాథ. ఎన్టీఆర్ ఇంటర్మీడియట్ చదివే రోజుల్లో వీరి శిష్యుడు. ఎన్టీఆర్‌లో ఆంధ్రపౌరుషాన్ని, భాషాభినివేశాన్ని రగిల్చినవాడు విశ్వనాథ. ఎందరికో ఫీజులు కట్టి, ఇంట్లో ఉంచుకొని భోజనం పెట్టి విద్యాదానం చేసిన మహనీయుడు విశ్వనాథ సత్యనారాయణ. ఇంగ్లీష్ కు వ్యతిరేకి అనే ముద్ర విశ్వనాథకు ఉంది. కానీ, ఆయన బాగా ఇంగ్లీష్ చదువుకున్నాడు. సుప్రసిద్ధ పాత్రికేయులు కె.రామచంద్రమూర్తి జర్నలిజం విద్యార్థిగా ఉన్నప్పుడు డెక్కన్ క్రానికల్ పత్రిక కోసం విశ్వనాథను ఇంటర్వ్యూ చేయవలసి వచ్చింది. నేను అడిగే ప్రశ్నలకు మీరు తెలుగులో సమాధానం చెప్పవచ్చు, నేను ఇంగ్లీష్ లోకి మార్చుకుంటానని, మూర్తి విశ్వనాథకు వివరించారు. అవసరం లేదు. నువ్వు ఇంగ్లీష్ లో అడుగు, నేను నాకు వచ్చిన ఇంగ్లీష్‌లో సమాధానాలు చెబుతానని విశ్వనాథ బదులిచ్చాడు. ఇంటర్వ్యూ పూర్తయిన తర్వాత ఒక్క అక్షరం, ఒక్క పదం కూడా మార్చకుండా డెక్కన్ క్రానికల్ ఇంగ్లీష్ పత్రిక ప్రచురించింది. మంచి ఇంగ్లీష్ భాషాజ్ఞానం కలిగినవాడు విశ్వనాథ. పైకి కోపంగా, గర్వంగా కనిపించినా, లోపల మెత్తని మనిషి ఉన్నాడని విశ్వనాథతో బాగా పరిచయం ఉన్నవాళ్లు తరచూ చెబుతుంటారు. బహుభాషావేత్త పివి నరసింహారావుకు కూడా విశ్వనాథ నవలాశిల్పం అంటే చాలా ఇష్టం. అందుకే, వేయిపడగలు నవలను సహస్రఫణ్ పేరుతో హిందీలోకి ఆయనే స్వయంగా అనువదించారు. విశ్వనాథకు సంగీతమంటే కూడా చాలా ఇష్టమేకాక, బాగా పాడుతారు కూడా. విశ్వనాథ పద్యగానంలో ఒక ప్రత్యేకమైన ఆకర్షణ ఉంటుందని విన్నవాళ్ళు చెబుతారు. విశ్వనాథ ప్రతిభ అసామాన్యమైంది. గొప్ప జ్ఞాపకశక్తి. మేధాశ్రమ కూడా చాలా ఎక్కువ. బాగా చదవడం, రాయడం, జీవితాంతం అక్షర సేద్యంలోనే గడిపాడు. ఎందరో విద్యార్థులకు స్ఫూర్తిగా నిలిచాడు. రామాయణ కల్పవృక్షం, వేయిపడగలు వంటి అసాధారణమైన సాహిత్య సృష్టి చేశాడు. విశ్వనాథ హృదయం, మెదడే ఒక జ్ఞానపీఠం, సారస్వత జలపాతం. అలవోకగా సాహిత్య సృష్టి చేస్తాడు. ఈ ప్రతిభ అనన్య సామాన్యం.



గొప్ప ఉపాధ్యాయుడు. మహాకవి. మహా చతురుడు. విశ్వనాథను చూడడం, వినడం ఆ కాలంలో పెద్ద మోజు. ఒంటిచేత్తో అంతటి సాహిత్య సృష్టి చేసిన ఆధునిక కవి విశ్వనాథ తప్ప ఇంకొకడు లేడు. వారి ప్రతి రచనా సుప్రసిద్ధమే. రసగుళికలు వంటి రచనలు చేశాడు. భారతీయ చరిత్రను బ్రిటీష్ వాళ్ల తప్పుల తడకగా రాయించారనే కోపం ఉండేది. మన విద్యావిధానం, సంస్కృతి భ్రష్టు పట్టడానికి ఇంగ్లీష్ వాళ్లే కారణమంటూ, జీవితాంతం వారిని ద్వేషించాడు. ఏ రచనా ప్రక్రియ చేపట్టినా, ఏ వస్తువు ఎంచుకున్నా, తెలుగుదనం, భారతీయత వైపే దాన్ని తీసుకెళ్ళేవాడు. సముద్రంపై పక్షి ఎంత ఎగిరినా రాత్రికి గూటికి ఎలా చేరుతుందో, మనం ఎక్కడెక్కడ తిరిగినా తిరిగి భారతీయత దగ్గరికి రావాల్సిందే, రావాలి అని వ్యాఖ్య చేశాడు. అంతగా, తన రచనల ద్వారా భారతీయతను అడుగడుగునా నింపేవాడు. అదే ఆయన శ్వాస. ఛాందసుడని కొందరు తిట్టుకున్నా ఆయన లెక్క చేయలేదు. సంప్రదాయం, సనాతన మార్గంలోనే జీవితమంతా నడిచాడు. పదునైన, రసవంతమైన రచనా శిల్పం, వర్ణనా నైపుణ్యం విశ్వనాథను ఆధునిక కాలంలో అగ్రపీఠంలో నిలబెట్టాయి. విశ్వనాథ సిగలో ఎన్నో కీర్తి కిరీటాలు చేరాయి. పద్మభూషణ్, కళాప్రపూర్ణ, డి లిట్ వంటి గౌరవాలు, జ్ఞానపీఠ్, కేంద్ర సాహిత్య అకాడెమి వంటి పురస్కారాలు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి వంటి పదవులు, గజారోహణాది ఘన సత్కారాలు పొందిన వైభవమూర్తి విశ్వనాథ. ఇటువంటి మహాకవుల పుట్టుక అరుదైన వేడుక. వీరి పుట్టుకతో తెలుగుపుడమి పులకించింది. విశ్వనాథ జీవితం ఎక్కువగా విజయవాడతోనే పెనవేసుకుని సాగింది. తెలంగాణలోని కరీంనగర్, వరంగల్ ప్రాంతాల్లోనూ విశ్వనాథకు వీరాభిమానులు ఉన్నారు. తెలుగుదనాన్ని ప్రేమించే వారంతా విశ్వనాథను పూజిస్తారు. తెలుగు వెలుగు విశ్వనాథ మనకు నిత్య స్మరణీయుడు. వారి సాహిత్యం నిత్య పఠనీయం. ఈ తేజోమూర్తికి జోతలు సమర్పిద్దాం.

# నవ్వుల రారాజు

ఎ.విజయ్‌బాబు

రాజబాబు, రేలంగి... ఈ ఇద్దరి కమెడియన్ల పేర్లను తెలుగు సినిమా ప్రేక్షకులు ఎప్పటికీ మర్చిపో లేరని చెప్పుకోవచ్చు. అప్పట్లో రాజబాబు హీరోలతో సమానంగా రెమ్యూనరేషన్ తీసుకున్నారంటే అతని హాస్యనటనకు ఎంత డిమాండ్ ఉందో అర్థం చేసుకోవచ్చు. 1937 అక్టోబర్ 20 తేదీన తూర్పుగోదావరి జిల్లాలోని రాజమండ్రిలో మా మహేశ్వర రావు రమణమ్మ దంపతులకు జన్మించిన రాజబాబు అసలు పేరు పుణ్యమూర్తుల అప్పలరాజు.ఇతనికి తమ్ముల్లుగా జన్మించిన చిట్టిబాబు, అనంత్ బాబు కూడా తెలుగు పరిశ్రమలో హాస్యనటులుగా కొనసాగారు. ఆనాటి కాలంలోనే రాజబాబు ఇంటర్మీడియట్ విద్యాభ్యాసం పూర్తి చేసి టీచర్ ట్రైనింగ్ కోర్స్ పూర్తి చేసి తెలుగు ఉపాధ్యాయుడిగా కొన్ని రోజుల పాటు పనిచేశారు. అయితే ఆ సమయంలోనే నాటకాలలో నటించడం ప్రారంభించారు రాజబాబు. కుక్కపిల్ల దొరికింది నాలుగిళ్ళ చావిడి అల్లూరి సీతారామరాజు వంటి నాటకాలలో వేషాలు వేసిన రాజబాబుకి చాలా గొప్ప పేరు లభించింది. దాంతో సినిమాలో కూడా ప్రయత్నం చేసి సినీ నటుడిగా రాణించాలనుకున్నారు రాజబాబు.ఆ సమయంలోనే గరికపాటి రాజారావు అతని నటనా నైపుణ్యం చూసి మద్రాసు రావాల్సిందిగా ఆహ్వానించారు. దీంతో బాగా సంబరపడిపోయిన రాజబాబు మద్రాసు వెళ్లారు కానీ సినీ అవకాశాలు అతను వెళ్ళిన వెంటనే లభించ లేదు. దీంతో చాలా కాలము ట్యూషన్లు చెబుతూ కొద్దిపాటి డబ్బు సంపాదించి జీవనం సాగించేవారు. ఆ క్రమంలోనే సినిమా దర్శకుడు అడ్డాల నారాయణరావు రాజబాబుకు సమాజం అనే సినిమాలో ఒక చిన్న పాత్ర ఇచ్చారు. ఈ సినిమా 1960 వ సంవత్సరంలో విడుదలై రాజబాబు బాగానే గుర్తింపు తెచ్చిపెట్టింది. ఆ సినిమా తర్వాత దాదాపు 20 సంవత్సరాల పాటు టాలీవుడ్ పరిశ్రమలో హీరోగా హాస్యనటుడిగా, క్యారెక్టర్ ఆర్టిస్ట్ గా నటిస్తూ తెలుగు ప్రేక్షకులను ఎంతగానో అలరించారు.కేవలం రెండు దశాబ్దాల్లో 589 సినిమాల్లో నటించారంటే అతను ఎంత బిజీగా ఉండేవారు అర్థం చేసుకోవచ్చు. తాతా మనోడు, పిచ్చోడు పెళ్లి, తిరుపతి, ఎవరికి వారే యమునా తీరే, మనిషి రోడ్డున పడ్డాడు వంటి సినిమాల్లో హీరోగా నటించాడు రాజబాబు. సినిమాల్లో అతనికి భార్యలు గా లీలారాణి, ప్రసన్న రాణి, గీతాంజలి రమాప్రభ నటించేవారు. అయితే ఎక్కువగా రమాప్రభ అతను కలిసి నటించిన సినిమాలు సూపర్ డూపర్ హిట్‌గా నిలిచాయి. దీంతో వీళ్లిద్దరి కామెడీ జంటకు డిమాండ్ విపరీతంగా పెరిగిపోయింది. అయితే అప్పట్లో రాజబాబు ఒక్క సినిమాల్లో నటించాలంటే లక్ష రూపాయల రెమ్యునరేషన్ తీసుకునే వారట. ఈ విధంగా ఎన్నో సినిమాల్లో నటిస్తూ కోటీశ్వరుడు అయ్యారట. అయితే రాజ బాబు 1965 వ సంవత్సరంలో రచయిత శ్రీశ్రీ మేనమామ కూతురైన లక్ష్మీ అమ్ములు ను పెళ్లి చేసుకున్నారు. వీళ్ళిద్దరికీ నాగేంద్ర బాబు, మహేష్ బాబు అనే ఇద్దరు కుమారులు కూడా జన్మించారు. రాజబాబు చివరి దశలో ఎక్కువగా ఆల్కహాల్ తీసుకునే వారు. ఈ మద్యపాన వ్యసనం కారణంగానే అతను క్యాన్సర్ బారిన పడి కేవలం 45 సంవత్సరాలకే మృత్యువాతపడ్డారు.దీంతో తండ్రి లేని తన కుమారులను పెద్ద చదువులు చదివించారు లక్ష్మీ అమ్ములు. అలాగే రాజబాబుకి తమ్ముళ్లు అయిన చిట్టిబాబు, అనంత్ బాబు లను కూడా సొంత కుమారుల గా భావించి వారికి అన్ని చేసి పెట్టేవారు లక్ష్మీ అమ్ములు. నాగేంద్రబాబు, మహేష్ బాబు బాగా చదువుకొని అమెరికా దేశంలో ఉద్యోగాలు సంపాదించి అక్కడే స్థిరపడిపోయారు. స్మార్ట్ ఫోన్, కార్లు, బస్సులలో అమర్చే జిపిఎస్ సిస్టమ్ రూపొందించడంలో రాజబాబు కుమారులైన నాగేంద్రబాబు, మహేష్ బాబు కీలకమైన పాత్ర వహించారట. అలాగే అమెరికాలో తమకంటూ రూ. 10 కోట్ల విలువైన ఒక విలాసవంతమైన భవనాన్ని కొనుగోలు చేశారట. వాళ్లకి మన భారతదేశంలో కూడా దాదాపు 25 కోట్ల రూపాయలు ఉన్నాయని రాజబాబు తమ్ముడు అయిన చిట్టిబాబు ఒక ఇంటర్వ్యూలో తెలిపారు..





# బీరుట్ పేలుడుకు అణుబాంబులో ఐదోవంతు శక్తి!

- టి.వరప్రసాద్

లెబనాన్ .. ఈ పేరు వినగానే గుర్తుకొచ్చేది ఉత్సాహంగా గడిచే నైట్ లైఫ్ .. ఇప్పుడీ బుల్లి రాజ్యంలో ఎక్కడ చూసినా కూలిపోయిన భవనాలు.. విరిగిపోయిన తలుపులు.. పగిలిపోయిన అద్దాలే కనిపిస్తున్నాయి. మంగళవారం దేశ రాజధాని నగరం బీరుట్ నౌకాశ్రయంలో జరిగిన భారీ పేలుడుతో దాదాపు 3,00,000 మంది నిరాశ్రయులయ్యారు. ఈ సంఖ్య బీరుట్ జనాభాలో 10 వంతుకు సమానం. వేలాది మంది ఆసుపత్రుల వద్ద చికిత్స కోసం బారులు తీరారు. ఇప్పటికే కోవిడ్ వ్యాపించడంతో.. ఈ పేలుడు బాధితులకు పడకలు కరవైపోయాయి. అమ్మోనియం నైట్రేట్ పేలుడు పదార్థం కావడంతో దాని రవాణాకు అనుమతులు.. పత్రాలు తప్పనిసరి. సైప్రస్ లో నివసించే రష్యా వ్యాపారవేత్త ఆధీనంలోని ఎం.వి. రోహ్ సస్ అనే నౌక జార్జియా నుంచి మోజాంబిక్ కు బయల్దేరింది. మార్గమధ్యంలో బీరుట్ సమీపంలో నౌక ఇంజిన్ చెడిపోయింది. దీంతో బలవంతంగా దాన్ని బీరుట్ నౌకాశ్రయానికి చేర్చారు. అక్కడ పత్రాలు తనిఖీ చేయగా.. ఆ నౌకకు ప్రయాణార్హత లేదని, నిషేధం ఉన్నట్టు తేలింది. సిబ్బందిలో నలుగురు ఉక్రెయిన్ కు, ఒకరు రష్యాకు చెందినవారు. వివిధ రకాల వివాదాల తర్వాత వారిని విడుదల చేశారు. కొన్నాళ్లకే నౌక యజమాని దివాలా తీయడంతో నౌకను అలానే బీరుట్ పోర్టులో ఉంచేశారు. నౌకపై న్యాయ వివాదాలు మొదలు కావడంతో అందులోనే ఏళ్లపాటు 2,750 టన్నుల అమ్మోనియం నైట్రేట్ ఉంచడం ప్రమాదకరమని భావించి దానిని పోర్టులోని హ్యాంగర్ 12లో భద్రపర్చారు. ఆ తర్వాత 2018లో అమ్మోనియం నైట్రేట్ ను వదిలేసి షిప్ పోర్టు నుంచి అదృశ్యమైపోయింది. ఈ నౌకలో పట్టుకొన్న అమ్మోనియం నైట్రేట్ బ్రెజిల్ లోని ఆర్కాస్ నైట్రో ఫ్రిల్ సంస్థ చేసిన 'నైట్రోఫ్రిల్ హెచ్ డీ' రకంగా భావిస్తున్నారు. ఈ గోదాము తెరిచినప్పటి పాత చిత్రాల్లో కనిపించిన సంచులపై ఈ కంపెనీ పేరు ఉంది. ఈ సంస్థ క్వారీల్లోకి పేలుడు పదార్థాలను సరఫరా చేస్తుంది. ఈ సంస్థ చేసే పేలుడు పదార్థం అత్యధికంగా 400 మెట్రిక్ టన్నులు మాత్రమే నిల్వచేయాలని రక్షణరంగ నిపుణులు చెబుతున్నారు. అసలే ఉగ్రవాద కార్యకలాపాలు ఎక్కువగా జరుగుతాయని పేరున్న చోట 2,750 టన్నుల అమ్మోనియం నైట్రేట్ ను ఉంచడంపై అనేక సందేహాలు వస్తున్నాయి. మరోపక్క అంత భారీ మొత్తంలో అమ్మోనియం నైట్రేట్ స్వాధీనం చేసుకొంటే వచ్చే నగదు బహుమతికి ఆశపడి అధికారులు దానిని పోర్టులో నిల్వచేశారా..?అని లెబనాన్ జర్నలిస్టులే ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నారు. లెబనాన్ ప్రభుత్వంలో నెలకొన్న అవినీతి, నిర్లక్ష్యం వెరసి లక్షలాది ప్రజల ప్రాణాలపైకి తీసుకొచ్చాయి. పేలుడు తీవ్రత అణుబాంబును తలపించిందని ప్రత్యక్ష సాక్షులు చెబుతున్నారు. ఈ చప్పుడు 200 కిలోమీటర్ల దూరంలోని సైప్రస్ లో వినిపించిందంటేనే దీని తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. 9 కిలోమీటర్ల దూరంలోని విమానాశ్రయ అద్దాలు పగిలిపోయాయి. భూకంప లేఖినిపై దీని తీవ్ర 3.3గా నమోదైంది. అంటే చిన్నపాటి భూకంపంతో సమానమన్న మాట. ఇది హిరోషిమాపై వేసిన అణుబాంబులో ఐదోవంతు శక్తికి సమానమని ఆంగ్ల పత్రిక 'ది సన్ ' పేర్కొంది. పేలుడు తర్వాత అణు విస్ఫోటంలా పొగలు సుడులు తిరుగుతూ మేఘాన్ని కమ్మేయడం కూడా వీడియోల్లో స్పష్టంగా కనిపించింది. పేలుడు తీవ్రతకు ఈ ఓడరేవు వద్ద ఉన్న మూడు నౌకలు మునిగిపోయాయి. ఇప్పటికే ఆర్థిక సమస్యలతో సతమతమవుతున్న ఈ దేశానికి పేలుడు ఘటన అశనిపాతంలా మారింది. ఇప్పటివరకు వేసిన అంచనా ప్రకారం ఈ పేలుడు వల్ల నష్టం 15 బిలియన్ డాలర్లను దాటేసింది. దాదాపు పదేళ్ల నుంచి లెబనాన్ కు భారీగా వలసలు వస్తున్నారు. పొరుగునున్న సిరియాలో అంతర్యుద్ధం కారణంగా అక్కడి నుంచి పెద్దసంఖ్యలో లెబనాన్‌కు చేరుకొంటున్నారు. దీనికి తోడు లెబనాన్ వాసులే రోజువారీ ఆహారం కోసం అవస్థలు పడాల్సిన దుస్థితి నెలకొంది. దీనికి కొవిడ్ కూడా తోడు కావడంతో దేశంలో సంక్షోభం నెలకొంది. ఆహార ధరలు 247శాతం పెరిగినట్లు అంచనా. ఇప్పుడు అక్కడ మిగిలి ఉన్న ఆహార గోదాములు పూర్తిగా ధ్వంసమైపోయాయి. ఈ గాయం నుంచి కోలుకోవడానికి బీరుట్ కు కొన్ని దశాబ్దాలు పట్టవచ్చు!

# సిన్హా..సింహస్వప్నమే...

- ప్రజామీడియా నెట్‌వర్క్

బీజేపీ అంటే సీనియర్ మోస్ట్ పొలిటీషియన్లే ఇపుడు తల వంచి భజన చేస్తున్నారు. కానీ ఒక సిన్సియర్ పోలీస్ అధికారి మాత్రం అప్పట్లోనే చుక్కలు చూపించారు. ఆయనెవరో కాదు, విశాఖ కొత్త పోలీస్ కమిషనర్‌గా నియమితుడైన మనీష్ కుమార్ సిన్హా. ఆయన సీబీఐలో పనిచేస్తున్నపుడు బీజేపికి అనుకూలుడుగా ప్రచారంలో ఉన్న నాటి స్పెషల్ డైరెక్టర్ రాకేష్ అస్థానా మీద వచ్చిన అవినీతి కేసుని విచారించిన అధికారిగా సంచలనం సృష్టించారు.

ఒక అవినీతి కేసుకు సంబంధించి ఆస్థానా మీద విచారణను చేపట్టిన సిన్హా నాడు కేంద్రంలోని పెద్దలకు తలనొప్పిగా మారారు. అప్పట్లో సీబీఐలో ఇద్దరు సీనియర్ అధికారుల మధ్య గొడవలు దేశం మొత్తానికి గుర్తుండే ఉంటుంది. అప్పటి డైరెక్టర్ అలోక్ వర్మ అధికారాలను తగ్గించి రాకేష్ ఆస్థానాను స్పెషల్ డైరక్టర్ గా హఠాత్తుగా బీజేపీ సర్కార్ తీసుకురావడం పెద్ద వివాదం అయింది.

సరిగ్గా ఆ సమయంలో రాకేష్ ఆస్థాన కేసుని గట్టిగానే విచారిస్తున్న సిన్హాను నాగపూర్ కి బదిలీ చేయడం ఆయన దాన్ని సుప్రీం కోర్టులో సవాల్ చేయడం జరిగాయి. ఇలా కేంద్రంలోని బలమైన బీజేపీ సర్కార్ కే చిక్కులు తెచ్చిన సిన్హాను జగన్ ఏరికోరి ఏపీకి తీసుకువచ్చారు.

ఆయన్ని ఇంటెలెజెన్స్ చీఫ్ గా నియమించారు. ఇపుడు ఆయన్ని పాలనారాజధాని విశాఖకు కొత్త సీపీగా నియమించారు. అవినీతి అంటే అగ్గిలా విరుచుకుపడే సిన్హా విశాఖ పోలీస్ ఉన్నతాధికారిగా రావడం రాజకీయంగానూ అతి పెద్ద చర్చగా ఉంది.

విశాఖలో భూ దందాలు ఎక్కువవుతున్నాయన్న నేపధ్యంలో భూ దందాలను, వైట్‌కాలర్ నేరాలను ముందే కనిపెట్టి కబ్జా కోరులకు



సింహ స్వపంగా ఉంటారన్న పేరున్న సిన్హా నియామకమే ఓ పెద్ద హాట్ టాపిక్. ఆయన్ని విశాఖకు తీసుకురావడం అంటే జగన్ ఆలోచనలు ఏంటో తెలిసిందే. ప్రశాంత విశాఖ కోసమే ఆయన సిన్హాను కొత్త కొత్వాల్‌గా పంపారని అంటున్నారు. విశాఖ సీపీగా బాధ్యతలు స్వీకరించిన సిన్హా తాను శాంతిభద్రతలకు పెద్ద పీట వేస్తానని చెప్పడం ద్వారా అక్రమార్కుల గుండెల్లో రైళ్ళు పరిగెత్తించారు.



అశేష ప్రజానీకంలో విద్య, విజ్ఞానం పెరిగిన మేరకే దేశం ముందుకు సాగుతుంది. మన దేశం ఇలా వెనకబడడానికి కారణం విద్య, విజ్ఞానం కొద్దిమంది గుత్త సొమ్ము కావడమే.

- స్వామి వివేకానంద

# ముగ్గురూ ముగ్గురే...

- కె.రాజా



కాలం కలిసి రాకపోతే తాడే పామై కాటేస్తుందన్నది సామెత. తెలుగుదేశం పార్టీ, దాన్ని నమ్ముకుని, దాని అండతో ఎదిగిన ఓ సామాజిక వర్గం పరిస్థితి చూస్తుంటే ఇదే సామెత గుర్తుకు వస్తుంది. 80వ దశకం నుంచి ఉచ్ఛ స్థితిని అందుకుని, ఎన్టీఆర్ అండతో అస్సలు ఆ సామాజిక వర్గం అంటే ఏమిటో తెలియని చోట్ల కూడా ఎమ్మెల్యే టికెట్ లు అందిపుచ్చుకుని, పునాదులు వేసుకుని ఎదిగిన వర్గం ఇప్పుడు కిందా మీదా అవుతోంది.

ఆ వర్గాన్ని పెంచి పోషించి. ఆ వర్గాన్ని అన్ని వ్యవస్థల్లో బలంగా చొప్పించి, ఆ అండతో తాను ఇన్నాళ్లు అధికారం నిలబెట్టుకుంటూ వచ్చిన తెలుగుదేశం పార్టీ ఒకేసారి అన్ని వైపులా ఏ అండా దొరక్క దిక్కులు చూడాల్సిన పరిస్థితి వచ్చింది. దీనికి కారణం ఆ ముగ్గురు...ఆ ముగ్గురే...పైగా ఆ ముగ్గురూ కూడా తెలుగుదేశం రాజకీయాన్ని చవిచూసిన వారు. తెలుగుదేశం చేతిలో దెబ్బతిన్నవారు... తెలుగుదేశం పార్టీ కారణంగా గా ఇబ్బందులు పడిన వారు.

ఆ ముగ్గురూ ఒకేసారి మూడు చోట్ల అధికారం అందుకోవడం, ఆ ముగ్గురూ తెలుగుదేశం పార్టీ, ముఖ్యంగా ఆ పార్టీ నేత చంద్రబాబు తమ పట్ల వ్యవహరించిన తీరు మరిచిపోకపోవడం. కేవలం చంద్రబాబు చేసిన రాజకీయ తప్పిదాల కారణంగా, ఆ పార్టీకి వెన్నుముకగా మిగిలిన సామాజిక వర్గం ఇప్పుడు ఇబ్బందులు పడుతోంది.

**ఆ ముగ్గురు.....మోడీ...కేసిఆర్..వైఎస్ జగన్.**

**వాడుకుని వదిలేసి**

చంద్రబాబుకు వున్న వాడుకుని వదిలేసే పాలసీనే కొంప ముంచింది. ఆది నుంచీ పార్టీలో కాస్త సరుకు వున్న నేతలు ఎవరు కనిపించినా, మెల్లగా పొగపెట్టి బయటకు పంపడం అన్నది ఆయనకు అలవాటు. పర్వతనేని ఉపేంద్ర దగ్గర నుంచి రేణుక చౌదరి, జయప్రద, దగ్గుబాటి వెంకటేశ్వరరావు వరకు అనేక మంది ఈ పాలసీ కారణంగా ఇబ్బందులు

పడి పార్టీని వీడిన వారే. అంతెందుకు ఇప్పుడు తెలుగుదేశం పార్టీలోనే వున్నా నన్నపనేని రాజకుమారి సైతం బాబు కారణంగా ఇబ్బందులు పడి పార్టీ వీడి బయటకు వచ్చి కన్నీరు పెట్టిన వారే.

అయితే బాబు పాలసీ కారణంగా కావచ్చు, లేదా బాబు రాజకీయాల కారణంగా కావచ్చు, ఇబ్బంది పడినవారు చాలా మంది అలా అణగారిపోయారు. కానీ బౌన్స్ బ్యాక్ అయిన వారు కొద్ది మందే. అలాంటి కొద్ది మందిలో ఈ ముగ్గురూ వున్నారు. మోడీ, జగన్ ఇద్దరూ బాబు రాజకీయాల దెబ్బతిన్న పులులు. కేసిఆర్ మాత్రం బాబు పొగపెట్టి బయటకు సాగనంపిన నాయకుడు.

ఇలాంటి ముగ్గురూ ఒకేసారి మూడు కీలక స్థానాలకు చేరుకోవడం అన్నది తెలుగుదేశం పార్టీ పట్ల, దాన్ని నమ్ముకున్న సామాజిక వర్గం పట్ల విధి ఆడిన వింత నాటకం అనుకోవాలి. ఒక చోట కాకుంటే ఒక చోట అయినా కాస్త కాలూనే అవకాశం లేకుండాపోయింది,. గతంలో ఎప్పుడూ ఇలా లేదు.

**ఎవరున్నా సరే..**

గతంలో ఎక్కడ ఏ ప్రభుత్వం వున్నా, ఆ వర్గం పనులు సజావుగా సాగిపోయేవి. సామ, దాన, దండ, బేధోపాయాలు వాడేసేవారు. పని జరిగిపోయేది. కానీ ఇప్పుడు అలా కాదు, ఆ ముగ్గురూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆ వర్గం పట్ల కినుకగా వున్నారు. మోడీకి ఆ వర్గానికి చెందిన చంద్రబాబు కిట్టడం లేదు. కెసిఆర్‌కు కొంత వరకు ఆ వర్గం, మరి కొంత వరకు చంద్రబాబు నచ్చడం లేదు. జగన్‌కు అయితే అసలు ఆ వర్గం తనకు చేసిన అన్యాయం, తనను పెట్టిన బాధలు తలుచుకుని, అస్సలు నిద్రేపట్టడం లేదు. అందువల్లే ఒకేసారి ముగ్గురూ ఒకే తరహా భావనతో వుండడం వల్ల, ఒక చోట కాకపోతే మరో చోట అయినా పని జరుగుతుందనే ఆశలు అడుగంటిపోతున్నాయి. అసలు ఎందుకిలాంటి పరిస్థితి వచ్చింది?

**మోడీతో ముడి**

చంద్రబాబు దార్శనికుడు. విజన్ 2020 అనే పద సృష్టి కర్త. కానీ అంతటి దార్శనికుడు కూడా మోడీని రెండు సార్లు తక్కువ అంచనా వేసారు. ఒక సారి తొందరపడి మాట జారీ, మోడీ కనుక హైదరాబాద్ వస్తే అరెస్ట్ చేస్తా అన్నారు. కానీ అంతలోనే పాపం 2014లో మోడీ అవసరం వచ్చింది. మోడీని ఎలా, ఎవరి సాయంతో, ఎక్కడ, ఎప్పుడు పట్టుకున్నారో కానీ మొత్తానికి పొత్తు సంపాదించారు. గెలిచారు. రెండు మంత్రి పదవులు సంపాదించారు. తాను అనుకున్న అమరావతిని రాజధాని చేసారు. అన్నీ చేసి తీరా 2019 దగ్గరకు వచ్చేసరికి..' నీకూ బెబ్బే..నీ అబ్బకీ బెబ్బే' అన్న సామెత మాదిరిగా చేసారు.

తన రాష్ట్రం, తన పార్టీ, తన అధికారం అన్నీ గాలికి వదిలి, దేశం అంతా శివమెత్తినట్లు తిరిగేసారు. ఆ పూనకంలో మోడీని చంద్రబాబు అన్న మాటలు ఇన్నీ అన్నీ కావు. చేసిన విమర్శలు బోలెడన్ని. ఇక మోడీ అధికారంలోకి రారేమో అన్నంతగా బాబు నాయుడు ఆయన మీడియా జనాల్ని భ్రమలోకి తీసుకెళ్లిపోయారు.

అదిగో అక్కడ సరిగ్గా విధి వక్రించింది. మోడీ బంపర్ మెజారిటీతో అధికారంలోకి వచ్చారు. బాబు కోసం భాజపాలో కోవర్టులుగా పని చేసేవారిని తెలివిగా పక్కన పెట్టారు. బాబు అంటే అరికాలి మీద లేవకపోయినా, అంతగా గిట్టని వారిని ముందుకు తెచ్చారు.

**కేసిఆర్‌తో తకరారు**

కేసిఆర్ తో చంద్రబాబు అవినాభావ సంబంధం. కేసిఆర్ పాపం, తెలుగుదేశం మనిషే. కానీ కెసిఆర్ పంతం, స్టామినా తెలియక చంద్రబాబు మెల్లగా పొగపెట్టి బయటకు పంపారు. కానీ కేసిఆర్ బాబు కన్నా నాలుగు ఆకులు ఎక్కువ చదివారు. అందుకే తెలంగాణ ఉద్యమాన్ని పట్టుకుని ముందుకు సాగి అధికారం సాధించారు. ఈ క్రమంలో మళ్లీ బాబును ఓ సారి నమ్మారు. మళ్లీ వదిలారు.

ఇలాంటి టైమ్ లో 2014 ఎన్నికలు వచ్చాయి. మళ్లీ బాబుగారు తన విశ్వరూపం చూపించారు. శేరిలింగంపల్లి, కూకట్ పల్లి వగైరా ఆంధ్ర జనాలు వున్న ప్రాంతాల్లో ఓ లెక్కలో హల్ చల్ చేసారు. తెలుగుదేశం సిద్ధాంతాలకు తిలోదకాలు ఇచ్చి మరీ కాంగ్రెస్ తో చేతులు కలిపారు. ఇక కేసిఆర్ ఇంటికే వెళ్లిపోతారని బాబునాయుడు గారు భ్రమించారు.

కానీ మళ్లీ ఇక్కడా విధి వెక్కిరించింది. అనుకున్నది ఒక్కటి అయినది ఒక్కటి. ఓటుకు నోటు వ్యవహారానికి పగ తీర్చుకుందాం అనుకుంటే కేసిఆర్ మరింత పగపట్టేటట్టు అయిపోయింది. ఇక చీమ కూడా దూరనంతగా బాబుకు కేసిఆర్‌కు మధ్య ద్వారాలు మూసుకుపోయాయి. ఈ సామాజిక వర్గ వైనం అంతే. అస్సలు నమ్మడానికి లేదు అని కేసిఆర్ అనుకునేలా చేసారు బాబు

**జగన్ తో జన్మ వైరం**

తెలుగుదేశం పార్టీ, ఆ సామాజిక వర్గం ఎలాంటివి అన్నది వైఎస్ జగన్‌కు అనుభవం అయినంతగా మరెవరికీ అనుభవంలోకి వచ్చి వుండవు. నిజానికి నందమూరి బాలకృష్ణ వ్యవహారం వైఎస్ హయాంలో కాబట్టి అలా సమసిపోయింది. ఓ ఇంట్లో తుపాకి కాల్పులు జరిగితే, ఆ ఇంటి మనుషులు పోలీస్ స్టేషన్ మెట్లు కూడా ఎక్కకుండా, కసికందకుండా, వసివాడకుండా కేసు లేకుండా కావడం అంటే వైఎస్ ఘనత అని అనుకోకతప్పదు. రాజకీయ వర్గాల్లోనే కాదు, సామాన్య వర్గాల్లో కూడా వున్న అభిప్రాయం ఇదే.

అలాగే వైఎస్ హయాంలో జగన్ చుట్టూ వున్నది తెలుగుదేశం అనుకూల సామాజక వర్గమే. ఆ వర్గపు వ్యాపారజనమే. ప్రయోజనం పొందిందీ వారే. కానీ జగన్ ను ముఖ్యమంత్రి కాకుండా సర్వ శక్తులు అడ్డం వేసింది ఆ వర్గమే. జగన్ క్యారెక్టర్ అసాసినేషన్ లో ఆ వర్గపు మీడియా చేసిన యాగీ ఇంతా అంతా కాదు. జగన్ ముఖ్యమంత్రి కాకూండా చూడడం కోసం ఆ వర్గం ఎంత చేయాలో అంతా చేసింది. వారి అదృష్టం బాగుంది. 2014లో జగన్ ముఖ్యమంత్రి కాలేకపోయారు.

అదే విధంగా జగన్ పై కేసులు పెట్టించడం లో కానీ లోపల వేయించడంలో కానీ ఆ సామాజిక వర్గ కృషి ఎంత వుందన్నది జనానికి తెలియని రహస్యం కాదు. అందుకే జగన్‌కు అంతకు అంతా కసి పెరిగింది. అలాంటి కసి పెట్టుకున్న జగన్ సిఎమ్ అయితే ఎంత కష్టమో తెలుగుదేశం పార్టీకి, దాని పునాదుల్లో వున్న ఆ వర్గానికి బాగా తెలుసు. అందుకే ఎన్ని యుక్తులు పన్నాలో అన్నీ పన్నారు.

జనసేనను ఎంత వాడాలో అంతా వాడారు. ఎన్ని వార్తలు వండాలో అన్నీ వండారు.

కానీ విధి కరుణించలేదు. జగన్ నే ముఖ్యమంత్రి అయ్యారు. చంద్రబాబు దారుణపరాజయం పాలయ్యారు.

**ఇప్పుడు ఆ ముగ్గురి వంతు**

తెలుగుదేశం పార్టీ, దాని నేత చంద్రబాబు, దాని మద్దతు సామాజిక వర్గం వైఖరి ఎలా వుంటుందో మోడీ, కేసిఆర్, జగన్ త్రయానికి బాగా అంటే బాగా అర్థం అయిపోయింది. ఒకసారి మోసపోతే మన తప్పు. రెండోసారి మోసపోతే అవతలివాడి తెలివి. పదే పదే మోసపోతే మనం వెధవాయిలం అవుతాము అనే నానుడి ప్రకారం, ఇక పదే పదే మోసపోవడానికి ఈ ముగ్గురు సిద్దంగా లేరు. అందుకే బాబు తరపున పలువురు ఆయన సామాజిక వర్గ జనాలు అర్జెంట్ గా పార్టీ ఫిరాయించి, భాజపాలోకి జంప్ చేసినా, వారిని ఎక్కడ వుంచాలో అక్కడే వుంచారు. అంతే కాదు తేదేపాకు వంత పాడుతున్న భాజపా జనాలను ఎక్కడ కట్ చేయాలో అక్కడ కట్ చేసారు.

కేంద్ర స్థాయిలో చూస్తే మాట చెల్లడం లేదు. మోడీ దగ్గరకు రానివ్వడం లేదు. తెలంగాణలో చూస్తే మన బతుకు మనం బతికే వరకు ఓకె. తోక జాడిస్తే కట్ చేయడానికి కేసిఆర్‌కు రెండు క్షణాలు పట్టదు. హైదరాబాద్ లో తెలుగుదేశం పార్టీ ఆఫీసు తలుపులు తీసి ఎన్నాళ్లయిందో? ఇక ఆంధ్రలో అయితే జగన్ ఏకంగా చెడుగుడు ఆడేస్తున్నారు.

**కరోనా కాటు**

ఇలా కేంద్రం, రెండు తెలుగు రాష్ట్రాల్లో విధి వక్రించి తెలుగుదేశం అనుకూలం సామాజిక వర్గం డీలా పడిపోతే, కరోనా అన్నది ఉరుములేని పిడుగులా వచ్చి పడింది. ఆ వర్గం వ్యాపార మూలాలు మొత్తం దారుణంగా దెబ్బ తీస్తోంది. హోటల్, రెస్టారెంట్లు, ప్రైవేటు రవాణా, మీడియా, సినిమా, మైనింగ్ ఇలాంటి అన్ని రంగాల్లో భయంకరంగా సంపాదిస్తున్న ఆ వర్గానికి పూర్తిగా చుక్క ఎదురైంది. వ్యాపారాలుకుదేలయ్యాయి. అప్రహతిహతంగా సాగుతున్న మీడియా కాస్తా మూలన పడే పరిస్థితి వచ్చింది.

నిజానికి ఇలాంటి టైమ్‌లో చంద్రబాబు అధికారంలో వుంటే, ఓ లెక్కలో ఆదుకునేవారు. అడ్డగోలుగా ప్రకటనలు ఇచ్చి మీడియాను, రోజుకో సెమినార్ పెట్టి హోటల్ రంగాన్ని ఇలా రకరకాలుగా అడ్డదారుల్లో ఆదుకునే అవకాశం వుండేది. ఇప్పుడు అవన్నీ లేకుండా పోయాయి. మైనింగ్ అక్రమాల్లో కోట్లకు కోట్లు దొడ్డి దారిలో సంపాదించిన వారి ఆగడాలకు అడ్డు కట్టపడింది.

**అందుకే ఇదంతా**

ఇక మిగిలిన ఆశ అంతా, జగన్ అనేవాడు అధికారంలో లేకుండా చేయాలి. వైకాపా పార్టీని కకావికలు చేయాలి. అది చేస్తే తప్ప తెలుగునాట తెలుగుదేశం పార్టీ, దాని మద్దతు వర్గం బతికి బట్టకట్టడం అన్నది అసాధ్యం. అందుకోసం ఏం చేసినా ఫర్వాలేదు. ఎలా చేసినా ఫర్వాలేదు. అందుకే కోర్టులను అడ్డం పెట్టుకున్నారు. చీటికీ మాటికీ కోర్టులకు ఎక్కుతున్నారు. తమ మీడియా ద్వారా వార్తలు రాయించడం, దాని ద్వారా కేసులు వేయించడం, మళ్లీ వార్తలు, మళ్లీ కేసులు. ఇదీ వ్యవహారం.

కానీ జగన్ అనేవాడు అంత సులువుగా దిగి వచ్చేవాడు కాదు. అధికారం పోయినా, ఇంకేం పోయినా కూడా ఈ వర్గానికి లొంగడు కాక లొంగడు. అది పక్కా. కేసిఆర్, జగన్, మోడీ త్రయం కలిసి 2024లో తెలుగుదేశం పార్టీని అధికారానికి దూరం చేయగలిగితే, ఇక మిగిలినదంతా చరిత్రే అవుతుంది. వర్తమాన పరిస్థితులు గమనిస్తుంటే, జరిగేది అదే అని స్పష్టంగా కనిపిస్తోంది.

ఉపాధ్యాయుల దినోత్సవం సందర్భంగా.....

# గురు వెతలు


**పి.లక్ష్మణ్ రావ్**
అసిస్టెంట్ రిజిస్ట్రార్
సహకార శాఖ
విజయనగరం
9441215989


ప్రత్యక్షంగా
విద్య నేర్పే ఉపాధ్యాయుడు
మానిటర్ పై
మిధ్యాబింబమై
ప్రత్యక్షమవుతున్నాడుజి

బతుకు తెరువు కోసం
ప్రైవేటు బడిలో చేరిన
ఉపాధ్యాయుడు
కరోనా దెబ్బకు కొలువు
పోయి
నడిరోడ్డుపైజి
కూరగాయలమ్ముతున్నాడు

గొప్ప తరాన్ని
నిర్మించే ఉపాధ్యాయుడు
బతుకు ఒత్తిడితో
చిత్తయిపోయి
చతికిలబడిపోతున్నాడుజి

పలు రకాల బాధ్యతలు
భుజంపై పడి
ఉపాధ్యాయుడు
అష్టావధానం చేయలేక
మీనమేషాలు
లెక్కబెడుతున్నాడు

విద్యార్థులను
తీర్చిదిద్దడమంటే
నేటి ఉపాధ్యాయునికి
నల్లేరుపై నడక కాదు
జోడెద్దుల సవారీయే !

# సంపూర్ణ అక్షరాస్యత ఎప్పటికి సాధ్యం?

**21వ శతాబ్దంలో నిరక్షరాస్యులంటే చదవడం, రాయడం రాని వారు కాదు. నేర్చుకోలేని వారు, ఏది నేర్చుకోవాలో తెలుసుకోగలిగినవారు. మళ్ళీ మళ్ళీ నేర్చుకోవాలనుకునేవారు" - అల్విన్ టాఫ్లర్**

**పరిచయం :** సెప్టెంబర్ 8, ప్రపంచ లక్షరాస్సత దినం. 1967వ సంవత్సరం నుండి ఈ ప్రపంచ అక్షరాస్యతా దినోత్సవం ప్రపంచమంతా జరుపుతూంది. విశ్వవిద్యాలయాలలోను, కళాశాలలోను, అట్టహాసంగా ఈ దినోత్సవ జరుపుతుండేది. ప్రభుత్వపరంగా కూడా విద్యాశాఖ అక్షరాస్యత దినోత్సవాన్ని జరుపుతుంటారు. దాను రాను అక్షరాస్యత కంటే 'విద్య' పైకి దారిమళ్లింది. స్వాతంత్ర్యం వచ్చి 74 ఏళ్లైనా నూరు శాతం అక్షరాస్యతను సాధించుకోలేకపోయాము. భారతదేశంకంటే వెనుక స్వాతంత్ర్యం సంపాదించుకున్న దేశాలు నూటికి నూటి శాతం అక్షరాస్యతను సాధించుకున్నాయి. అక్షరాస్యత ప్రజాస్వామ్యానికి పునాదిలాంటిది. ప్రజలకు చదువు లేకపోతే ప్రభుత్వం ఎలానడుస్తుందో, ఎలాంటి పథకాలను ప్రవేవపెడుతుందో, వాటి వల్ల ప్రయోజనాలేంటో ప్రజలకు తెలియదు. అక్షరాస్యత వేరు, విద్య వేరు. ఈ రెండింటికి మధ్య గల తేడాన చూడాలి క్షక్షరాస్యత అంటే చదవడం, రాయడం, విద్య మానవునిలోని వున్న నైపుణ్యాలను వెలికి తీయడం, విద్య అక్షరాస్యత కంటే విస్తృతమైంది. అక్షరాస్యతకనే 'వయోజనవిద్య' అని కూడా పిలుస్తారు. పేరుకు వయోజనవిద్యే గాని నేర్పేది అక్షరాలే నేర్చుకున్న అక్షరాలు మర్చిపోయినవాళ్లే కొత్త నిరక్షరాస్యులు (Neo-Literates)గా మారిపోతారు. ఎన్నో పథకాలను కేంద్ర ప్రభుత్వం తీసుకువచ్చినా ఇప్పటికీ 74 శాతం అక్షరాస్యత దగ్గరే ఆగిపోయాము. వయోజనవిద్యను 'సామాజిక విద్య' (Social Education)గా పేరు తెచ్చిపెట్టింది. ప్రథమ కేంద్రవిద్యాశాఖా మంత్రి అబ్దుల్ కలామ్ అజాద్. ఏది ఏమైనా అక్షరాస్యత యొక్క ప్రాముఖ్యతను తెలుసుకొనడం, దాని ద్వారా వచ్చే గౌరవం, మానవ హక్కుల గురించి తెలుసుకొని మరింత ఉన్నతమైన సమాజాన్ని నిర్మించుకొనడం అక్షరాస్యతా దినోత్సవ లక్ష్యం.



- ఆచార్య కె.పి.సుబ్బారావు
Emeritus Fellow (UGC),
Dept of Education, Andhra University

నిరక్షరాస్యత సమాజంలోని అన్ని రుగ్మతలకు ఆధారం. దేశ అభివృద్ధికి గొడ్డలి పెట్టు. నిరక్షరాస్యత ప్రజలను అంధకారంలో ఉంచుతుంది. ప్రజల బాధలకు కారణమైన నిరక్షరాస్యత, తెలివిలేని తనం వారిని మరింత కృంగదీస్తుంది. భారత రాజ్యాంగం సార్వజనీన విద్య గురించి చెబుతూంది. ప్రభుత్వం విద్యాను మానవ హక్కుగా మార్చింది. అయినప్పటికి ప్రజలింకా నిరక్షరకుక్షులుగానే ఉన్నారు. బాలలకు కొంతైనా చదువు అందుబాటులో ఉందికాని, నిరక్షరాస్సులైన యువజనులు జ్ఞాన మనే కాంతిని కూడా చూడడానికి చోచుకోవడంలేదు. "నేను నిరక్షరాస్యుడైన కమ్మరి దగ్గర ఎలా పనిచేయాలో నేర్చుకోగలను. కాని ఆ కమ్మరి అక్షరాస్యుడైతే నా ఆలోచనలకు పదునుపెట్టుకోగలనన్నాడు గాంధీజీ.

సాంప్రదాయకంగా అక్షరాస్యత అంటే చదవడం, రాయడం, కొంత వరకూ గుణించడం మాత్రమే ఆధునిక కాలంలో అక్షరాస్యత అంటే భాషను నేర్చుకోవడం, అంకెలు, చిత్రాలు, కంప్యూటర్ల గురించి తెలుసుకోవడం, నేర్చుకొనడం, అంకెలు, చిత్రాలు, కంప్యూటర్ల గురించి తెలుసుకొనడం, నేర్చుకొనడం ఒక్కమాటలో చెప్పాలంటే అవతలి వారితో ఎలా సంభాషించాలో నేర్చుకొనడం. తన భావాలను వ్యక్తీకరిచండం. OECD దేశాల నిర్వచనం ప్రకారం "అత్యంత క్లిష్టమైన విషయాలను కూడా సాంకేతికత (Technology)తో అర్థం చేసుకొనడమే" అక్షరాస్యత.

అక్షరాస్యత నిలకడగల అభివృద్ధికి అవసరం శ్రమలోను, కుటుంబం, ఆరోగ్యం, పోషకాహారం అందించడంలోనూ, అక్షరాస్యత పేదరికాన్ని తగ్గించి, జీవిత అవసాలను పెంపొందిస్తుంది. అంతేగాకుండా శరవేగంతో మారుతున్న సమాజంలో తన ఉనికిని బాటుకోడానికి, అవగాహన సెంచుకొనడానికి కావలసిన వాటినిసృష్టించుకోడానికి అక్షరాస్యత ఒకసాధనంగా ఉపయోగపడుతుంది.

**అంతర్జాతీయ పరిస్థితి :** ప్రపంచంలో 750 మిలియన్ల యువజనులు, వయోజనులు ఇంకా చదవలేరు రాయలేరు. 250 మలియన్ల పిల్లలు కనీస అక్షరాస్యతా నైపుణ్యాలను కల్గి ఉండంలో మావిషల మౌతున్నారు. దీని వలన తక్కువ అక్షరాస్యత గల వారు. తక్కువ నైపుణ్యాలు (Skills) కలిగిన యువకులు, వయోజనులు సామాజిక రంగంలోపాలు పంచుకోలేక పోతున్నారు.

UNESCO ప్రపంచవ్యాప్తంగా 1946 నుండి అక్షరాస్యత గల సమాజాన్ని నిర్మించాలని ప్రయత్నం చేస్తూనే ఉంది. విద్యాహక్కులో భాగంగా అక్షరాస్సతా నైపుణ్యాలను మెరుగుపెట్టడానికి తీవ్ర కృషి చేస్తుంది. అక్షరాస్యతా సమాజం కేవలం కొన్ని నైపుణ్యాతే గాక ప్రజలుకూడా సమాజంలో ప్రముఖ పాత్ర వహించి జీవన పరిస్థితులను పెంపొందించుకోవాలని ఆశిస్తుంది. దీన్ని దృష్టిలో పెట్టుకొని UNESCO, 2030 సంవత్సరంలోపల జీవితాంతర అభ్యసనం (Life Long Learning) అక్షరాస్యతలో సమగ్రమైన పాత్ర వహించాలని ఈ క్రింది పద్ధతులను చూచించి అవి : 1. బాలల పూర్వ ప్రాథమిక విద్యకు బలమైన పునాదులు వేయడం. 2. బాలలందరికీ నాణ్యమైన విద్యనవందించడం, 3.యువతకు, వయోజనలకు పునాది అక్షరాస్యత స్థాయిలను పెంచడం, 4. అక్షరాస్యతా ఆవాసాలను (Environments) అభివృద్ధిచేయడం.

**భారతదేశంలో అక్షరాస్యత :**

జనాభా లెక్కల ప్రకారం ఏడు సంవత్సరాలకు పైబడిన వారిని రెండు రకాలుగా వర్గీకరించారు. ఒకటి అక్షరాస్యులు, రెండు నిరక్షరాస్యులు, విద్యా కమిషన్ (1964-66) కూడా వయోజన విద్యకు ఎక్కువ ప్రాధాన్యత నిస్తు 15-44 సంవత్సరాల వయస్సుగల ఆరు 144 మిలియన్తు ఉన్నారని అక్షరాస్యత పెరగాలంటే పాత పద్దతులు పనికి రావని తేల్చింది. వయోజన విద్య అవసరం లేకుండా చేయాలంటే నిర్బంధోచిత ప్రాథమిక విద్యకు ప్రధాన స్థానం కల్పించాలని కమీషన్ సిపార్చుచేసింది.

జనాబా లెక్కల మధ్యస్థంగా జాతీయ శాంపిల్ సర్వే సంస్థ (NSSO) అక్షరాస్యత లెక్కలను తయారుచేయడం వలన మన కందుబాటులోకి వచ్చినది. కాని కేంద్ర హోమ్ శాఖ క్రింది పని జేసే రిజిస్ట్రార్ జనరల్ మరియు సెన్సస్ కమిషనర్ ఆఫ్ ఇండియా (ORGI) ఈ క్రింది జనాభాలెక్కల దశాబ్ధపు అక్షరాస్యతా రేటును చూస్తే మనం ఏ స్థితిలో ఉన్నామో అర్ధమౌతుంది క్రింది పట్టికను చూస్తే.

| S.No. | Census Year | Total(%) | Male(%) | Female(%) |
|---|---|---|---|---|
| 1 | 1901 | 5.35 | 9.83 | 0.60 |
| 2 | 1911 | 5.92 | 10.56 | 1.05 |
| 3 | 1921 | 7.16 | 12.21 | 1.81 |
| 4 | 1931 | 9.50 | 15.59 | 2.93 |
| 5 | 1941 | 16.10 | 24.90 | 7.30 |
| 6 | 1951 | 16.67 | 24.95 | 9.45 |
| 7 | 1961 | 24.02 | 34.44 | 12.95 |
| 8 | 1971 | 29.45 | 39.45 | 18.69 |
| 9 | 1981 | 36.23 | 46.89 | 24.82 |
| 10 | 1991 | 42.84 | 52.74 | 32.17 |
| 11 | 2001 | 64.83 | 45.26 | 53.67 |
| 12 | 2011 | 74.04 | 82.14 | 65.46 |

జనాభా లెక్కలు, 2011

దళితుల్లో ప్రధానంగా షెడ్యూల్డు క్యాస్ట్, షెడ్యూలు ట్రైబ్స్ (S.C, S.T) లలో అక్షరాస్యత చూస్తే దేశ సరాసరి కంటే తక్కువగానే పెరుగుతూ వచ్చింది. ఆ పెరుగుదల 1961లో S.C, S.T లు కలిపి 28.30 శాతముంటే 2011లో 73.00 శాతంగా పెరిగింది. ఈ క్రింది పట్టిక చూడండి.

| Year | SCs | STs | All (%) |
|---|---|---|---|
| 1961 | 10.3 | 8.5 | 28.30 |
| 1971 | 14.67 | 11.3 | 34.50 |
| 1981 | 21.38 | 16.35 | 43.60 |
| 1991 | 37.41 | 29.60 | 52.20 |
| 2001 | 54.70 | 47.10 | 64.80 |
| 2011 | 66.10 | 58.96 | 73.00 |

జనాభాలెక్కలు, 2011

**ఆంధ్రప్రదేశ్ అక్షరాస్యత :**

1961 నుండి 2011ల మధ్య భారతదేశంలో అక్షరాస్యతా రేటు 54.69 శాతం పెరిగితే ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 46.8 శాతం పెరిగింది. రెండింటికి మధ్యగల తేడా 7.89 శాతం పాయింట్లు. అలాగే పురుషులు 40.49 శాతం పెరిగితే స్త్రీల అక్షరాస్యత 49.29 శాతం పెరిగింది. అదే కాలంలో దేశస్థాయిలో గాని రాష్ట్ర స్థాయిల్లో గాని స్త్రీల అక్షరాస్యతా రేటు తక్కువగా ఉందనేది వాస్తవం. పురుషులకు స్త్రీలకు మధ్యగల తేడా 5.54 శాతంగా ఉంది. అదే విషయాన్ని ఈ క్రింది పట్టిక తెలియజేస్తుంది.

**Table : 3**

| | Andhara Pradesh | | | All India | | |
|---|---|---|---|---|---|---|
| Year | Persons | Male | Female | Persons | Male | Female |
| 1961 | 21.2 | 30.2 | 12 | 28.30 | 40.40 | 15.35 |
| 1971 | 24.6 | 33.4 | 15.8 | 34.45 | 45.96 | 12.97 |
| 1981 | 29.9 | 39.3 | 20.4 | 43.57 | 56.38 | 29.76 |
| 1991 | 44.1 | 55.1 | 32.7 | 52.21 | 64.13 | 39.29 |
| 2001 | 60.5 | 70.3 | 50.4 | 64.84 | 75.26 | 53.67 |
| 2011 | 67 | 74.9 | 59.1 | 72.99 | 80.89 | 64.64 |

జనాభా లెక్కలు, 2011

**జిల్లాల్లో అక్షరాస్యత**

**Table : 4**

| S.No. | Name of the District | Literacy Rate : 67.41% | | |
|---|---|---|---|---|
| | | Total | Male | Female |
| 1 | పశ్చిమగోదావరి | 74.63 | 77.92 | 71.36 |
| 2 | క్రిష్ణ | 73.74 | 78.30 | 69.18 |
| 3 | చిత్తూరు | 71.53 | 79.83 | 63.28 |
| 4 | తూర్పుగోదావరి | 70.99 | 74.51 | 67.52 |
| 5 | నెల్లూరు | 68.90 | 74.74 | 61.99 |
| 6 | గుంటూరు | 67.40 | 74.79 | 60.09 |
| 7 | వై.యస్.ఆర్ | 67.30 | 77.78 | 56.77 |
| 8 | విశాఖపట్నం | 66.91 | 74.56 | 59.34 |
| 9 | అనంతపూర్ | 63.57 | 71.02 | 53.97 |
| 10 | ప్రకాశం | 63.08 | 72.92 | 53.97 |
| 11 | శ్రీకాకుళం | 61.74 | 71.61 | 52.08 |
| 12 | కర్నూలు | 59.97 | 70.10 | 49.78 |
| 13 | విజయనగరం | 58.89 | 68.15 | 49.87 |
| | ఆంధ్రప్రదేశ్ | 67.41 | 74.83 | 60.01 |

జనాభా లెక్కలు, 2011

పై పట్టికలో చూపినట్లు జిల్లాల వారిగా చూస్తే తూర్పుగోదావరి 74.63 శాతంతో ప్రధమ స్థానంలో ఉంటే విజయనగరం జిల్లా 58.89 శాతంతో అధమస్థానంలో ఉంది. విశాఖపట్నం జిల్లా 66.91 శాతంతో 8వ స్థానంల ఉంది. అన్ని జిల్లాలలో స్త్రీ, పురుషుల మధ్య 15 శాతం వరకూ వ్యత్యాసం ఉంది. కాబట్టి అన్ని అక్షరాస్యతా కార్యక్రమాలు ఈ స్త్రీ పురుషుల మధ్య అగాధాన్ని కూరద్చాలని సూచిస్తున్నాయి.

**కేంద్ర అక్షరాస్యతా కార్యక్రమాలు :** 1. జాతీయ వయోజన విద్యా కార్యక్రమం (NAEP) అక్టోబర్, 2,1978లో ప్రారంభమైంది. అక్షరాస్యతను త్వరితిగతిని పెంచి సమాజిక, సాంస్కృతిక రంగంలో ప్రజలు కీలకమైన పాత్ర వహించాలని ఈ కార్యక్రమ ఉద్దేశ్యం. ఇది ముఖ్యమైన మూడు విధులను నెరవేర్చాలన్నది. ఇవి : అక్షరాస్యత, కార్యాత్మక విద్య, అవగామన కల్పించడంలాంటివి.

2. జాతీయ అక్షరాస్యత మిషన్ (NLM) దీని మే, 5, 1988లో ఆనాటి ప్రధానమంత్రి రాజీవ్ గాంధి మొదలు పెట్టారు. సంపూర్ప అక్షరాస్యతకు ప్రాధాన్యత నివ్వాలని ఈ మిషన్ ఆకాంక్ష నిరంతర అక్షరాస్యతా కార్యమ్రమానికి నాంది పలికింది.

3. సాక్షర భారత్ (Sakshar Bharat) కేంద్రప్రభుత్వం దీన్ని సెప్టెంబర్ 8, 2009లో ప్రారంభించింది. దీన్ని ఒక సంగ్రమైన పద్ధతి (Integrted Approach)తో దేశంలో అక్షరాస్తను నిరంతర ప్రక్రియగా చేయాలని ప్రకటించింది. ఈ పద్దతిలో నాల్గు ముఖ్యమైన అంశాలున్నాయి. అవి : 1) ప్రాధమిక అక్షరాస్యత 2) ప్రాధమిక విద్య 3) వృత్తి నైపుణ్యాలు 4) నిరంతర విద్యా కార్యక్రమం.

**ముగింపు :** స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండి ఎన్ని కార్యక్రమాలుచేపట్టినా ఇప్పటికి సంపూర్ణ అక్షరాస్యతను సాధించులేకపోయాం. దీనికి పధకాలతోపాటు నిరంతర శ్రమ, పట్టుదల, దీక్ష ప్రభుత్వాలకు ప్రజలకుండాలి.

**సంప్రదించిన గ్రంధాల :** 1) గణపతి రాజు, షోరన్‌రాజు (2020) Digital Commnication and Social Media in Saakshar Bharat 2) వాసుదేవరావు (2015) Historical Perspectives of Adult Education.



# మన తెలుగుకవి...



- గౌతమ్ శ్రీనివాస్



మా తెలుగుతల్లికి మల్లెపూదండ... అంటూ మన తెలుగుతల్లిని కీర్తించిన ఈ తమిళీయుడు, సుందరకవి శంకరంబాడి సుందరాచారి పుట్టినరోజు సెప్టెంబరు10.ఆంధ్రప్రదేశ్ కు రాష్ట్రగీతాన్ని అందించిన ఈ మహనీయుడి మెడలో ఈరోజు కనీసం దండైనా వేసి, దండం పెట్టారా, అంటే, అనుమానమే. వై ఎస్ రాజశేఖర్ రెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు 2004లో, తిరుపతిలో వీరి విగ్రహం ప్రతిష్ఠించి, ప్రభుత్వం ఘనంగా ఈ మహనీయునికి నివాళులర్పించింది.వేంకటేశ్వర విశ్వవిద్యాలయం "ప్రసన్నకవి" పేరుతో గౌరవించింది.ఈ పుట్టినరోజు సందర్భంగా, అక్కడక్కడా సోషల్ మీడియాలో తప్ప, ఇతని ఊసు పెద్దగా ఎక్కడా వినిపించినట్లు లేదు. మా చెవులు రింగుమని మారుమ్రోగే దాక, నీ పాటలే పాడుతాం, నీ ఆటలే ఆడుతాం...అంటూ ఆయన మాత్రం తన పాట వినిపించారు.తెలుగుతల్లికి జై కొట్టిన శంకరంబాడిని ఒకసారి మళ్ళీ తలపుల్లోకి తెచ్చుకుందాం. సుందరాచారికి భావకవి,అహంభావకవి అని కూడా పేరుంది. ఆయన కవిత్వాన్ని పరిశీలిస్తే, భావుకత నిండిన సుందరకవిగానే కనిపిస్తాడు. శంకరంబాడి మాతృభాష తమిళం. తిరుపతి దగ్గర తిరుచానూరులో తమిళకుటుంబంలో 1914, సెప్టెంబరు 10వ తేది నాడు జన్మించాడు.ఇక్కడ తెలుగు, తమిళం అక్కాచెల్లెలాగా కలిసి సాగుతాయి కాబట్టి, సుందరాచారి తెలుగుభాషకు బాగా దగ్గరయ్యాడు. తెలుగు పదాలు, పద్యాలు, కవిత్వం అతన్ని బాగా ఆకర్షించాయి. పద్యాల్లో కూడా తేటగీతి అంటే చాలా ఇష్టం. గీతంగా మనం పాడుకొనే "మా తెలుగుతల్లికి" రచన తేటగీతి పద్యాల సమాహారం.ఇది 1942లో రాశాడు.ఈ పాట పుట్టి కూడా ఇప్పటికి దాదాపు 80ఏళ్ళు పూర్తయింది.ఈయనది మొదటి నుండీ విభిన్న వ్యక్తిత్వం. స్వేచ్ఛా ప్రియుడు. స్వతంత్ర భావాలు ఎక్కువ. సంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన ఈయన సంధ్యావందనాలు వంటి వైదిక కార్యక్రమాలు చేసేవాడు కాదు. తండ్రి మందలించేసరికి, జంధ్యాన్ని తెంచిపారేసి, ఇంటి నుండి బయటకు వెళ్ళిపోయాడు. అప్పటికే ఇంటర్మీడియట్ వరకూ చదువుకొని ఉన్నాడు. బతుకుదెరువు కోసం హోటల్లో సర్వర్‌గా, రైల్వేస్టేషన్‌లో కూలీగా, రకరకాల చిన్నా చితక పనులన్నీ చేశాడు. వీటన్నంటితో విసిగిపోయి, మద్రాస్ వెళ్ళాడు. ఆంధ్రపత్రిక ఆఫీస్‌కు వెళ్లి,నేరుగా కాశీనాథుని నాగేశ్వరావుపంతులును కలిశాడు. ఉద్యోగం కావాలని అడిగాడు. ఇతని వాలకం ఎలా ఉన్నా, భాషను చూసి వెంటనే ఆంధ్రపత్రికలో ఉద్యోగం ఇచ్చారు. ఆంధ్రపత్రికలో ఉండగా, ఒక ప్రముఖునిపై పద్యం రాయవలసి వచ్చింది. నేను వ్యక్తులపై పద్యాలు రాయనని ఆ ఉద్యోగం వదిలించుకొని మళ్ళీ రోడ్డున పడ్డాడు. ఎలాగో, బి.ఏ పూర్తి చేశాడు. ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్‌గా కొంతకాలం పనిచేశాడు. అక్కడ కూడా ఆత్మగౌరవం దెబ్బతిని ఆ ఉద్యోగాన్నీ వదిలేశాడు.పెళ్లి చేసుకొని, సంతానం కన్నాడు. వారు అనారోగ్యంతో మరణించే సరికి మానసికంగా ఇంకా దెబ్బతిన్నాడు. దేశదిమ్మరిగా మారాడు. ఇవన్నీ ఎలా ఉన్నా, కవిత్వాన్ని ఎన్నడూ వదల్లేదు. విభిన్నమైన విలక్షణమైన కవిత్వాన్ని సృష్టించాడు. అన్నీ రసగుళికలే. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ మొదలు ఎందరో మహామహులకు శంకరంబాడి కవిత్వమంటే చాలా ఇష్టం. మాడభూషి అనంతశయనం అయ్యగారి వంటి పెద్దలతో ఇతనికి స్నేహం కూడా ఉంది.మా తెలుగుతల్లికి

సెప్టెబర్ 15 ఇంజనీర్స్ డే, మోక్షగుండం విశేశ్వరయ్య జయంతి

రచన ఒక సినిమా కోసం రాసింది.కానీ,ఆ సినిమావాళ్ళు దీన్ని తీసుకోలేదు. టంగుటూరు సూర్యకుమారి పాడి,రికార్డు చేసిన తర్వాత దీనికి ఎంతో ఖ్యాతి వచ్చింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర చారిత్రక, సాంస్కృతిక వారసత్వాన్ని కవిత్వంలో రంగరించి ఈ గీతంగా మలిచాడు. ఈ పాట ఎప్పుడు విన్నా, ఒళ్ళు గగుర్పొడుస్తుంది. అంత శక్తి ఈ రచనలో ఉంది.ఒకసారి ఢిల్లీ వెళ్లి జవహర్ లాల్ నెహ్రూను కలిసి, తను రాసిన బుద్ధచరిత్రలోని ఒక పద్యాన్ని ఇంగ్లిష్ లోకి అనువదించి, ఆయనకు వినిపించాడు. నెహ్రూ ముగ్ధుడై,500రూపాయలు బహూకరించి,సత్కరించాడు. రవీంద్రనాథ్ ఠాగూర్ రాసిన గీతాంజలిని కూడా అనువదించాడు.మక్కికిమక్కి అనువాదం కాక, మూలంలోని భావాన్ని తీసుకొని, తెలుగు నుడికారంతో అనుసృజన చేశాడు. దీనికి ఎంతో పేరు వచ్చింది.మహాత్మాగాంధీ మరణించినప్పుడు బలిదానం అనే కావ్యం రాశాడు. అది అతను పాడి వినిపిస్తుంటే, వినేవారు కన్నీళ్ల జలపాతాలు రాల్చేవారని ప్రముఖ కవి పులికంటి కృష్ణారెడ్డి ఒక సందర్భంలో రాశారు. సుందరరామాయణం, సుందరభారతం కూడా రాశాడు. పేరుకు తగ్గట్టుగా అవి సుందర సుమధుర కావ్యాలే.జానపద గీతాలు కూడా రాశాడు. స్థలపురాణాలూ రాశాడు. మహాత్మాగాంధీ,దీనబంధు, బిల్హణీయం మొదలైన సినిమాలకు పాటలు రాశాడు. దీనబంధు సినిమాలో నటించాడు కూడా. శంకరంబాడి సుందరాచారి, అనే నా పేరు కూడా తేటగీతిలోనే ఇమిడింది, అంటూ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మతో చమత్కరించాడు కూడా. కవిత్వంలో తేట ఉండడమే కాక, చెప్పాలనుకున్నది తేటతెల్లంగా చెప్పడం కూడా శంకరంబాడి నైజం. చాలా పేదరికం, మానసికమైన అశాంతి మధ్య,మద్యానికి బానిసయ్యాడు. 62ఏళ్ళ వయస్సులో,1977లో, ఈ లోకాన్ని వదిలి వెళ్ళిపోయాడు. గొప్ప భావుకుడు. గొప్ప కవి. నిష్కల్మషమైన వ్యక్తి. ఇంకా ఎంతో పేరు రావాల్సిన కవి శంకరంబాడి.తన సమకాలిక జీవితంలో, పెద్దల దగ్గర, పిన్నల దగ్గర మంచి గుర్తింపు తెచ్చుకున్నాడు. విలక్షణమైన రచనలు చేశాడు. కవిగా గెలిచాడు. జీవితంలో ఓడిపోయాడు తేటగీతుల తెలుగు తీపి రుచుల ఊట... శంకరంబాడి పాట.ఈ కవి నేడు జీవించి ఉంటే, నేటి తెలుగు భాషా పరిస్థితులు, తెలుగునేలపై నెలకొని ఉన్న దుస్థితులు చూసి, నిప్పులు, కన్నీళ్లు కలిపి కొత్త గీతం రాసేవాడు.

# శ్రీవేంకటేశ్వరుని సుప్రభాతం

- ప్రజామీడియా నెట్‌వర్క్

**కౌసల్యా సుప్రజా రామ పూర్వాసంధ్యా ప్రవర్తతే**
**ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్**
**ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ**
**ఉత్తిష్ఠ కమలాకాంత త్రైలోక్యం మంగళం కురు**

శ్రీవేంకటేశ్వరుని సుప్రభాతం సుబ్బులక్ష్మి గొంతులో మనకి సుపరిచితం. - ప్రభాతము" అనగా "మంచి ఉదయం" అని అర్థం. హిందూ పూజా విధానాలలోను, ప్రత్యేకించి శ్రీవైష్ణవం ఆచార పరంపరలోను, భగవంతుని పూజామూర్తికి అనేకమైన సేవలు (షోడశోపచారములు) నిర్వహించే సంప్రదాయం ఉంది. ఇలాంటి సేవలలోనిదే సుప్రభాత సేవ. ఆ సుప్రభాత సేవా సమయంలో చేసే కీర్తననే "సుప్రభాతం" అని అంటారు. తిరుమల శయనపూ మంటపంలోని భోగశ్రీనివాసుని ఈ సుప్రభాతం ద్వారా మేల్కొలుపుతారు. బంగారు వాకిలిలో పదహారు స్తంభాల తిరుమామణి మంటపంలో ఈ సుప్రభాతాన్ని పఠిస్తారు. సుప్రభాత పఠనానంతరం భోగశ్రీనివాసుని గర్భగుడిలోనికి తీసికొని వెళతారు. 1430 సంవత్సరంలో శ్రీవీరప్రతాపరాయల హయాంలో వేదపఠనంతోపాటు సుప్రభాత పఠనం కూడా ఆరంభమైంది. అప్పటినుండి అవిచ్ఛిన్నంగా ఈ సంప్రదాయం కొనసాగుతున్నది. కాని అది రాసినది ..ఎవరో తెలుసా? శ్రీ హస్తగిరి అనంతాచార్యులు. 1361 లో రాసాడు,.



# దళిత సాహిత్య యుగకర్త



**డా.జి.వి.రత్నాకర్,**
మౌలానా ఆజాద్ నేషనల్ ఉర్దూ యూనివర్సిటీ, హైదరాబాద్

కారంచేడు ఉద్యమ రణ క్షేత్రంలోంచి పొడుచుకొచ్చిన కన్నమదాసు కరవాలం కత్తి పద్మారావు. ఆయన కవిత్వంలో హోచిమెన్లు, పాబ్లో నెరూడాలు, గాలిబ్‌లు, ఫైజ్ అహ్మద్ ఫైజ్‌లు, మఖ్దూం మొహియుద్దీన్‌లు, శివసాగర్లు, కలేకూరి ప్రసాద్‌లు, మద్దూరి నగేష్‌బాబులు, నాగప్పగారి సుందర రాజులు కనిపించి ఏడిపిస్తారు. కదన రంగానికి పరుగులు తీయిస్తారు.

సాహిత్యం ప్రజల ఆలోచనల్ని ప్రతిబింబింపజేస్తుంది. ఉద్యమ బాట పట్టిస్తుంది. నినాద నాదాలు చేయించి నవలోక నిర్మాణానికి మార్గం సుగమమం చేస్తుంది. భారతదేశ చరిత్రలో దళిత సాహిత్యంలో కారంచేడు ఉద్యమానికి ఒక ప్రత్యేకత ఉంది. ఆ ఉద్యమ నేత కవి కత్తి పద్మారావు. సమాజంలో నెలకొన్న విభిన్నమైన విషయాల్ని సంఘటనల్ని సాహిత్యం బహిర్గతం చేస్తుంది. అలాంటి నేపథ్యంతోనే కవి పద్మారావు సాహిత్యాన్ని, ప్రధానంగా కవిత్వాన్ని మనం చూడాలి. ఈ యుగ సాహిత్యంలో అత్యంత ప్రముఖమైన, చర్చించాల్సిన విషయంగా దళిత సాహిత్యం ముందుకు వచ్చింది. సామాజిక మార్పుని కోరుకునే సాహిత్యమే దళిత సాహిత్యం. ఇది దళిత, పీడిత, దోపిడీకి గురైన, హక్కుల నిరాకరణకు గురైన వర్గాల అభివృద్ధి గురించి గొంతెత్తి నినదిస్తుంది. సామాజిక అసమానతలు మతపరమైన దురాచారాలని దళిత సాహిత్యం నిరాకరిస్తుంది. భారతదేశ చరిత్రలో అన్నింటికి మించిన కళంకం ఏదైనా ఉందీ అంటే... అది కులమే. అనేక సమస్యలకి మూలం అదే. కుల కాలుష్యాన్ని తొలగిచేందుకు, తలపై పులిమిన పాప పంకిలాన్ని కడిగి కరుణించేందుకు ఎందరో మహాత్ములు వచ్చారు, కాలం తీరిపోయారు. కాని కులం మాత్రం అలాగే ఉంది. డాక్టర్ బాబాసాహెబ్ అంబేడ్కర్ దళిత సమాజంలో కొత్త చైతన్యాన్ని కొత్త చూపుని ప్రసాదించాడు. ఒక చోట గాంధీకి జవాబుగా 'మీరు భారత్‌ను నా మాతృభూమిగా చెబుతున్నారు. ఏ దేశంలో కుక్కలు, పిల్లులు జంతువుల కంటే హీనంగా చూడబడుతున్నామో ఆ దేశం మాదెట్లా అవుతుంది' అంటాడు.

కుల నిర్మూలనకు ప్రయత్నించిన మహానుభావులలో బుద్ధుడు, కబీర్, ఫూలే, అంబేడ్కర్, కుసుమ ధర్మన్న, జాషువా లాంటి వారెందరో ఉన్నారు. మంత్రతంత్రాలతో, రాజ్య సహకారంతో కుట్రలతో బ్రాహ్మణవాద సమాజ మాయోపాయానికి గురైన బహుజన సమాజం నేటికీ తమ పోరాట పంథాలో పయనిస్తూ అక్షరాల్నే ఆయుధాలుగా ప్రయోగిస్తున్నది. అదే స్థాయిలో కవి పద్మారావు అనేక దళిత ప్రతీకలతో, బింబాలతో, శైలితో నిరంతర కవిత్వ సాధనలో ఉన్నారు.

భారత దళిత సాహిత్యం అమానవీయమైన దళిత సమస్యల్ని అనేక రూపాల్లో బహిర్గతం చేస్తుంది. సామాజిక, ఆర్థిక రాజకీయ, సాంస్కృతిక, కులపరమైన సమస్యల్ని, మూఢనమ్మకాలతో ఉన్న దళిత జీవన సమస్యల్ని ప్రతిబింబిస్తుంది. అది చైతన్యం నిండిన సాహిత్యం. దానిలో దళితుల బాధలు, కష్ట-నష్టాలు, ఉద్యమాలు మాత్రమే కాకుండా నిజమైన జీవన సౌందర్య చిత్రణ కూడా ఉంది. దళిత చైతన్యం సామాజిక అవలక్షణాల నుంచి సాంస్కృతిక బానిసత్వం నుంచి విముక్తిని పొందే దిశలో ముందుకు కదులుతోంది. ఆ చైతన్య స్థాయిని మనం కవి పద్మారావు కవిత్వంలో చూడాల్సి ఉంటుంది. సాహిత్య చరిత్రలో కవిత ప్రముఖమైన స్థానాన్ని ఆక్రమించింది. దళిత సాహిత్యంలో కూడా దళిత కవిత్వం ముఖ్యమైన స్థానంలో ఉంది. తెలుగు దళిత కవిత్వంలో కత్తి పద్మారావు కవిత్వానికి ప్రత్యేక స్థానం ఉంది.

దళిత సాహిత్య భావన భారతీయ సాహిత్యంలో మొట్టమొదటిగా మరాఠీ సాహిత్యం నుండి వచ్చింది. 'ఆది హిందూ' ఉద్యమ నిర్మాత స్వామి అచ్యుతానంద్‌ని మొదటి హిందీ దళిత కవిగా పేర్కొనాలి. మోగాళ్ళయిన బ్రాహ్మణులు విదేశీ శబ్దం అయిన హిందూ పదాన్ని తమకు తాము ఆపాదించుకుని భారతదేశాన్ని హిందూ దేశం అంటున్నారు. ఈ దేశ మూలవాసులైన మనమే ఆది హిందువులం అని ఆయన అంటారు. అచ్యుతానంద్, 'శంబూకముని', 'రామరాజ్య న్యాయం' అనే నాటికలు, 'ఆదివంశ్ కా ఢంకా' అనే కావ్య సంపుటి రచించాడు. అచ్యుతానంద్ కవిత్వ చైతన్య స్థాయి, ఉద్యమ కవిత్వాన్ని పద్మారావు కవిత్వంలో చూడవచ్చు.

మరాఠీలో అచ్యుతానంద్ దళిత కవిత్వం తరువాతనే 'దళిత పాంథర్స్' కవిత్వం ప్రారంభమైంది. తెలుగు దళిత సాహిత్యంలో గొప్పవైన 'మాలపల్లి', 'హరిజన నాయకుడు' లాంటి గ్రంథాలను దళితేతరులు రచించారు. 100 సంవత్సరాల క్రితమే ఓ అజ్ఞాత కవి రచించిన 'మాలవాండ్ర పాట'ను మొదటి తెలుగు దళిత గేయంగా పేర్కొనవచ్చు. 'మాకొద్దీ నల్ల దొరతనం' అని గొంతెత్తి 'హరిజన శతకాన్ని' రచించిన కుసుమ ధర్మన్నని, 'గబ్బిలం' అనే గొప్ప ఖండ కావ్యాన్ని రచించిన జాషువా కంటే కూడా మొదటి వానిగా చెప్పాల్సి ఉంటుంది. ఎందుకంటే బ్రతిమాలే ధోరణిని కాకుండా ఉద్యమ స్ఫూర్తితో రచించిన కావ్యంగా 'హరిజన శతకం' తెలుగులో వచ్చిన అన్ని శతకాల కంటే ముందు వుంది. తెలుగు దళిత సాహిత్యంలో 'నిశాని' కవులుగా మనముందుకు వచ్చిన పైడి తెరేష్‌బాబు, మద్దూరి నగేష్‌బాబు, ఖాజా, వరదయ్య(లక్ష్మీనరసయ్య)లు దళిత కవిత్వానికి

కొత్త పలుకుబడిని అందించారు. శివసాగర్, బొజ్జాతారకం, కలేకూరి ప్రసాద్, సతీష్‌చందర్, ఎండ్లూరి సుధాకర్, శిఖామణి లాంటి కవులు తమదైన శైలితో ముందుకొచ్చారు. నల్లగొండ నుంచి వెలువడిన 'గోసంగి కవులు' వేముల ఎల్లయ్య, ప్రసాద్, వెంకట్, వెంకన్న కవిత్వం, సెంట్రల్ యూనివర్శిటీ నుండి 'దళిత మానిఫెస్టో' కుట్రను బద్దలు కొడుతూ ముందుకొచ్చిన 'గుండె డప్పు' కవిత్వం.

తెలుగు దళిత సాహిత్యంలో 'జైలు గంటలు' మోగించుకుంటూ అగ్రహారపు గుండెల్లో, నల్ల కలువలు పూయించి, మాలమాదిగ పల్లెల్లో నీలికేకలు సృష్టిస్తూ అంటరాని అణగారిన కులాల అవమానాగ్నుల్ని ముళ్ళ కిరీటంగా ధరించి పాప ప్రక్షాళన కోరిన నాటి జీసస్‌లా, ఈ దేశ మూలవాసులైన అంటరానివారి 'భూమిభాష'నే మాట్లాడుతూ, కష్టాల కొలిమిలో మండిపోతున్న అణగారిన ఆర్తుల గుండె ఘోషల్ని 'కట్టెల మోపు'లా నెత్తికెత్తుకొని గుండెలనిండుగా బుద్ధుణ్ని, అంబేడ్కర్‌ని నింపుకుని 'ఆత్మగౌరవ స్వరంతో' ఉద్యమ స్ఫూర్తితో ఈ యుగ కవిగా, ఈ యుగ కవిత్వాన్ని వినిపిస్తూ మనముందుకు కవి కత్తి పద్మారావు దూసుకు వచ్చారు. ప్రాచీన భారతీయ సాహిత్యంలో చార్వాకులు, లోకాయతులు, శంబూకుడు, త్రిశంకుడు లాంటి పాత్రల్లో అన్యాయాలకు, అక్రమాలకు, హత్యలకు గురైన అంటరాని మనుషులు అనేకం కనిపిస్తారు. మానవ సమాజ క్షేమం కోరి ప్రజ్ఞ, సమత, కరుణ అనే త్రిశరణాలను బోధించిన బుద్ధుడు నడయాడిన నేల ఇది. భక్తి కాలంలో వచ్చిన సంత్ సాహిత్యంలో నిర్గుణధారకు చెందిన జ్ఞానాశ్రయ శాఖలో సంత్ కబీర్, సంత్ రవిదాస్, గురునానక్ విప్లవాత్మకమైన సాహిత్యాన్ని సృష్టించారు.

సంత్ కబీర్‌దాస్ ఒకచోట 'జాతి నాపూఛో సాధూకీ పూఛ్ లీజియేజ్ఞాన్/మోల్ కరో తల్వార్ కీ, పడే రహనే దో మ్యాన్' అనగా సాధువు యొక్క కులాన్ని అడగవద్దు, అతనిని జ్ఞానం గురించి అడిగి తెలుసుకోండి. ఖడ్గం పదును చూడండి. దానిని ఉంచే ఒర ఎలా ఉంటే మనకేంటి అంటాడు. కబీర్ స్ఫూర్తితో అసలైన విప్లవ కారునిగా తెలుగు దళిత కవిత్వంలో కత్తి పద్మారావు దళిత కవిత్వాన్ని సృష్టించారు. అంబేడ్కర్ తండ్రి రాంజీసక్పాల్, ఫూలే, కబీర్ పంథ్‌కి చెందినవారు, పంజాబ్‌లో కబీర్‌పంథ్ అనే ఎస్‌సి కులం ఉంది. వాళు ౖ చమారేతర, రవిదాసేతర మహర్, మాల కులంగా ప్రకటితులయ్యారు. కబీర్ దారిలో పద్మారావు ఒకచోట "యజ్ఞోపవీతం/పేరుతో/ద్విజన్మను/సృష్టించి/ యాచక వృత్తికి/నన్ను సంకేతం చేశారు/నాకు జంధ్యమని పేరు పెట్టి/ఇళ్ళ పేర్లుగా కూడా/పెట్టుకుని 'పూ'లు దారాలతో/మనుషుల గొంతులు బిగించి/పూలదండ గురించి/బావురుమని/'కరుణశ్రీ' బిరుదులు కొట్టేశారు/అ, ఆలు రాని/నిరక్షరాసి/నన్ను ధరించి/పంతులుగా పిలువబడుతుంటే/నిజమైన గురువు/మాల మాష్టర్ అయ్యాడు' అంటారు. మానవ ధర్మ ప్రవక్త సంత్ రవిదాస్ ఇలా అంటాడు-/'జాకే కుటుంబ్ కే డౌర్ డోవంత్ ఫీరల్/అజుప్ బనారస్ కే ఆస్ ఆసా పాసా/ఆచార్ సహిత్ విప్రకర్‌హి దండవత్/విన్ వనయ్ రవిదాస్ దాసానుదాసా" నా కులపు ప్రజలు కాశీ దగ్గర చనిపోయిన పశువుల్ని మోస్తున్నారు. బ్రాహ్మణులు గౌరవ ప్రదమైన రీతిలో దాసానుదాసుడైన నా ముందు మోకరిల్లుతున్నారు. దీని అర్థం ఏమంటే మనల్ని మనం హీనంగా చూసుకోకుండా మన పనిని మనం చేయాలి. జ్ఞానాన్ని ఆర్జించాలి. జ్ఞానంతోనే మనిషిని గౌరవిస్తారు అంటారు.

బాబాసాహెబ్ అంబేడ్కర్ బానిసత్వాన్ని మించిన దుర్మార్గం ప్రపంచంలో ఎక్కడైనా ఉంది అంటే అది కులమేనని నినదించారు. మహాత్మా అని కీర్తించే గాంధీ కూడా వర్ణ వ్యవస్థను స్వీకరిస్తూనే కుల వ్యవస్థ పోవాలి అంటూ సంస్కరణ వాదపు గొంతుతో హరిజనోద్ధరణ ఉద్యమంతో స్వాతంత్ర్య ఉద్యమాన్ని నడిపారు. కులం పేరుతో నీచమైన వాడిగా చూసిన దశను గుర్తుంచుకుంటూ జ్ఞానమే గొప్పతనానికి మూలమన్న రవిదాస్ మార్గంలో తన జాతి గొప్పదనాన్ని కీర్తిస్తూ మహోన్నతమైన స్థానాన్ని గుర్తిస్తూ కవి కత్తి పద్మారావు ఒక చోట 'నా పాదాల్లో/అరుణ కిరణాలున్నాయని/నేడు నమస్కరిస్తున్న/చేతులు నేను చిన్నప్పుడు/మంచి నీళ్ళడిగితే/అస్పృశ్యమన్నాయి/నేను నడిస్తే/నా వెనుక పరిగెడుతున్నప్పుడు కాని/నా నడకను/వాళ్ళ పరుగు/అందుకోలేదని/వారికి తెలియదు' అంటాడు. కత్తి పద్మారావు కవిత్వం వక్తృత్వ ధోరణితో పాఠకుల్ని నిలేసి ప్రశ్నిస్తుంది. పల్లెల ఉగ్గుపాలు తాగిన పద్మారావు దళిత భాషను దళిత సంస్కృతిని తన శైలిలో ఆవిష్కరించాడు. పండుకారప్పచ్చడి, గోంగూర పచ్చడి, బెల్లం కుడుములు, పిల్లి పెసర్లు, బొబ్బర్లు, బెల్లబ్బువ్వ, అలసందులు ఆయన కవిత్వం నిండా పరుచుకుంటాయి.

కారంచేడు ఉద్యమ రణ క్షేత్రంలోంచి పొడుచుకొచ్చిన కన్నుమదాసు కరవాలం కత్తి పద్మారావు. ఆయన కవిత్వంలో హొచిమెన్లు, పాబ్లో నెరూడాలు, గాలిబ్‌లు, ఫైజ్ అహ్మద్ ఫైజ్‌లు, మఖ్దూం మొహియుద్దీన్‌లు, శివసాగర్లు, కలేకూరి ప్రసాద్‌లు, మద్దూరి నగేష్‌బాబులు, నాగప్పగారి సుందర రాజులు కనిపించి ఏడిపిస్తారు. కదన రంగానికి పరుగులు తీయిస్తారు. భారతీయ దళిత కవిత్వంలో కత్తి పద్మారావు కవిత్వం ప్రత్యేక శైలిలో కనిపిస్తుంది. ఇది దళితుల సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల దుర్మార్గాన్ని ఎండగట్టింది. తమ స్వార్థం కోసం అగ్రవర్ణాలు ఆడుతున్న కపట నాటకాలు, దొంగ ప్రేలాపలపై వ్యంగ్యాస్త్రాలు ఇందులో ఉన్నాయి. హిందూ మత కుట్రలు, హింసోన్మాద చర్యల్ని ఈ కవిత్వం బట్టబయలు చేసింది. దళిత జీవన కోణాల్ని కవి పద్మారావు కవిత్వం బహిర్గత పరిచింది. దారిద్ర్యాన్ని, దుర్భరమైన స్త్రీల పరిస్థితుల్ని మూఢ నమ్మకాల్ని, విలువలు లేని తనాన్ని ఖండించింది. వర్ణాశ్రమ ధర్మాన్ని, అంటరానితనాన్ని తరాలుగా ఊరిబైట వెలిలో బతుకుతున్న దళితుల మానవ హక్కులకోసం నినదించింది. ఈ కవిత్వం దళిత జీవన విషాదాన్నే కాక భవిష్యత్ కలనుకూడా కనింది. 'లేరా లేరా దళితుల యుగమిదిరా' అన్నటువంటి పద్మారావు పాటలాగానే ఇది దళిత సాహితీయుగం. ఈ యుగ సాహిత్యాన్ని సృష్టించిన పద్మారావు ఈ యుగకవి.

# బయోమిమిక్రి: ప్రకృతి నుండి విన్నూత ఆలోచనలు

ప్రకృతి అందరికీ తల్లి, ఎందుకంటే ఇది మన జీవితాన్ని నిలబెట్టడానికి సహాయపడుతుంది. ఇది శాశ్వతంగా మనకి తోడుగా ఉంటుంది. మానవ సమాజం ఎదుర్కొంటున్న అనేక సమస్యలను ప్రకృతి ఎప్పటికప్పుడు పరిష్కరిస్తూనే ఉంటుంది. ఈ ప్రకృతిలో నివసిస్తున్న జంతువులు, మొక్కలు మరియు సూక్ష్మజీవులు అనుభవజ్ఞులైన ఇంజనీర్లుగా పరిగణించబడ్డాయి, ఎందుకంటే అవి 3.8 బిలియన్ సంవత్సరాల ముందు ఆవిర్భవించిన భూమిపైన అనేక రకాల ఒడుదుడుకులను ఎదురుకుంటూ మనుగడను సాగిస్తున్నాయి. బయోమిమిక్రీ అంటే ప్రకృతిని అనుకరించడం. ప్రకృతి-పాఠాలను ఆచరణలో పెట్టడంపై దృష్టి సారించిన సాంకేతిక-ఆధారిత విధానాన్నీ బయోమిమిక్రీ అంటారు. బయోమిమిక్రీ యొక్క భావన ఒక ముఖ్య ఆలోచనపై ఆధారపడి ఉంటుంది: ప్రకృతి ఎల్లప్పుడూ వ్యర్థాలను ఉత్పత్తి చేయకుండా ఆర్థిక వ్యవస్థ మరియు సామర్థ్యం యొక్క సూత్రాలపై పనిచేస్తుంది అంటే "Nothing is lost, nothing is created and everything is transformed" శతాబ్దాల క్రితం నుండి డిజైనర్లు మరియు వాస్తుశిల్పులు ప్రకృతిని స్ఫూర్తిదాయకంగా చూశారు. బయోమిమిక్రీ అనే పదాన్ని మొట్టమొదట 1969లో ఒట్టో స్మిట్ చేత రూపొందించబడింది, కానీ 1982లో వెలుగులోకి వచ్చి మరియు 1997లో శాస్త్రీయంగా ఒప్పుకొబడింది. బయోమిమిక్రిని బయోమిమెటిక్స్ అని కూడా అంటారు ఇది ప్రకృతి అవలంబించిన సహజ ఎంపిక పరిష్కారాల నుండి ప్రేరణ పొంది మానవులకు ఉపయోగపడే శస్త్రీయ విధానం. బయోమిమిక్రీని అనుసరించే డిజైన్లు మానవ ఉత్పత్తులను మరింత సమర్థవంతంగా, స్థితిస్థాపకంగా మరియు స్థిరంగా ఉండటానికి అనుమతిస్తుంది. బయోమిమిక్రీ అనేది అనేక రంగాలలో అనగా ఔషధం, పరిశోధన, పరిశ్రమ, ఆర్థిక వ్యవస్థ, వాస్తుశిల్పం మరియు పట్టణ ప్రణాళిక, వ్యవసాయం మరియు నిర్వహణ లాంటి మానవ కార్యకలాపాలలో ఉపయోగ పడుతుంది. బయోమిమెటిక్ ఫిలాసఫీ అనేది వనరులను ఉపయోగించే విధానాన్ని సమతుల్యం చేయడమే లక్ష్యంగా బాధ్యతాయుతమైన మరియు స్థిరమైన అభివృద్ధి యొక్క ప్రపంచ వ్యూహంలో భాగం. ఈ నిర్మాణాలు ప్రకృతి నుండి ఎలా ప్రభావితమవుతాయో చూపించే అనేక ఉదాహరణలు ఉన్నాయి

1. 1903 లో రైట్ సోదరుల నుండి గాలి కంటే భారీగా ఎగురుతున్న మొదటి ఎగిరే యంత్రం ఎగిరే పావురాలచే ప్రేరణ పొందింది.

2. గెక్కో (బల్లి) క్లైంబింగ్ ఫీట్ (Gecko Climbing Feet) : గోడ మీద ప్రాకే బల్లి పదాలను అనుకరించి తయారు చేసిన క్లైంబింగ్ పాడ్స్.

3. కింగ్‌ఫిషర్-ప్రేరేపిత బుల్లెట్ రైలు: ప్రసిద్ధ జపనీస్ బుల్లెట్ రైలు, పక్షి ముక్కు ఆకారంతో ప్రేరణ పొందింది.

4. చెదపురుగుల మట్టిదిబ్బల నుండి స్థిరమైన భవన నమూనాలు: నిష్క్రియాత్మక శీతలీకరణ నిర్మాణాలను రూపొందించడానికి ఆర్కిటెక్చర్ లో చెదపురుగుల మట్టిదిబ్బలచే ప్రేరణ పొందింది.



**Dr. V.Anu Prasanna**, M.Sc., Ph.D
Assistant Professor, Head of the Department,
Department of Zoology,
Yogi Vemana University,
YSR Kadapa, A.P



5. హంప్‌బ్యాక్ తిమింగలాలు మాదిరిగానే విండ్ టర్బైన్లు:

6. "సూక్ష్మ సూది" యొక్క సృష్టి: నొప్పి కలిగించని సూక్ష్మసూదులు.

7. అర్మడిల్లో బ్యాక్‌ప్యాక్ స్పైడర్

8. సర్వైవర్-లొకేటింగ్

9. నీటి కింద కమ్యూనికేషన్: డాల్ఫిన్ల నుండి నీటి అడుగున సంకేతాలను ఎలా పంపాలో నేర్చుకోవడం.

అదేవిధంగా, సొరచేప యొక్క కఠినమైన చర్మ ఆకృతిని అనుకరించే వెట్ స్విమ్మింగ్ సూట్లు, పక్షి పుర్రెను ఉపయోగించి బయోమిమిక్రీ బూట్లు, ఇంచ్ వార్మ్ అనుకరంచే ట్రీ-క్లైంబింగ్ రోబోట్ మిమిక్స్, టెన్టకిల్-ప్రేరేపిత ప్రోస్తెటిక్ చేతులు, బయోమిమిక్రి హెలియోట్రోప్ సూర్యుని కదలికలను ఉపయోగించి బయోమిమికి ఉదాహరణలు.

అందువల్ల, బయోమిమిక్రీ ఇప్పటికీ అభివృద్ధి చెందుతున్న రంగం మరియు దానిని అభివృద్ధి చేయడానికి కొన్ని ప్రమాణాలు నిర్వహించబడుతున్నాయి, అనగా, ISO 18458 - పరిభాష, భావనలు మరియు పద్ధతి కొరకు మరియు ప్రామాణిక ISO 18459- బయోమిమెటిక్ ఆప్టిమైజేషన్ కొరకు. పాశ్చాత్య దేశాలలో బాగా ప్రాచుర్యం పొందినప్పటికీ, ఈ బిఓమిమిక్రీ రంగం ఇప్పటికీ భారతదేశంలో చిగురించే దశలోనే ఉంది మరియు బయోమిమిక్రి ఇండియా వ్యవస్థాపకుడు మిస్టర్ ప్రశాంత్ ధావన్ వంటివారు చాలా తక్కువ మంది మాత్రమే దీనిని ప్రోత్సహిస్తున్నారు. మన దేశంలో యువత దీని పై దృష్టి సాధిస్తే ప్రకృతిలో ఉన్న ఉపయోగకరమైన పద్ధతలుని అనుకరించి కొత్త కొత్త ఆవిష్కర్ణలు చేసే భారీ అవకాశాలు ఉన్నాయి.

# గురుబ్రహ్మ..

డా॥సుందరరావు, లెక్చరర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, సబ్బవరం

ఈ లోకంలోకి ఎంతో మంది వస్తున్నారు, వెళ్లిపోతున్నారు. కానీ, కొందరు మాత్రమే కారణ జన్ములు. వారు భౌతికంగా ఇక్కడ లేకున్నా.. మన మనసుల్లో ఎప్పుడూ నిలిచే ఉంటారు. అలాంటి మహామహుల్లో ఉత్తములు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్.

ఆయన కూడా అందరిలా జన్మించినా.. స్వశక్తితో అసాధారణ ప్రజ్ఞ పాటవాలతో ఉన్నత శిఖరాలకు ఎదిగి పలువురికి మార్గదర్శకంగా, తన వృత్తి ధర్మానికి మకుటంగా వెలిగారు.

భారతదేశ తొలి ఉపరాష్ట్రపతి ఉపాధ్యాయవృత్తికే

ఆదర్శంగా నిలిచిన ఆచార్యులు సర్వేపల్లి రాధాకృష్ణన్. ఆయన తెలుగు వారు కావడం మనందరికీ గర్వకారణం.

ఆయన పుట్టిన రోజైన సెప్టెంబర్ 5న ఉపాధ్యాయ దినోత్సవం జరుపుకొంటున్నాం.

ఆయన నాలుగు దశాబ్దాల పాటు ఉపాధ్యా వృత్తిలో ఉండి విద్యార్థుల మధ్యనే గడిపారు.

అధ్యాపకుడిగా, వైస్ ఛాన్సలర్‌గా, దౌత్యవేత్తగా, ఉపరాష్ట్రపతిగా, రాష్ట్రపతిగా ఆయన సేవలు నిరుపమానం, అనితరసాధ్యం.

సర్వేపల్లి రాధాకృష్ణన్ 1888 సెప్టెంబర్ 5న తిరుత్తణిలో జన్మించారు. ఇది తిరుపతి సమీపంలో ఉంది. ఆయన తల్లిదండ్రులు సర్వేపల్లి వీరస్వామి, సీతమ్మ.

ప్రాథమిక విద్య తిరుత్తణిలో పూర్తి చేసిన రాధాకృష్ణన్.. తిరుపతి, నెల్లూరులో తదనంతర విద్యాభ్యాసం సాగించారు. మద్రాసు క్రిస్టియన్ కాలేజీ నుంచి ఎంఏ పట్టా పొందారు.

1906లో తన 18 వ ఏట సర్వేపల్లి రాధాకృష్ణన్‌కు శివకామేశ్వరితో వివాహం జరిగింది. వీరికి ఐదుగురు

కుమార్తెలు, ఒక కుమారుడు. 1956 లో ఆయనకు భార్యా వియోగం కలిగింది.

రాధాకృష్ణన్ బాల్యం నుంచే అసాధారణమైన తెలివితేటలు కనబరిచేవారు. ఆయన తెలివితేటలకు ఉపాధ్యాయులు ముగ్ధులయ్యేవారు.

21 ఏళ్ల వయస్సులోనే మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో అధ్యాపకుడిగా పనిచేశారు. తత్వశాస్త్రంలో ఆయన ప్రతిభను గుర్తించిన మైసూరు విశ్వవిద్యాలయం ఆయన్ని ప్రొఫెసర్‌గా ఆహ్వానించింది. ఆయన ఉపన్యాసాలు విద్యార్థులనెంతో ఆకట్టుకునేవి.

సర్వేపల్లి ప్రతిభ గుర్తించిన డాక్టర్ అశుతోష్ ముఖర్జీ, రవీంద్రనాథ టాగూర్.. కలకత్తా విశ్వవిద్యాలయ ఆచార్య పదవి చేపట్టమని ఆయన్ని కోరారు.

**ఇక్కడే ఆయన కీర్తి దశదిశలా వ్యాపించింది.**

కలకత్తా విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా ఉన్న సమయంలో సర్వేపల్లి 'భారతీయ తత్వశాస్త్రం' అనే గ్రంథం రాశారు. ఆ గ్రంథం విదేశీ పండితుల ప్రశంసలు అందుకుంది.

'మీరు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం నుంచి డిగ్రీ తీసుకుని ఉంటే మీకు ఇంకా మరింత గొప్ప పేరు వచ్చేది' అని ఒక మిత్రుడు

అనగా.. సర్వేపల్లి 'నేను ఆక్స్‌ఫర్డ్ వెళ్తే.. అధ్యాపకుడిగా మాత్రమే వెళ్తా. విద్యార్థిగా మాత్రం కాదు' అన్నారట. సర్వేపల్లి దేశభక్తి, స్వదేశీ విద్యాలయాలపట్ల గౌరవం, ఆత్మాభిమానానికి ఈ ఘటనను మచ్చుతునకగా పేర్కొంటారు.

ఆ తర్వాత ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం ఆహ్వానం మేరకు సర్వేపల్లి ప్రాచ్య తత్వశాస్త్రంపై ఉపన్యాసాలిచ్చేందుకు అక్కడికి వెళ్లారు. ఇంగ్లండ్, ఫ్రాన్స్, అమెరికా లాంటి విదేశాల్లో ఉపన్యాసాలు ఇచ్చి మాతృదేశ కీర్తిని పెంచిన ఘనత కూడా ఆయనదే.

1931లో రాధాకృష్ణన్ ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలరుగా పనిచేశారు. 1931లోనే రాధాకృష్ణన్ 'లీగ్ ఆఫ్ నేషన్స్ ఇంటలెక్చ్యుయల్ కో-ఆపరేషన్ కమిటీ' సభ్యులుగా ఎన్నికయ్యారు. 1936లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో ప్రాచ్యమతాల గౌరవాధ్యాపకులుగా పనిచేశారు.

1947 ఆగస్టు 14, 15 తేదీ మధ్య రాత్రి 'స్వాతంత్ర్యోదయం' సందర్భాన శ్రీ రాధాకృష్ణన్ చేసిన ప్రసంగం భారతీయులను ఎంతో ఉత్తేజపరిచింది.



డాక్టర్ రాధాకృష్ణన్ 1952-62 వరకు భారత ఉపరాష్ట్రపతిగా పనిచేశారు. భారత్‌కు ఆయనే తొలి ఉపరాష్ట్రపతి.

ముఖ్యమైన ఉపనిషత్తులు, ఈస్ట్ అండ్ వెస్ట్ సమ్-రిఫ్లెక్షన్, రికవరీ ఆఫ్ ఫేత్, ఎ సోర్స్ బుక్ ఇన్ ఇండియన్ ఫిలాసఫి, కాన్సెప్ట్ ఆఫ్ లైఫ్ లాంటి అనేక గొప్ప గ్రంథాలు సర్వేపల్లి రచించారు.

1962లో బాబూ రాజేంద్రప్రసాద్ తర్వాత సర్వేపల్లి రాష్ట్రపతిగా ఎన్నికయ్యారు. అసమాన వాగ్ధాటితో, ప్రాచ్యపాశ్చాత్య తత్వశాస్త్రాలపై ఆయన ఎన్నో ఉపన్యాసాలు చేశారు. ఆయన ఛలోక్తులు, హాస్యం అందరినీ కట్టి పడేసేవి.

ప్రపంచంలోని అనేక విశ్వవిద్యాలయాలు సర్వేపల్లిని గౌరవ డాక్టరేట్లతో సత్కరించాయి. 1954లో భారత ప్రభుత్వం 'భారతరత్న'తో సత్కరించింది.

1967లో రాష్ట్రపతి పదవీ విరమణ చేసిన తర్వాత డాక్టర్ సర్వేపల్లి మద్రాసులోని తన సొంత ఇంటికి వెళ్లిపోయారు. చివరి రోజుల్లో తాత్విక చింతన చేస్తూ గడిపారు. 1975 ఏప్రిల్ 17న ఆయన తుదిశ్వాస విడిచారు.

**సర్వేపల్లి ప్రత్యేకతలు..**

రాధాకృష్ణన్ అద్వైత వేదాంతి. శంకరుల మాయావాదాన్ని యథాతథంగా స్వీకరించలేదు. తన సొంత భాష్యం రాశారు.

సర్వేపల్లి గొప్ప మానవతావాది. ప్రతి మానవుడూ అతడి మతమేదైనా, సాంఘిక స్థితిగతులేమైనా పరమేశ్వరుడి రూపంలో పుట్టినవాడే అనేవారు.

సర్వేపల్లి దృష్టిలో మతం అంటే - శక్తి, సంపదల కోసం కాకుండా.. శాంతి కోసం, సత్యం కోసం నిత్యాన్వేషణ.

ప్రస్థాన త్రయానికి ఆంగ్లంలో ఆధునిక దృష్టితో భాష్యం రాశారు సర్వేపల్లి. సోక్రటీస్ మొదలుకొని పాశ్చాత్య దార్శనికవేత్తల వరకు అందరి రచనలూ ఆయనకు కంఠోపాఠమే.

భగవద్గీతను చదివినంత శ్రద్ధాసక్తులతో బైబిల్ చదివారు సర్వేపల్లి. ఖురాన్ ఆయనకు కొట్టిన పిండి. సూఫీ తత్వాన్నీ మధించారు.

సర్వమతాలవారూ ఇతర మతాల పట్ల విశాలమైన, ఉదారమైన దృక్పథాన్ని అవలంబించాలని సర్వేపల్లి ప్రబోధించారు. ఎవరైనా ఇతర మతాలను, సంస్కృతులను విమర్శించడాన్ని ఆయన అంగీకరించేవారు కారు.

సమాజంలో పండితులేగాని నిజమైన తత్వవేత్తలు కనిపించడం లేదని, సృజనాత్మకత కొరవడిందని సర్వేపల్లి ఆవేదన వ్యక్తం చేసేవారు. వారసత్వ సంపద ఎవరినీ మానసిక దాస్యానికి గురిచేయకూడదనేవారు

తత్వవేత్తలుగా ప్రసిద్ధి చెందినవారెవరూ రాధాకృష్ణన్ పనిచేసినన్ని రంగాల్లో ప్రవేశించి ఉండరు. ఆయన పాలనాదక్షుడు, రాజనీతిజ్ఞుడు. అన్నింటినీ మించి.. ప్రాచ్య పాశ్చాత్య దేశాల్లో భారతీయ సంస్కృతికి ప్రతినిధిగా వ్యవహరించగలిగిన ప్రజ్ఞాధురీణుడు.

తత్వశాస్త్రాన్ని వర్తమాన పరిస్థితులకు అన్వయించడమే కాకుండా ప్రపంచమంతటికీ వర్తింపజేసిన మేటి రాధాకృష్ణన్. ఆయన పర్యటించని ప్రదేశం లేదు. ఆయనను గౌరవించని స్థలం లేదు.

# తెలుగు దళిత సాహిత్యం - చారిత్రక నేపథ్యం

తెలుగులో దళిత సాహిత్యం రావడం వెనుక అనేక ఉద్యమాల పరిణామం, ఇతరభాషల సాహిత్య ప్రభావం ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ఎంతగానో ఉంది. భారతదేశ స్వాతంత్ర్యానికి ముందూ, తర్వాత గ్రవర్ణభూస్వాములకు భయపడుతూ అస్పృశ్యులుగా తమ బతుకులీడిస్తూ అవమానాలు, ఆకలికేకలతో ఆత్మగౌరవం కోసం దళితులు చేసిన జీవనపోరాటాల నేపథ్యమంతా దళితసాహిత్య ఆవిర్భావ చరిత్రతో ముడిపడి ఉంది. దళిత ఉద్యమాన్ని బ్రిటీష్ పాలనకు ముందు, దళితులు క్రైస్తవులుగా మారినతర్వాతగా కూడా చూడవలసిన అవసరం ఉంది. అప్పుడు మాత్రమే దళిత సాహిత్యంలో వచ్చిన వివిధ దశలను అవగాహన చేసుకోగలుగుతాం. అంబేద్కర్ సాధించిన హక్కుల్ని అనుభవిస్తున్న కాలంమంతా ఒకరకంగాను, తర్వాత బహుజన సమాజ్‌పార్టీ ఆవిర్భావానంతరం వచ్చిన దళిత సాహిత్యం తీరు మరొకరకంగాను మారింది. ఇవన్నీ వివిధ దశలుగా కనిపిస్తుంది. ఈ వివిధ దశల్లో వచ్చిన తెలుగు దళితసాహిత్యం ఒక ధోరణిగా,వాదంగా, ఉద్యమంగా స్థిరపడటంలో ఇతరభాషానువాదాలు కూడా ఎంతగానో ఉపయోగపడ్డాయి.

చాతుర్వర్ణం, ధర్మం పేరుతో సాగిన అమానవీయ చర్యల్ని బుద్ధుని కాలం నుండే వ్యతిరేకించడంతోనే నిజానికి దళితసాహిత్య ఆవిర్భావం జరిగిందనేవాళ్ళున్నారు. (కలేకూరి ప్రసాద్, దళితసాహిత్యం, 2000:3) అంతకు ముందున్న లోకాయత, చార్వాకులు ఆనాటి వ్యవస్థపై నిరంతరం సంఘర్షణ పడ్డారు. తర్వాత కాలంలో భక్తకవులు వర్ణధర్మంలోని లోపాల్ని సరిదిద్దేప్రయత్నంతో ముందుకొచ్చారు. రామానుజుడు, స్వామి రామానంద, శ్రీచైతన్య, నానక్, కబీర్, మీరాబాయి, గురునానక్ మొదలైనవాళ్ళు వీరిలో పేర్కొనదగినవాళ్ళు. ఇదే చైతన్యం దక్షిణభారతదేశంలోను కనిపించింది. బసవేశ్వరుడు, వేమన, అన్నమయ్య, పోతులూరివీరబ్రహ్మేంద్రస్వామి మొదలైనవాళ్ళు భావవాదదృక్పథంతోనే అయినప్పటికీ భగవంతుని దృష్టిలో మానవులంతా సమానమనే బోధనల్ని చేశారు. తమిళులకు వేదంగా భావించే తివళ్ళువర్ రాసిన “తిరుక్కురళ్”లో మానవులంతా సమానమనేదృష్టికనిపిస్తుందని సాహితీవేత్తలు భావిస్తున్నారు. (కలేకూరి ప్రసాద్, దళితసాహిత్యం, 2000:4)



ఆచార్య **దార్ల వెంకటేశ్వరరావు,**
ప్రొఫెసర్, తెలుగు శాఖ,
సెంట్రల్ యూనిర్సిటి,
హైదరాబాద్,
ఫోను: 9182685231

తెలుగులో పాల్కురికి సోమనాథుడు, వేమన, పోతులూరివీరబ్రహ్మం మొదలైనవాళ్ళంతా భక్తిద్వారా మానవులంతా సమానమంటూనే, భావవాద ధోరణిలోనే పయనించారు. ఇదే పద్ధతిలో తల్లాప్రగడ సూర్యనారాయణ 1913లో “హేలావతి” నవల రాశారు. దీనిలో ముస్లిం మతంలోకి మారిన దళితుల్ని వర్ణించడం జరిగింది. అప్పటికి గాంధీజీ “హరిజనోద్ధరణ” ఉద్యమాన్ని మొదలు పెట్టలేదు. కానీ, అప్పటికే భక్తకవులు, సాంస్కృతిక పునరుజ్జీవనం, స్వాతంత్ర్యోద్యమ ప్రభావం వల్ల ఆ రచనతో పాటు అటువంటి రచనలు భారతదేశమంతటా అనేకం వచ్చాయి. ముల్కరాజ్ ఆనంద్ రాసిన “అన్‌టచ్‌బుల్” నవలను కూడా ఈ దృష్టితోనే చూడాల్సి ఉంది. క్రైస్తవమతాంతీకరణను అడ్డుకొనే నేపథ్యమే1919లో వెంకటపార్వతీశం కవులు రాసిన ‘మాతృమందిరం’ నవలలోను, ఉన్నవలక్ష్మీనారాయణ “మాలపల్లి” (1922)లోనూ ఉంది. 1936లో ఆచార్య ఎన్.జి.రంగా రాసిన “హరిజననాయకుడు” సంస్కరణోద్యమ ప్రభావం కనిపిస్తుంది. ఆ తర్వాత వచ్చిన నవలలు, కథల్లో మాత్రమే కాకుండా గేయాల్లో కూడా ఇటువంటి ప్రభావమే వ్యక్తమైంది. చివరికి గుర్రం జాషువాగబ్బిలం (1942), మిగతా రచనలన్నింటిలో కూడా సంస్కరణోద్యమ ప్రభావంతో సంఘర్షణ పడుతూనే, అంబేద్కర్ భావజాలాన్ని సమర్థించేస్థితికి చేరుకున్నారు. ఆ తర్వాత వచ్చిన దళితేతర కవుల్లో దళితుల పట్ల సానుభూతితో రచనలు చేయడానికి సంస్కరణోద్యమం, ఆ తర్వాత అభ్యుదయ, విప్లవ భావజాలాల్తో కొంతమంది రాసినా, అవన్నీ కులనిర్మూలనకంటే, దళితుల వేదనల్ని సానుభూతితో వ్యక్తీకరించిన రచనలుగా చెప్పుకోవచ్చు. అందుకనే దళిత సాహితీవేత్తలు తెలుగు దళిత ఉద్యమాల్ని, తెలుగు దళిత సాహిత్య ఆవిర్భావాల్ని ప్రత్యేకంగా గుర్తించవలసిందని పేర్కొంటున్నారు.

“ తెలుగులో దళితసాహిత్యం ఒక ఏకీకృత మార్గంలో పయనించకుండా, బహుముఖాలుగా విస్తరిస్తున్నది. గాంధేయ సిద్ధాంతాలతో అస్పృశ్యతా సమస్యకు పరిష్కారం సూచిస్తున్నది. ఉదారవాద హరిజనవాదం, జ్యోతీరావు పూలే, అంబేద్కరిజం వెలుగులో దళితల సమస్యకు పరిష్కారం నిర్దేశిస్తున్నది మౌలిక దళితవాదం. మార్క్సిజం-లెనినిజమే వర్ణ, వర్గ రహిత సమాజాన్ని నిర్మిస్తుందని విశ్వసిస్తున్నది సామ్యవాద దళితవాదం. మార్క్సిజంలోని మౌలికాంశాలు- అంబేద్కరిజంలోని అనుకూలాంశాల సమన్వయమే సరైన పరిష్కారమంటున్నది సమన్వయవాద దళితవాదం. ఒక నిర్దిష్టమైన ప్రాపంచిక దృక్పథమంటూ లేకుండా, దళితేతరులందర్నీ తిట్టడం, నలుగురి దృష్టిని ఆకర్శించమనే లక్ష్యాన్ని కలిగి ఉన్నది సంచలన దళితవాదం. ఈ అన్ని వాదాల ప్రతిస్పందనగా నేడు దళిత సాహిత్యం వెలువడుతున్నది” (దళితవాదవివాదాలు, ముందుమాట, 2000:8) అని భిన్నకోణాల్లో ఎస్వీసత్యనారాయణ దళితసాహిత్యస్థితిగతుల్ని విశ్లేషించారు.

కలేకూరి ప్రసాద్ రాసిన “దళితసాహిత్యం” పుస్తకాన్ని ప్రచురించిన బి.యం.లీలాకుమారి ఆ పుస్తకానికి రాసిన ‘వెనుకమాట’ల్లో “దళిత సిద్ధాంతకర్త డా౹౹బి.ఆర్.అంబేద్కర్ చేసిన రాజీలేని పోరాట ఫలితంగా 1960 సంవత్సర కాలంలో ఆధునిక దళిత సాహిత్యోద్యమం ప్రభవించింది. 1985లో ఆంధ్రదేశంలో కారంచేడు దళిత మృతవీరుల రక్తజ్వాలనాల నుండి ప్రభవించిన ‘ ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ’ నడిపిన పోరాట స్ఫూర్తితో మమేకమై ఆ ఉద్యమ వెలుగులో తెలుగు దళిత సాహిత్యోద్యమం బలంగా విస్తరించింది” ( 2000:21) అనే అభిప్రాయంలో స్పష్టంగా దళితసాహిత్య పరిణామక్రమం కనిపిస్తుంది. దీనివల్ల తెలుగు దళిత సాహిత్యోద్యమానికి ప్రత్యక్షంగా మరాఠీసాహిత్య ప్రభావం కంటే, అంబేద్కర్ ప్రభావం ఉందని మాత్రంతెలుస్తుంది. ఆ ప్రభావం సాహిత్యం వల్లనే కలిగిందని చెప్పుకోవచ్చు.

దళిత ఉద్యమకారుడు, సాహితీవేత్త కత్తి పద్మారావు తన పరిశోధన, విమర్శల్లో ఫూలే, అంబేద్కర్ భావాల్ని ఉదాహరిస్తూ రాస్తుంటారు. "దళిత సాహిత్యం- జాషువ" (మొదటి ముద్రణ :2001, మూడవ ముద్రణ : 2008)లో ఫూలే, అంబేద్కర్ భావాల్ని ఆధారంగా చేసుకొని దళితతాత్త్విక భూమికను వివరించి, తెలుగులో దళితసాహిత్యం మరాఠీసాహిత్యం కంటే ఒక దశాబ్దం తర్వాతనే వచ్చినా, ఇది తెలుగు నేలపై దళితులపై జరిగిన దాడుల ఫలితంగా వచ్చిందన్నారు.

" దళితయువకుల్లో నుండి వస్తున్న చైతన్యంపై జరిగిన దాడులే కారంచేడు, చుండూరు. ఈ రెండు పోరాటాల్లో వచ్చిన సాహిత్యం తెలుగునేలలో, దళితసాహిత్యోద్యమాన్ని సజీవం చేశాయి. మహారాష్ట్రలో ఒక దశాబ్దం ముందే ఈ పరిణామం వచ్చింది" (" దళితసాహిత్యం- జాషువ": 2008:78) అయితే, దళితసాహిత్యాన్ని శాస్త్రీయంగా విశ్లేషించిన సాహితీవేత్తల్లో ఒకరైన జి.లక్ష్మీనరసయ్య అభిప్రాయంలో 1985 తర్వాత రాసిన దళితకవులకి మరాఠీ, కన్నడ, తమిళ దళితసాహిత్యం పరిచయం కావడంతో తెలుగు దళితకవుల పని మరింత సులువైందంటూనే, తెలుగు దళిత కవులు, సాహితీ వేత్తలు వీరందరికంటే నాలుగడుగులు ముందులోనే ఉన్నారని "దళితసాహిత్యం-తాత్త్వికదృక్పథం (1999: 13)లో పేర్కొన్నారు. తెలుగు దళితసాహిత్యంపై ఇతరభాషల ప్రభావం ఉన్నా, స్వీయ అస్తిత్వంతో నిలబడగలిగిందని పై వివరణల వల్ల స్పష్టమవుతుంది.అయినప్పటికీ కవిత్వం, కథలు, నవలలు, మినీకవిత్వం, విమర్శ, నాటకాలు, గజల్స్ మొదలైన ప్రక్రియల్లో తెలుగులో దళితసాహిత్యం విస్తరిల్లింది. ఇలా విస్తృతంగా వచ్చిన తెలుగు దళిత ఉద్యమానికీ, తెలుగు దళితసాహిత్యానికి తాత్త్వికభూమికను సిద్ధం చేయడంలో, దళితుల్ని చైతన్యం చేయడంలో తెలుగులోకి వచ్చిన అనువాదరచనల ప్రభావం కూడా తీవ్రంగానే ఉంది. వీటిలో ముఖ్యమైన రచనలు అంబేద్కర్, జోతీరావు బా ఫూలే, రామస్వామి నాయకర్ తదితరుల జీవితం, వారి భావజాలానికి సంబంధించిన రచనలు పేర్కొనదగినవి.

తెలుగు దళితసాహిత్యం ఒక ధోరణిగా, వాదంగా, ఉద్యమంగా స్థిరపడటంలో ఇతరభాషానువాదాలు చాలా ఉపయోగపడ్డాయి. 'హిందూ సామ్రాజ్యవాదానికి ప్రత్యామ్నాయంగా దళితరాజ్యావిర్భావాన్ని ఆకాంక్షించిన' వారిగా హిందీదళితకవుల్ని అభివర్ణిస్తూ, 'తెలుగులో శక్తివంతమైన దళితకవిత్వం వస్తున్న మాట నిజమైనప్పటికీ, దృక్పథంలోను, సిద్ధాంతంలోను, తాత్త్విక పునాదిలోను మరింత పదును తేరడానికీ, అన్ని భాషల్లో ఒకేస్వరం, ఒకే కేక, ఒకే వేదన, ఒకే ధిక్కారం, ఒకే పోరాట జ్వలనం. ఈ ఏకసూత్రతను సాధించడానికీ హిందీకవిత్వం తెలుగు వారికి స్ఫూర్తినందిస్తుంద'నే కత్తిపద్మారావు(1953) వ్యాఖ్య ఇతర భాషల నుండి దళితసాహిత్యానువాదాలు జరగవలసిన అవసరాన్ని తెలుపుతుంది.

తెలుగులోకి వచ్చిన దళిత రచనల అనువాదాల్ని పరిశీలిస్తే అంబేద్కర్, ఫూలే రచనల పూర్తి సంపుటాల్ని, ఆ సంపుటాల్లోని భాగాల్ని విడివిడిగా అనువదించి ప్రచురించడం జరుగుతోంది. ఈ అనువాదం జరుగుతున్న తీరుతెన్నుల్ని పరిశీలిస్తే ఇది ప్రధానంగా రెండు మార్గాల్లో పయనించింది. ఒకటి దళితతాత్త్వికుల భావజాల వ్యాప్తికోసం, వారి రచనలు, ప్రసంగాలు, జీవిత చరిత్రలు అనువదిస్తున్నారు.దీన్ని సృజనేతర దళిత అనువాద సాహిత్యం అనొచ్చు. రెండోది వివిధభాషల్లో కవిత్వం,కథలు,ఆత్మకథలు, నవలలు మొదలైనవాటిని అనువదిస్తున్నారు.దీన్ని సృజనాత్మక దళిత అనువాద సాహిత్యం అని పిలవవచ్చు.ఇది తెలుగుసాహిత్యస్థితిగతుల్ని అవగతం చేసుకోవడానికి ఉపయోగపడుతుంది. రెండింటినీ కలిపి చెప్పినప్పుడు దళిత అనువాద సాహిత్యం లేదా అనువాద దళిత సాహిత్యం అని వ్యవహరించవచ్చు. పత్రికల్లో వస్తున్న దళితుల అనుభవాలు, దళితుల్ని ప్రభావితం చేసే ప్రసంగాల అనువాదాలు, సైద్ధాంతిక భావజాలం గల వచన రచనలను 'సృజనేతర దళిత అనువాద సాహిత్యం' అని పిలుస్తున్నాను.వీటిలో కింది వాటిని ముఖ్యమైనవిగా గుర్తించవచ్చు.

**డా॥బి.ఆర్.అంబేద్కర్ రచనలు:**

భారతదేశంలో కులనిర్మూలన జరిగినప్పుడే దళితులు కూడా సాంఘికంగాను, ఆర్థికంగాను, సాంస్కృతికంగాను అభివృద్ధి సాధించగలుగుతారని శాస్త్రీయంగా ప్రబోధించిన వారిలో "మహాత్మా" జోతీరావుఫూలే, డా॥.బి.ఆర్. అంబేద్కర్, 'పెరియార్' ఇ.వి.రామస్వామినాయకర్ మొదలైన వాళ్ళు ముఖ్యులు. వీరి ఉపన్యాసాలను, రచనలను అనేకమంది రచయితలు తెలుగులోకి అనువదించడంతో పాటు, సృజనసాహిత్యంగా కూడా వెలువరించారు.

డా॥.బి.ఆర్.అంబేద్కర్ రచనలను మహారాష్ట్ర ప్రభుత్వం 1979లో ఆంగ్లంలో ప్రచురించింది. వీటి ఆధారంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆధ్వర్యంలో బజ్జాతారకం, డా॥.బి.విజయభారతి సంపాదకత్వంలో "డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ రచనలు-ప్రసంగాలు" పేరుతో తెలుగు అనువాదాల్ని చేయించారు. మొదటి సంపుటి 1993 నాటికి వచ్చింది. డా॥బోయి భీమన్న, పి.బాలకృష్ణ, మొక్కపాటి సుమతి, జె.అమ్ములయ్య, పొత్తూరి వెంకటేశ్వరరావు, ఎం.ఎస్.బాబూరావు, కె.రాహుల్, సురమౌళి, పి.అంబేద్కర్‌లు మొదటి సంపుటిని అనువదించారు. మొత్తం పదకొండు సంపుటాలుగా తీసుకొచ్చారు. ఒక్కొక్కసంపుటిలో అనేకమంది రచయితలు అనువాదాలు ఉన్నాయి.

తెలుగు విశ్వవిద్యాలయం వారి అనువాదాలు రాకముందే అంబేద్కర్ రచనల్ని చాలా మంది చిన్న చిన్న పుస్తకాలుగా అనువదించి తెలుగు వారికి అందించారు. వీటిలో యెండ్లూరి చిన్నయ్య అనువదించిన " డా॥అంబేద్కర్ జీవిత చరిత్ర" తెలుగువాళ్ళని ఎంతగానో చైతన్యవంతం చేసింది.1968లో దీని ప్రథమముద్రణను చేసినా, తర్వాత అనేక ముద్రణలు చేశారు. అంబేద్కర్ రచనలపై ఇదొక పరిశోధన గ్రంథంలా రాస్తూనే, ఆయన ఉపన్యాసాల్ని, రచనల్ని, జీవితఘట్టాల్ని సులభమైన శైలిలో వివరించారు. 'అంబేద్కర్ జీవిత విశేషాలపై ఇంతవరకూ ఒక్క గ్రంథమైనా వెలువడలేదనీ, ఇదే తొలి ప్రయత్నమనీ" (తొలిపలుకు) రచయిత యెండ్లూరి తెలిపారు. ఈ గ్రంథంలో ఇరవై ప్రకరణలు (అధ్యాయాలు) ఉన్నాయి. రెండవ ప్రకరణంలో అంబేద్కర్ జననం, బాల్యం, విద్యార్థిజీవితం మొదలైన ఘట్టాలు ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉన్నాయి. బోయిభీమన్న రాసిన " కులనిర్మూలన" పేరుతో 1969లో అంబేద్కర్ భావాల్ని అనువదించారు.



# శేషేంద్రజాలం

- కొడుకుల శ్రీనివాస్, సీనియర్ జర్నలిస్ట్

ప్రఖ్యాత కవి పండితులు డాక్టర్ గుంటూరు శేషేంద్ర శర్మ పేరు తెలియని తెలుగువారు ఉండరు .

నోబెల్ సాహిత్య బహుమతికి నూటికి నూరుపాళ్లు అర్హత గల వ్యక్తి శేషేంద్ర శర్మ.

ఆయన కవిత్వాన్ని మనం అవలోకించడం అంటే మానవ జీవితం తాలూకు అన్ని పార్శ్వాలను అనుభూతులను ఆస్వాదించడమే . మనోనేత్రంతో సామాజిక వీక్షణ చేయడమే.

శేషేంద్ర కవిత్వ ఇంద్రజాలంలో చిక్కుబడని పాఠకుడు ఉండడు .

ఆధునిక కవి కాళిదాసు గా శేషేంద్ర శర్మను సంభావన చేయవచ్చు.

**శేషేంద్ర కవితా జాలం :.**

"వేళ్లు కాళ్లయి నడిచే చెట్టు మనిషి. చెట్టు గా ఉంటే ఏడాదికి ఒక వసంతమన్నా దక్కేది. మనిషినై అన్ని వసంతాలను కోల్పోయాను" అంటూ నిర్వేదాన్ని వ్యక్తం చేసారు శేషేంద్ర శర్మ.

సమాజంలోని దోపిడీ శక్తులపై శేషేంద్ర కవితాస్త్రాలను సంధించారు.

" ఈ చెట్లు పూలెందుకు పూస్తాయి?

ఈ నికృష్టపు నాగరికత విడిచే బొగ్గుపులుసు వాయువు పీలుస్తూ ..

ఇవి బుల్లెట్లెందుకు పూయవు అని కేక వేస్తా "

అని శేషేంద్ర పేర్కొన్నారు.

"బాబూ ! నీ చిన్ని కన్నీటి బిందువులో ఏ సముద్రం గర్జిస్తుందో నాకు తెలుసు. అందుకే నేను చెట్లతో మొర పెట్టుకుంటున్నాను

ఆకులు కాదు తుపాకులు కాయండి"

అంటూ శేషేంద్ర శర్మ తనలోని విప్లవ భావాలను ఆవిష్కరించారు.

"ఇక్కడ గర్భంలో శిశువు గర్భం లోనే ఉండి పోవాలి

ఈ దేశం లోకి వచ్చి ఆకలి అని ఏడిస్తే ఫుట్పాత్‌లు చూపిస్తారు "

అంటూ నేటి సమాజ దౌర్భాగ్యాన్ని కళ్ల ముందుంచారు శేషేంద్రశర్మ.

"అరే! నా దేశంలోనే నా గొంతు పరాయి దయిపోయింది. ఇక్కడ నేను అరచిన అరుపు ఆకాశంలోకి వెళ్లి ఎక్కడో ఇరుక్కు పోతుంది తిరిగి రాదు. అరే! ఈ గుంపుకు ఎలా మేల్కోవాలో తెలియదు. ఎలా బాహువులు జాపి తన ఇనుప కాళ్లు ఇలాతలంపై మోపాలో తెలియదు " అంటూ ఆత్మవిశ్వాసం లోపించిన భరత జాతి గురించి.. మానవ జాతి గురించి శేషేంద్రశర్మ తెలియ చెప్పారు.

బాలల..యువత భవితవ్యం గురించి శేషేంద్ర ఆవేదన చెందారు.

" నీవు కాలేజీకి పోతుంటే బాబూ! నిన్ను పొలాలు బిక్క మొగంతో చూస్తున్నాయి.

నీవు కాలేజీ గోడల్లోకి.. అక్కడి నుండి గవర్నమెంట్ గోడల్లోకి.. ఎప్పుడు ఎవరు తిరిగి రాని గోడల్లోకి పోతావు.. ఇక నీవు బ్రతికింది ఎప్పుడు!! మీ నాన్నల తరం అదే చేసింది.. మీకు ఆ ప్రశ్న వారసత్వంగా ఇచ్చి పోయింది..

మీరు పలకా పుస్తకాలు పట్టుకొని పోతుంటే బాబూ! మీరు శిలువలు మోసుకుపోతున్న బాల క్రిస్తువుల్లా కనిపిస్తారు నా కళ్లకు " అంటూ ఆలోచనా విధానం లోపించిన నేటి కాలపు మూస చదువుల గురించి..డొల్ల విద్యా విధానం గురించి శేషేంద్ర శర్మ వెల్లడి చేశారు.

అంతటితో ఊరుకోకుండా బాలలలో.. యువతలో కొత్త ఆలోచనలను రేకెత్తించేందుకు..వారిలో ఆత్మ విశ్వాసాన్ని ప్రోది చేసేందుకు ఆయన కృషి చేసారు.

" లే బాబూ! లే ! నీ బాల్యం లోంచి లే!

పుస్తకాలవతల పారేయ్! నాగలి భుజాన వేసుకో! ఈ కులాలు విడిచిపెట్టు. పొలాల్లో కలువు.. గత కాలపు దారులకు కఠినంగా వీడ్కోలు చెప్పు "

అంటూ నేటి కాలపు వ్యర్థమైన చదువులకన్నా వ్యవసాయం ద్వారానే నిజమైన ప్రయోజనం చేకూరుతుందని శేషేంద్రశర్మ చాటిచెప్పారు. కరోనా వల్ల పట్టణాల్లో ఉపాధి కోల్పోయిన ఎందరో విద్యావంతులు నేడు తిరిగి తమ స్వంత ఊళ్లకు చేరుకుని వ్యవసాయ పనులు చేసుకుంటూ ఉపాధిని పొందుతున్నారు. వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేయవద్దంటూ శేషేంద్ర దశాబ్దాల క్రితం చేసిన ప్రబోధం ఆయన ముందు చూపును తెలియ చెబుతుంది.

స్వేచ్ఛను కలిగి ఉండవలసిన అవసరం గురించి శేషేంద్ర శర్మ గొప్ప సందేశాత్మక కవితను అందించారు .

"స్వేచ్ఛ మనిషికి మొదటి శ్వాస. అది నా రక్తపు సజీవ భాష. భూమి నుండి చివరి అడుగు తీసే వరకు నిలుపు కోవలసిన ఒకే ధ్యాస " అంటూ శేషేంద్ర స్వేచ్ఛ ప్రాధాన్యతను వెల్లడించారు.

సామాన్యులు బతకలేక ఏడుస్తుంటే కొంతమంది సుఖాలలో తేలియాడుతూ ఉండడం శేషేంద్ర శర్మ కు ఆగ్రహం తెప్పించింది.

"నవ్వు మొహాన రాసిన వాళ్లని చూస్తే నా చెయ్యి బాంబు కోసం వెతుకుతుంది.. వాళ్లకు నవ్వెంత సుఖం ఎలా దొరికింది? ఎవడికి లంచమిచ్చి కొనుక్కున్నారు? పాపం! అమాయకులు నీతిపరులు ఈ దేశంలో అంత ఖరీదైన నవ్వును కొనుక్కోలేరు" అంటూ దోపిడీ వర్గాల తీరుతెన్నులను శేషేంద్ర వెల్లడి చేసారు.

దేశంలో నానాటికీ పెచ్చు పెరుగుతున్న బానిస మనస్తత్వాల గురించి కూడా శేషేంద్రశర్మ హెచ్చరికగా పలికారు.

"ఈ దేశంలో వంగే వాడికి వంగి సలాం చేసేవాడు పుడుతున్నాడు. జాగ్రత్త !

ఈ లక్షణం తలెత్తిందంటే ఆకాశంలో తోక చుక్క పుట్టిందన్న మాటే !" అంటూ శేషేంద్ర ప్రజలను జాగృతులను చేసేందుకు యత్నించారు.

" మండే సూర్యుడు "అనే కవిత కవిగా

శేషేంద్ర శర్మలోని ఆధునిక దృష్టి కోణాన్ని వెల్లడి చేస్తుంది.

"నేను చెమట బిందువును .. కండల కొండల్లో ఉదయించే లోక బంధువుని..

గుండెలతో నాకు దోస్తీ..

నేనుండేది బాధల బస్తీ... సింధు వంత చరిత్ర పిడికిట్లో ఉన్నా చెప్పకుండా మనిషిని చెక్కిన శిల్పిని " అంటూ తనను తాను కార్మిక శ్రామిక కర్షక వర్గ ప్రతినిధిగా శేషేంద్రశర్మ చాటుకున్నారు.

ఈ దేశంలో ప్రతిభను గుర్తించి ప్రోత్సహించే వారికన్నా అణచి వేయాలని చూసే వారే ఎక్కువ. ప్రతిభకు ఎదురవుతున్న నిరాదరణ గురించి శేషేంద్ర శర్మ మరో కవితలో తెలియజెప్పారు .

"ఈ దేశం నా ప్రతిభకొక సమాధి.. ఎంత వడివడిగా నడిచినా ఎప్పుడూ దూరం అంతే ! ఈ నేల నా రక్తం తాగాలని దప్పి గొన్నది.. ఆముదపు చెట్ల నీడల్లో హాయిగా నిద్రిస్తున్న ఈ దేశానికి సూర్యుడిలో కలం. ముంచి గ్రీష్మ గీతం రాద్దామని తెల్ల కాగితం పుచ్చుకున్నాను" అంటూ సమాజ చైతన్యంలో కవుల బాధ్యతను.. పాత్రను శేషేంద్ర గుర్తు చేసారు.

"కలలు" అనే మరో కవితలో శేషేంద్ర,"రాత్రి నేనూ నా దిండు కలిసి కలలు కంటాం.. పగలు నేనూ, నా కలం వాటిని పంచుకుంటాం.. నా కాళ్లు సంకెళ్లలో ఉన్నా నా కలలు కొండలమీద సంచరిస్తాయి" అంటూ పేర్కొన్నారు.

"పైన చంద్రుడు మబ్బు తునక వేలు పట్టుకొని నడిపించుకు పోతున్నాడు.. బాధల్లో మునుగుతాను.. సంతోషాల్లో ఉదయిస్తాను.. నేను మానవ సూర్యుణ్ణి " అంటూ అందమైన పద చిత్రాలను, భావ చిత్రాలను శేషేంద్రశర్మ తన కవితలో విలిఖించారు. బలవంతుల రాజ్యం గురించి శేషేంద్ర శర్మ మరో కవితలో పేర్కొన్నారు.

"కందరాల కంఠానికి లొంగి ఇక్కడ ఆకాశం సూర్యుడ్ని అమ్ముకుంది గుప్పెడు నక్షత్రాల కోసం" అంటూ వ్యవస్థ దుస్థితిని శేషేంద్ర శర్మ దృశ్యమానం చేసారు.

" గాలి కుక్కలా తిరుగుతోంది వీధుల్లో.. పిల్లి లా మ్యావ్ అంటుంది కిటికీలో.. గాలి కోడెనాగులా బుస కొడుతోంది.. గాలి దెబ్బతిన్న సైనికుడిలా మూలుగుతోంది ఆకు ల్లేని కొమ్మల్లో .. నా చేతిలో పుస్తకం శిశువై నా వక్షస్థలం మీద ఆడుకుంటోంది..వెయ్యి నక్షత్రాలు ఒక్కసారి లక్ష వెల్తురు ఈటెలు విసిరాయి నా మీదకి" అంటూ శేషేంద్ర శర్మ తన కవితా చమత్కారాన్ని ప్రదర్శించారు.

కవి నిరంకుశుడు.. ఆత్మ స్వాతంత్ర్యం కలిగిన వాడు. ఎవరి ఆదేశాలకు తలొగ్గే స్వభావం నిజమైన కవి లో కనిపించదు .

ఈ విషయాన్ని శేషేంద్రశర్మ మరో కవిత ద్వారా స్పష్టం చేశారు .

"సముద్రం ఒకడి కాళ్ల దగ్గర కూర్చుని మొరగదు.. తుఫాను గొంతు చిత్తం అనడం ఎరుగదు... పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు .. నేనింతా ఒక పిడికెడు మట్టే కావచ్చు.. కానీ కలమెత్తితే నాకు ఒక దేశపు జెండాకు న్నంత పొగరుంది" అంటూ కవి స్వాతంత్ర్యాన్ని శేషేంద్రశర్మ గొప్పగా చాటిచెప్పారు .

"నా కవిత్వం కేవలం మనిషికి డిఫెన్స్.. నేను జేబులో కోకిలలు వేసుకు రాలేదు.. పిడికిళ్ల లో బాంబులు బిగించు కు వచ్చాను" అంటూ తన కవిత్వంతో వ్యవస్థను మారుస్తాననే సందేశాన్ని శేషేంద్ర శర్మ ఇచ్చారు. "బాబూ! మనం తుపాకులు ఎదుర్కోగలం.. కానీ నియంతలు ప్రశ్నలు ఎదుర్కో లేరు...", అంటూ ప్రశ్నించ డాన్ని సహించలేని నియంతల మనస్తత్వాలను,తీరుతెన్నులను శేషేంద్ర శర్మ చాటి చెప్పారు.

"ఆకాశం సూర్యుడి దేవాలయం ..లోకం చరాచర వస్తు గ్రంథాలయం.. చెట్లు పూలు పుచ్చుకొని నిల్చోనున్న భక్తుల సమూహం.. నేను ఆలోచనలో మునిగి ఉన్న జలాశయం" అంటూ అందమైన భావజాలాన్ని తన కవితలో ప్రదర్శించారు శేషేంద్ర. సమాజంలో కవుల బాధ్యత గురించి శేషేంద్రశర్మ గొప్ప గా గుర్తు చేసారు.

"మనిషి కన్నీరు తుడవడం నీ వంతు.. శరీరం పోయినా గెలిచేది నీ గొంతు... నీ ఛాతి బందూకుల కార్ఖానా ! నీ కవిత్వం గాయాలకు దవాఖాన... నీ మెడలో వేలాడేది గాయాల దండ .. నీవు మా యుద్ధాలకు నైతిక ఋుండా! " అంటూ శేషేంద్రశర్మ కవి కనిపించని శత్రువులతో పోరాడే యోధుడని, సమాజ గాయాలను మాన్పే శస్త్ర వైద్యుడని విశదం చేసారు.. దేశం కోసం జీవితాలను త్యాగం చేసిన వారికి ఈ వ్యవస్థలో కనీస గౌరవం దక్కక పోవడం శేషేంద్రను కలచి వేసింది.

"ఇది దేశమా లేక కంఠ పాశమా!! అరే ! ఈ మట్టి కోసం బలి అయిపోయిన ఆత్మల సమాధుల మీద గడ్డి కూడా మొలవదు... ఇక్కడ రాజకీయ నాయకుడు ఇరుసుగా తిరుగుతోంది పత్రికల భూగోళం.." అంటూ రాజకీయ నాయకులు దేశాన్ని భ్రష్టు పట్టిస్తున్న తీరుతెన్నులను శేషేంద్ర తెలియ చెప్పారు.

దేశం కోసం ప్రాణాలు బలి పెట్టే వారికి ఈ దేశంలో అంతగా గుర్తింపు లభించదని..రాజకీయ నాయకులకే పత్రికలు ప్రాముఖ్యతను ఇస్తున్నాయనే నిష్ఠుర సత్యాన్ని శేషేంద్ర వెల్లడి చేసారు.

"నది పొలాల వైపు పరుగెత్తింది అన్నార్తుల్ని రక్షిద్దామని. . చెయ్యి రైఫిల్ వైపు పయనించింది ప్రజాద్రోహుల్ని శిక్షిద్దామని " అంటూ శేషేంద్ర శర్మ తన విప్లవ భావాలను ఆవిష్కరించారు శేషేంద్ర శర్మ.

కవిత్వంతో ప్రజలను భయపెట్టే అకవులు,కుకవుల గురించి చెబుతూ శేషేంద్ర అలాంటి వారి జోలికి పోకుండా ఉండడమే హాయని పేర్కొన్నారు.

శేషేంద్ర కవితా జాలాన్ని పలు కవితల్లో చూడవచ్చు.

"నీ కోసం లోకాన్ని మోసుకొచ్చే వార్తాపత్రిక ..రోజూ నీ గుమ్మంలో పూచే లిల్లీ.. టేబుల్ మీద పడుకోనున్న టెలిఫోన్ అప్పుడప్పుడు మ్యావ్

మనే పిల్లి " అంటూ కవితా చమత్కారాన్ని శేషేంద్ర ప్రదర్శించారు.

"నదులు కవులు భూగోళపు రక్తనాళాలు ..నదులు ప్రవహిస్తాయి కవితల్లా.. పశువుల కోసం పక్షుల కోసం మనుషుల కోసం ...నదులు కంటున్న కలలు పొలాల్లో ఫలిస్తాయి...కవులు కంటున్న కలలు మనుషుల్లో ఫలిస్తాయి... నదులు దేశాన్ని సాగుచేస్తే కవులు ప్రజల్ని సాగుచేస్తారు...కవులు మానవ జాతి రక్త కణాల మీద పని చేసే అలంకారాల నదులు" అంటూ నదులు, కవుల ప్రాధాన్యతను శేషేంద్ర శర్మ గొప్పగా తెలియజెప్పారు. ఆదికవి వాల్మీకి కవిత్వంలోని వర్ణనాత్మక ప్రతిభ గురించి శేషేంద్రశర్మ గొప్పగా చాటి చెప్పారు.

"వాల్మీకి పెదవి కదిపితే చాలు చిలుక కొరికితే దానిమ్మ గింజలు రాలినట్లు రాలుతాయి ఉపమలు " అంటూ వాల్మీకి కవిత్వంలోని ఆలంకారిక రామణీయకత గురించి శేషేంద్ర శర్మ సోదాహరణంగా చాటి చెప్పారు.

"నదీమ్ పుష్పోడు ప్రవాహం "నది పువ్వులనే పడవల్ని మోసుకుపోతున్నది. అంటూ శేషేంద్రశర్మ వాల్మీకి వర్ణనాత్మక ప్రతిభను చాటిచెప్పారు. నిజంగా ఈ వర్ణన చదివితే గంభీరంగా మంద్రంగా సాగే నదీ ప్రవాహం..ఆ ప్రవాహంలో పడవల్లా తేలుతూ పోయె రంగు రంగుల పువ్వులు మనో నేత్రానికి సాక్షాత్కరిస్తాయి. కవిత్వం ద్వారా పాఠకులకు విషయాన్ని దృశ్యమానం చేయడంలో వాల్మీకికి సాటి వచ్చేవారు లేరు.

శ్రీరాముడు శీతల జలాలతో ఆచమనం చేసిన విషయాన్ని కవిత్వ సౌందర్యం ఉట్టిపడేలా వాల్మీకి అద్భుతంగా వర్ణించారు. "ఉపా స్ప్రు శత్ సుశీతేన జలేనోత్పల గంధినా". కలువపూల వాసనలు గుబాళించే శీతల జలాలతో రాముడు ఆచమనం చేసాడట! వాల్మీకి చేసిన వర్ణన శ్రీరాముని ముగ్ధమోహన రూపాన్ని పాఠకుల కళ్ల ముందు నిలుపుతుంది.

నీలాకాశం లో చంద్రుడు సాక్షాత్కరించాడు. దీనిలో గొప్పదనం ఏమీ లేదు. కానీ వాల్మీకి వంటి మహాకవుల దృష్టి వేరు.చక్కటి పోలికలు చెప్పడం లో వారు సిద్ధహస్తులు.

'ప్రజ గామ నభ: చంద్ర: హంసో నీల మివోదకం " నీలి జలాల్లోకి హంస ప్రవేశించినట్లు గా చంద్రుడు నీలాకాశంలోకి ప్రవేశించాడు", అనే వాల్మీకి మహర్షి వర్ణన చదివితే పట్టపగలైనా సరే రాత్రి కాలపు నీలాకాశం..అందులో వెండి వెన్నెలలు వెదజల్లే చంద్ర బింబం..నీలి రంగు జలాలలోకి విలాసంగా ప్రవేశించి ఈదు లాడుతున్న రాజ హంస సౌందర్యం తప్పక దృశ్యమానం అవుతాయి. ఇలాంటి మనోహర వర్ణనలు చదివితే నిస్సందేహంగా మన ఆయుష్షు మరికొన్నాళ్లు పెరుగుతుంది. రక్తాన్ని ఉద్రేకించే..మనసును వేడెక్కించే కవిత్వం మనిషిని పక్కదారి...పెడదారులు పట్టేలా చేస్తుందని గ్రహించాలి. సీతాదేవి ఎడమ కన్ను అదరడం గురించి వాల్మీకి చేసిన వర్ణన ఆ మహాకవికి మనం చేతులు జోడించేలా చేస్తుంది.

"ప్రాస్పంద తైకం నయనం సు కేశ్యాః మీనా హతం పద్మ మి వాభితామ్రం "పూచిన తామర కొలనులో ఈదు లా డుతున్న చేపతోక చివరి భాగం తగిలి స్వల్పాతిస్వల్పంగా కంపించిన తామర పువ్వు లా సీతాదేవి ఎడమ కన్ను అదిరిందట. వాల్మీకి రామాయణంలోని ఇలాంటి మనోహర వర్ణనలను గుంటూరు శేషేంద్ర శర్మ తన వ్యాసాలలో విశదం చేసారు. వాల్మీకి పట్ల శేషేంద్రశర్మకు గల అభిమానం... పూజ్య భావం చాలా గొప్పవి.

"వాల్మీకి నదుల్లో గంగానది లాంటివాడు.. అరణ్యాలలో నైమిశారణ్యం లాంటివాడు" అంటూ శేషేంద్రశర్మ శ్లాఘించారు.

మహాకవి కాళిదాసు గురించి శేషేంద్రశర్మ అద్భుతమైన విషయాన్ని చెప్పారు. "వ్యాసుడు ...వాల్మీకి దేశానికి వారసత్వంగా ఇచ్చిపోయిన సాహిత్య సంస్కృతికి కాళిదాసు చివరి కాపలాదారు. కాళిదాసు తరువాత ఆ సంస్కృతి పతనమైంది. అంటూ కాళిదాసు తరువాత నిజమైన కవిత్వం లేదంటూ శేషేంద్ర పేర్కొన్నారు .

"భారతీయ కావ్య సామ్రాజ్యంలో వాల్మీకి వ్యాస కాళిదాసులు సగర దిలీప రఘు చక్రవర్తుల వంటి ఆదిమ చక్రవర్తులు. సగరాదుల రాజ్యాలు పోయినా కావ్య సగరుల సామ్రాజ్యాలు పోలేదు" అంటూ మహాకవుల కవిత్వం ఎలా శాశ్వతంగా నిలుస్తుందో శేషేంద్ర శర్మ వెల్లడి చేసారు.

"కవులు కావ్యాలనే వసంతాల్ని నాటి పోతారు. వాళ్లు నాటిన వసంతాలు వాళ్ల కోసం కాదు. అవి రాలిపోతుంటాయి.. మరలా పూస్తుంటాయి. ఆపరాని ఈ అద్భుత కుసుమ చక్రం మనిషిని లోకపు ఎడారి నుండి రక్షిస్తూ ఉంటుంది. మూర్ఖులకు తెలియని మర్మమిది " అంటూ "కాలరేఖలు",లో శేషేంద్రశర్మ తన నిశ్చితమైన అభిప్రాయాన్ని వ్యక్తం చేసారు.

"కాలరేఖ " రచనకు గాను గుంటూరు శేషేంద్ర శర్మకు కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది.

నేడు కవుల్లో ఉన్న వర్గీకరణను శేషేంద్రశర్మ అంగీకరించలేదు. "పూర్వం కాళిదాసాది కవుల్ని కవులు అన్నారేగాని శృంగార కవులని, కరుణ రస కవులని పిలవలేదు. ఏ దేశంలోనైనా కవులను కవులనే అన్నారు. కానీ తెలుగుగడ్డ మీద మాత్రం స్వప్రయోజన పరులైన మోనోపలి మనస్తత్వ వాదులు ఆత్మరక్షణ కోసం తమకు నచ్చిన వాళ్లను మాత్రమే విప్లవ కవులని పేరు పెట్టారు.ఇది అశాస్త్రీయం " అంటూ శేషేంద్రశర్మ కుండబద్దలు కొట్టారు.

అందుకే కవులంటే.. కవిత్వం అంటే ఎలా ఉండాలో శేషేంద్ర శర్మ " కవిసేన మేనిఫెస్టో" ద్వారా తెలియ చెప్పారు.

అవకాశవాదాన్ని, స్వార్థపర త్వాన్ని శేషేంద్ర శర్మ తీవ్రంగా నిరసించారు. ఆ విధమైన దుర్లక్షణాలు కవులలో ఉండటం సమాజ ఆరోగ్యానికి మంచిది కాదని ఆయన స్పష్టం చేసారు. విశ్వకవి రవీంద్రనాథ్ తరువాత నోబెల్ సాహిత్య పురస్కారానికి పేరు నామినేట్ అయిన ఏకైక భారతీయ కవి డాక్టర్ గుంటూరు శేషేంద్రశర్మ. "ఆధునిక మహాభారతం" శేషేంద్రశర్మ పేరును శాశ్వతం చేసే గొప్ప కావ్యం.

జనవంశం, షోడశి వంటి కావ్యాలు శేషేంద్ర శర్మ రచించి కవిగా తన ప్రతిభా పాటవాలను ఋజువు చేసుకున్నారు.

కవి వేకువ పిట్ట ..తొలకరి పాట . అంధకారంలో గురకలు పెట్టే జాతిని మేల్కొల్పే వైతాళికుడు.

శేషేంద్ర శర్మ నిస్సందేహంగా ప్రజాకవి.. యుగ కవి..నిరంతరం ప్రకాశించే కవితా రవి.

# కరోనాజి పెళ్ళి సందడి.

**– పద్మజ**

అయ్యవార్లంగారు ఏం చేస్తున్నారూ ..అంటే ...చేసిన తప్పులు దిద్దుకుంటున్నారు. అని సామెత. అలాగే ఉంది ప్రస్తుతం అందరి పరిస్థితి. కూరలు కడగటం, పళ్ళు కడగటం, పూలుకడగటం, పనిమనిషిరాక అంట్లు కడగటం, చేతులేమో పదే పదే కడగటం.

ఈ కడగటాలతో విసుగెత్తి ఇంట్లో పలకరించినవాళ్ళనికూడా విసుగుతో కడిగిపారెయ్యటం.

ఈ విధంగా కడుగుళ్ళతో కడగండ్లు పడుతూ జీవుతాన్ని కడవరకూ గడపాల్సొచ్చేలా ఉంది.

మొదటగా రెణ్ణెల్లు అన్నారు. ఆనక ఆర్నెల్లన్నారు. ఇప్పడేమో సహజీవనమంటున్నారు.

ఈ విధంగా చుట్టమైవచ్చి దయ్యమై పట్టుకున్న కోవిడ్ ని కడతేర్చే ఉపాయాలు ఆలోచిస్తుంటే అదేమో, మీవూరుకొచ్చా ...మీ వీధికొచ్చా ...మీ పక్కింటికొచ్చా ..అని భయపెడుతోంది.

శానిటైజరంటే అపర సంజీవినిలా అనిపిస్తోంది. మాస్కుకీ,మందిరానికీ గొడవలుపోయి మాస్కే మన జీవితమైపోయింది.

ఈవిధంగా నానా రగడగానూ గడబిడగానూ తయారైపోయిన జీవితాన్ని నెట్టుకురాలేక కొట్టుకు ఛస్తుంటే ...

తిప్పుకుంటూ వచ్చింది పంకజం, "ఏంటిసంగతులూ ..."అనుకుంటూ. "ఏముందీ ...నిన్నమిగిలిన దోసెపిండీ, మొన్నమిగిలిన ఇడ్లీపిండీ కలిపి,రాత్రిమిగిలిన ఉప్మా ఉండలు ముంచి బోండాలేస్తున్నా "అన్నాను చిరాగ్గా.

కాస్త అయోమయం గా మొహం పెట్టి " తింటానికేనా ???"అనడిగింది. "మరేం చెయ్యమంటావు చెప్పూ ... ఇవ్వడానికి పనిమనిషిలేదు. కంటైన్మెంట్ జోనని మున్సిపాలిటీ చెత్తవాళ్ళు కూడా రోజుమార్చి రోజు వస్తున్నారు " అన్నాను.

"అందుకని చెత్తలో వెయ్యాల్సినవన్నీ పొట్టలో వేస్తే ...ఇంకేమన్నాఉందా ..."అంది. "ఏంచెయ్యమంటావ్ చెప్పు ...కాలేకడుపుకు మండే గంజి అనీ ...బతకాలి గాబట్టి బతికేస్తున్నాం తినాలి గాబట్టి తినేస్తున్నాం ఏదోవొకటి" అన్నాను విరక్తిగా ...

"ఇంకలాభం లేదు ...పీకల్లోతు డిప్రెషన్లో పడిపోయావ్. దీన్లోనించి బైటికిరావాలంటే అర్జెంటుగా అద్భుతమేదో జరగాల్సిందే" అంది పంకజం.

"అద్భుతమా ...! అసలు అలాంటిది ఈ జీవితంలో జరుగుందంటావా ...కరోనా పోతుందన్నది ఎంతనిజమో అద్భుతాలేవో జరుగుతాయన్నది అంతనిజం ..."అన్నాను. దువ్వుకోటానికి కూడా తీరికా, ఆసక్తీ లేక మూడు రోజుల నుండీ ముడిపెట్టుకుని తిరుగుతున్న జుట్టుని సవరించుకుంటూ.

"కళ్యాణానికి రావే కాంతమ్మా అంటే ...కోవిడమ్మా కుదరదు" అంటావేం. మంచిరోజులు రాకపోవా ...మనుషులంతా కలిసిపోరా ..."అని పంకజం ఏదో చెబుతుండగానే సెల్లు మోగింది.

"చూసావా శుభం. గంటమోగింది ఏదో శుభవార్తేమో చూడు " అంది పంకజం.

"అసలు సెల్లు తీయాలంటే గుండెలు ఝల్లు మంటున్నాయి ఏమి వార్త వినాల్సొస్తుందో అని..." అంటూ ఫోన్ చేతిలోకి తీసుకున్నాను.

మా చెల్లి ...అంటే నాకు పినపిన్నికూతురు. ఊళ్ళో ఉంటున్నా నాలుగు నెల్లుగా రాకపోకలు లేవు. శ్రావణ మాసం నోములకూ కూడా ఒకరికొకరం ఈసారి పిల్చుకోలేదు. మొన్న దాని కూతురి ఏంగేజుమెంటుకు కూడా పదిమందికే పర్మిషన్ అని, ఫంక్షన్ అయిపోయాక ఫొటోలు షేర్ చేసింది. ఇంకో నాల్రోజుల్లో పిల్లపెళ్ళి. అసలే బిజీ డాక్టర్ మా మరిదిగారు. ఈ కరోనా టైం లో ఎలా పెళ్ళి చేస్తాడో అనుకుంటుంటే, ఇప్పుడీ ఫోనూ ..

సందేహంగా ఫోన్ తీసాను. అటుపక్కనుంచి "హాల్లో అక్కయ్య " అంది అది హుషారుగా ..."ఏంటే సంగతులూ కొంపదీసి పెళ్ళికి పిలుస్తున్నావాయేం ..."అన్నాను. అది నిజంగానే "అవును అక్కయ్యా ..పెళ్ళికే పిలుస్తున్నా అమ్మాయి పెళ్ళికి నువ్వు తప్పకుండా రావాలి అంది !!!!"

నేను బోలెడు ఆశ్చర్యంతో నోరుతెరిచి "హా ! ఎలా ! నన్ను రమ్మంటున్నావా ..యే ..."అని వసంతకోకిలలో కమలహాసన్లా ...తెరపట్టనంత ఎమోషన్ గుమ్మరించేసా.

"ఏంలేదు అక్కయ్యా మా పెద్దాడబడుచు ముంబాయ్ నుండి రావలసింది. వాళ్ళ అత్తగారికి కరోనా ...వీళ్ళు క్వారంటైన్ అందుకే రావటం లేదు. ఆప్లేస్ లో నువ్వు రావొచ్చుకదా అందుకే ఫోన్ చేసా "అంది.

" ఒకే ...ఒకే రాత్రికి పెళ్ళికదా ...బావగారూ నేనూ స్నాతకానికి మధ్యాహ్నం నుండే అక్కడుంటాం నువ్వేం కంగారుపడకు "అని మామూలుగా మాట్లాడుతున్నా ...అది వెంటనే "సారీ అక్కయ్యా మధ్యాన్నం కుదరదు ఈయన హాస్పటలో డాక్టర్లలో ముఖ్యమైన ఒక పదిమందికి భోజనాలు. రాత్రికి వచ్చెయ్యి నువ్వు మాత్రమే ...బావగారు కూడావస్తే సంఖ్య పెరుగుతుంది. పెళ్ళివారొక ముప్పై మంది. మనవైపు ఇరవై మంది మాత్రమే రావాలి. మొత్తం యాభై

మందికే పర్మిషన్ నీకు కుదరకపోతే చెప్పు ఇంకొకరిని పిలుస్తా " అని నిర్మొహమాటంగా చెప్పి ఫోన్ పెట్టేసింది.

ఒక్కసారి పాలపొంగుమీద నీళ్ళు చిలకరించినట్లైంది. తనురాకుండా నేనొక్కదాన్నేనా ...ఎలా అనుకున్నాను. ఈయన మాత్రం "దాందేవుందోయ్ ...హ్యాప్పీగా వెళ్ళిరా ..మండపం దాకా దింఛొస్తా. రిటన్ అయ్యేటప్పుడు ఫోన్ చెయ్యి మళ్ళీ వచ్చేస్తా " అని క్రిష్ణపరమాత్మలా అభయమిచ్చేశారు.

ఇంకేం దాదాపు నాలుగైదు నెలలతరువాత వెళ్ళబోయే ఫంక్షన్ !అదేవిటో కంగారుగానూ ...విపరీతమైన ఉత్సాహంతోనూ కాళ్ళూ చేతులూ ఆడలేదు.

ఇన్నాళ్ళూ అద్దంలోకూడా చూసుకోవటానికి ఉత్సాహపడని మొహాన్ని ఆనాల్రోజులూ పదే పదే తోమి మెరుగుపెట్టాను. మావార్ని బ్రతిమాలి లాకర్లో నగలు తెప్పించుకున్నాను.

ఆరోజు పంకజం సెలక్షన్ తో బంతిపువ్వురంగుకి రాణీ కలర్ పట్టుచీర కట్టుకుని, నగలు సింగారించి చివరిగా మొన్నచేయించుకున్న గోల్డ్ మాస్కు కూడా ధరించి కారెక్కి పెళ్ళికి బయలుదేరాను.

మావారు నన్ను మండపం వాకిట్లో దించి వెళ్ళిపోయారు. అందంగా తెరలు వేసినగది ముందున్న అమ్మాయి వెల్కం అని సానిటైజరు జల్లిన గులాబీ చేతికిచ్చి లోపలికి ఆహ్వానం పలికింది. లోపలికి వెళ్ళగానే సెంటుకలిపిన సానిటైజర్ జల్లుకురిసింది. తడిసిన చీరెతో బిత్తరపోయి బైటపడి పెళ్ళి మండపంలోకి వెళ్ళాను.

అది పెళ్ళి మండపం లాగా లేదు నాసా అంతరిక్ష కేంద్రం లా ఉంది. పూల మండపం కనపడింది కనుక పెళ్ళి మండపమేనన్న నమ్మకం కుదిరింది. అందరూ పీ. పీ యీ కిట్లతో హడావుడిగా తిరుగుతున్నారు. కొందరేమో బహుశా మగపెళ్ళివారనుకుంటా అదేకిట్లతో శిలా విగ్రహాల్లా దూర దూరంగా వేసిన కుర్చీల్లో కూర్చున్నారు.

ఇంతలో ఒక ఆకారం హడావుడిగా వచ్చి "రా అక్కయ్యా ... ఇదేనా రావటం" అంది. నేను నోరుతెరిచేలోపు ఒక కవర్ నా చేతికిచ్చి, "త్వరగా వేసుకుని రా "అని హడావిడి పెట్టింది. గదిలోకి వెళ్ళి చూస్తే ...నాకూ ఒక కిట్ ఇచ్చారు వేసుకోవడానికి ...ఆలోచిస్తూ నిలబడితే మళ్ళీవొచ్చి "కానీ కానీ "అని తొందరపెట్టింది.

నా పచ్చ పట్టుచీరా నగలూ ఒక్కసారి నన్నుచూచి నవ్వినట్లు అనిపించి బాధేసింది సరే !ఏంచేస్తాం అనుకుంటూ వాటిని కప్పెట్టి కిట్టేసుకుని బయట కొచ్చాను. అప్పట్నించీ మొదలయ్యింది అసలు గొడవ.

ఎవరు ఎవరో అసలు ఆడోమొగో అర్ధమై చావటం లేదు. కాస్త పొట్టిగా లావుగా ఒక ఆకారం కనబడితే మా చెల్లెమో అనుకుని "ఏవిటే ఫొటోల్లో చూసా పిల్లాడు మరీ నలుపూ ...ఇంతలో పిల్లకేం వయసైందని కాస్త ఈడూ జోడూ చూడొద్దూ " అన్నాను.

ఆ మనిషి ముసుగు కాస్త తొలగించి "నేను పిల్లవాడి తల్లిని ఇంతకూ మీరెవరు "అని గట్టిగా గద్దించింది. దెబ్బకు ముసుగు మూసేసి పక్కకు పారిపోయాను. "ఇదుగో మిమ్మల్నే " అని వెనకనుండి పిలుస్తున్నా వినిపించుకోకుండా.

కాసేపటికి నాభుజం మీమ్మీద చేయిపడింది "ఏమేవ్ మీ అన్నయ్య కొడుకు పెళ్ళిలో గోల చెయ్యాలి, గొడవ పెట్టాలి అన్నావు గా ...ఎక్కణ్ణించి మొదలెడదాం. భోజనాలు బాగులేవనా ...మర్యాదలు చాల్లేదనా" అంది ఒక మగ కంఠం తక్కున ముసుగుతీసి సీరియస్ గా చూసేసరికి " సారీ మా ఆవిడనుకునీ ...."ఖంగారుగా అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడతను .

అప్పటికి అర్ధమైంది నాకు అందరూ ఎందుకని అలా శిలావిగ్రహాల్లా కూచున్నారో ..నేనూ ఒక కుర్చీ చూసుకుని మెదలకుండా కూర్చున్నాను. పంకజం నా పక్కనే సెటిలయ్యింది.

ఒక ఆకారం నా పక్కనొచ్చి కూచొని "చూసావా వొదినా దీని గొప్ప ...పెళ్ళికొడుక్కీ,తల్లికీ, చెల్లికీ విడిదింట్లో వెండి శానిటైజరు బాటిల్స్ పెట్టించిందట.డాక్టరు కదూ కరోనా కాలంలో కావలసినంత సంపాయిచ్చాడ్లే ...వెండివేం ఖర్మ బంగారపవైనా పెడతాడు. ప్రైవేటు క్వారంటైను సెంటర్ పెట్టారట తెలుసానీకూ ..." ముసుగుతియ్యటానికూడా భయపడి నోరు మూసుక్కూచున్నాను.

పెళ్ళి పీటల మీద ఉన్నారు కనుక పెళ్ళి కూతురూ పెళ్ళి కొడుకుని గుర్తుపట్టాను. వాళ్ళకి కొంచెం పక్కగా బ్రహ్మగారు కుర్చున్నారు. మండపమంతా సెంట్లూ శానిటైజర్లూ కలిసిన వింత వాసన.

గణపతి పూజ కంటే ముందు "అపవిత్ర పవిత్రోవా "అంటూ చేతిలో శానిటైజర్ వేసి పెళ్ళి తంతు మొదలెట్టేడు బ్రహ్మగారు. డెట్టాల్ కలిపిన నీళ్ళతో కాళ్ళు కడిగాడు మా మరిదిగారు అసలే డాక్టరు కదా ఇంకొంచెం జాగ్రత్త తీసుకొంటున్నాడు.

మద్య మధ్యలో చేతిలో సానిటైజరు చల్లి తాగటానికి వేన్నీళ్ళూ, కాసిని డ్రై ఫ్రూట్స్ ఉన్న పాకెట్లూ అందిచ్చారు. తాగాలనుకున్నవారికి కాఫీ టీలతో పాటు పసుపువేసిన పాలు కూడా అందించారు.

ఆవిధంగా సానిటైజ్ చేసిన తాళిబొట్లూ, తలంబ్రాలతో పెళ్ళి తంతు ముగిసింది. పట్టు చీరెల గలగలలూ, అయినవాళ్ళ హాస్యోక్తులూ, సరదాల బంతిభోజనాలూ లేకుండా ఏదో చూసాం, తిన్నాం అంతే ...ఆ భోజనం తినడానికి కూడా భయమే ...

ఈయనకు ఫోన్ చేసి మండపం బయటికి వచ్చాను. వెళ్ళొస్తానని కూడా చెల్లికి చెప్పలేదు.కట్టుకున్న పట్టుచీర, పెట్టుకున్న నగలూ చిరాగ్గ అనిపిస్తున్నాయి. మావారు కారాపి ఎదురుచూస్తున్నారు. ఈ గ్రహాంతరవాసి అవతారంలో గుర్తుపట్టలేదనుకుంటా

కారుదగ్గరికి వెళ్ళి "ఏమండీ" అన్నా ...అనుమానం గా చూస్తుంటే ముసుగు తీసా. నవ్వేసి తలుపు తీసారు. పంకజం వెనక సీటులో సెటిలైంది.

"పెళ్ళి బాగా జరిగిందా ..."అన్నారు అలవాటుగా. "అది మాత్రం అడక్కండి కరోనాలో పెళ్ళి కెళ్ళటం కంటే క్వారంటైను సెంటరు కెళ్ళటం మేలు " అన్నాను విసుగ్గా. వెనక సీట్లో పంకజం మాత్రం నా స్థితిచూసి చెంగు అడ్డం పెట్టుకుని కిసుక్కుమని నవ్వుతూనే ఉంది.

# విశాఖ వెలుగులు

-కె.వెంకట్, పిహెచ్‌డి



విశాఖపట్నం. పుట్టుకతోనే రాజయోగాన్ని వెంట తెచ్చుకుంది. అందుకే ఎపుడూ కూడా నంబర్ వన్ సిటీగానే ఉంది. విశాఖ రాజసానికి ఏమి తక్కువ. నాడు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో హైదరాబాద్ లాంటి భాగ్యనగరం ఉన్నా కూడా విశాఖ వెలుగులు ఎక్కడా తగ్గలేదు.

ఇక విభజన ఆంధ్రప్రదేశ్‌లో కూడా అయిదేళ్ల పాటు విశాఖే రాజధాని అన్నంతగా తళుకులొలికింది. ఇదిలాఉండగా, గత కొద్ది నెలలుగా విశాఖలో అధికారుల పర్యటనల జోరు పెరిగింది.

అమరావతి నుంచి ముఖ్యమంత్రి ప్రత్యేక కార్యదర్శి ప్రవీణ్ ప్రకాష్ వచ్చి విశాఖలోని పలు భవనాలను పరిశీలించివెళ్లారు. ముఖ్యమంత్రి క్యాంప్ ఆఫీసుతో పాటు, సచివాలయం, సిబ్బంది నివాసాలు, ఇతర అవసరాల కోసం సరిపడా భవనాలను కూడా స్వయంగా పరిశీలించి వెళ్లారని భోగట్టా.

ఆ తరువాత చూసుకుంటే డీజీపీ గౌతం సవాంగ్ కూడా విశాఖలో రెండు రోజుల పాటు మకాం వేసి అన్ని రకాలుగా వాకబు చేశారు. విశాఖలోని గ్రౌహౌండ్స్ భవనాలను, కాపులుప్పాడలోని ఐటి సెజ్‌ను కూడా ఆయన పరిశీలించారు. ఇక, ప్రభుత్వ స్థలాలు, ఖాళీగా ఉన్న భూములను కూడా చూసి వెళ్లారు. ఆయన సైతం అధికారులతో సమీక్ష నిర్వహించి త్వరలోనే రాజధాని వస్తోందన్న సంకేతాలు ఇచ్చేశారు.

ఇక ముఖ్యమంత్రి సతీమణి వైఎస్ భారతి కూడా ఆ మధ్యన విశాఖ పర్యటన చేశారని కూడా సమాచారం వచ్చింది. ఆమె విశాఖలోని ముఖ్యమంత్రి నివాసం, క్యాంప్ ఆఫీసులకు అనువైన స్థలాన్ని కూడా ఎంపిక చేశారని చెబుతారు.

వీరే కాదు, తరచూ అమరావతి నుంచి విశాఖకు వచ్చే ఉన్నతాధికారుల తాకిడి ఎక్కువైపోయింది. తరచూ ఎర్ర బుగ్గ కార్లు విశాఖ రోడ్ల మీద జోరుగా పోతూంటే సామాన్యుడికి సైతం అర్థమైపోతోంది, విశాఖకు రాజధాని తరలింపు ఎంతో దూరం లేదని, ఆ విధంగా విశాఖ సాగరతీరంలో అధికార హడావుడి మొదలైపోయిందనే చెప్పాలి.

నిజానికి విశాఖను ఈనాడు రాజధాని కాదని అంటున్న చంద్రబాబు కూడా తన హయాంలో ప్రతీ నెలలో మూడుసార్లు ఇక్కడికే వచ్చేవారు. చంద్రబాబు ఏ సదస్సు పెట్టినా విశాఖే వేదిక అయింది. ఆ విధంగా విశాఖ ఎపుడూ రాచఠీవిలో అలరారుతూనే ఉంది.

ఇక, ఏడు నెలల క్రితం వైసీపీ ప్రభుత్వం నిండు సభలో విశాఖే మన పాలనా రాజధాని అంటూ భారీ ప్రకటన ఇచ్చింది. ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహనరెడ్డి స్వయంగా విశాఖను రాజధాని

చేస్తామని కోట్లాది మంది ప్రజల సాక్షిగా మాట ఇచ్చారు.

జగన్ మాట అంటే ప్రజలేక కాదు, ప్రతిపక్షాలకూ అంత గురి. అందుకే నాటి నుంచి విష ప్రచారానికి తెర లేచింది. విశాఖ దేశంలోని మెట్రోపాలిటిన్ సిటీలలో ఒకటిగా ఉంది. అటువంటి నగరాన్ని పట్టుకుని ప్రమాదాలకు నిలయం, విలయాలకు కేంద్రమంటూ తప్పుడు రాతలూ చేతలతో విశాఖ బ్రాండ్ ఇమేజ్‌ను దెబ్బతీసే ప్రయత్నం చేశారు.

విశాఖలో నిండా రసాయన పరిశ్రమలు ఉన్నాయని, అవి అంటుకుంటే విశాఖ బూడిదేనని కూడా చెప్పారు. విశాఖలో హుదూద్ తరహా తుపాన్లు వస్తాయని, దాంతో, నగరం కనుమరుగేనని జోస్యం చెప్పారు. ఇపుడు సునామీ భయాన్ని నింపారు. విశాఖ ఆనవాళ్లు లేకుండా మొత్తం సాగరగర్భంలోకి వెళ్లిపోతుందని సరికొత్త భయాన్ని సృష్టించే ప్రయత్నం చేశారు. అయితే విశాఖ జనం మాత్రం వీటిని ఎట్టి పరిస్థితులలోనూ నమ్మడంలేదు, విశాఖవాసులు ఎపుడూ ప్రగతి కాముకులు, అంతే కాదు, అభ్యుదయవాదులు, మార్పు కోరుకుంటారు, ఆ చైతన్యం జనాలలో ఉంది. విశాఖతో పాటే తామూ ఎదుగుతూ పదుగురికి చోటిస్తూ దేశంలోనే కాదు, ప్రపంచ పటంలో విశాఖ నగరం నిలవాలన్నది విశాఖ భూమి పుత్రుల ఆకాంక్ష.

ఇక, విశాఖజనాలకు తెలుసు. ముఖ్యమంత్రి జగన్ మాట ఇస్తే తప్పరని, విశాఖను ఆయన ఆరు నూరైనా రాజధాని చేసి తీరుతారని కూడా వారికి విశ్వాసం ఉంది. అందుకే పల్లదనంతో కూడిన ప్రతిపక్షాల మాటలను ఏ మాత్రం ఖాతరు చేయడంలేదు, విశాఖలోనే పుట్టి పెరిగిన తమ కంటే ఈ నగరం గురించి ఎవరికి తెలుసు అని కూడా అంటున్నారు.

ఎపుడో వందేళ్లకు ఒకసారి వచ్చే హుదూద్ తుపాన్లు కూడా విశాఖకు ఉన్న ప్రాకృతిక స్వభావరిత్యా, విశాఖ చుట్టూ ఎత్తైన కొండల రక్షణ కవచంగా ఉన్న రిత్యా ఏ మాత్రం ప్రమాదం చేయవని కూడా సగటు విశాఖ వాసికి బాగా తెలుసు. ఇక సునామీల వంటి భయాలు ఏవీ లేవని ఎన్నో సార్లు విశాఖ ఆంధ్రాయూనివర్శిటీలోనే నిర్వహించిన అనేక సదస్సులు తేల్చి చెప్పాలి,

ఇక చాలా పరిశోధనలలో కూడా విశాఖ కంటే భద్రత కలిగిన నగరం మరోటి లేదని కూడా స్పష్టంగా పేర్కొన్నారు. ఇపుడు విశాఖ చుట్టూ భయపెట్టే రాజకీయాన్ని చూసి జనం కనీసంగా కూడా పట్టించుకోవడంలేదు. మూడు జిల్లాల ప్రజలలో కొత్త ఆశలు మొలెకత్తుతున్నాయి.

ఇంతకాలం ఈ ప్రాంత వాసులు ఉపాధి కోసం వేరే చోటకు వెళ్లేవారు, వలసలు ఎక్కువగా ఉన్న జిల్లాలుగా ఉత్తరాంధ్రను చెప్పుకుంటారు. అందువల్ల రాజధాని నగరం కనుక వస్తే తమ కష్టాలు తీరుతాయని, ఇక్కడే బతుకు తెరువు దొరుకుతుందని ఆశాపడుతున్న వారు నూటికి తొంబయి శాతం ఉన్నారు..

అలాగే, బీసీలు, బడుగులు ఉన్న ఉత్తరాంధ్ర స్వాతంత్ర్యం ముందు నుంచి అభివృద్ధికి ఆమడ దూరంలో ఉంది. ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో ఉన్నపుడు కూడా వందల కిలోమీటర్ల దూరంగా రాజధాని ఉండేది. ఆ తరువాత ఆంధ్రరాష్ట్రం ఏర్పాటయ్యాక కర్నూల్ రాజధానిగా ఉంది. ఆ తరువాత దాదాపుగా అరవై ఏళ్లకు పైగా హైదరాబాద్ రాజధాని, గడచిన ఆరేళ్లుగా అమరావతి రాజధానిగా చెబుతున్నారు. ఈ రాజధానులన్నీ కూడా ఉత్తరాంధ్రకు కడు దూరంగా ఉన్నవే. దాంతో, అదే రాజధాని తమ ముంగిటకు వస్తూంటే కాదనే అమాయకత్వంలో ఇంకా ఈ జిల్లాల జనంలేరన్నది వాస్తవం. ఇక విశాఖ సహా, ఉత్తరాంధ్ర జిల్లాలలోని విపక్షాలు కూడా రాజధాని విషయంలో రెండుగా చీలిపోయాయి. తెలుగుదేశం పార్టీకి సొంత పార్టీలోనే మద్దతు కరవు అవుతోంది. అలాగే, బీజేపీ ఎమ్మెల్సీ పీవీఎన్ మాధవ్ వంటి వారు విశాఖ రాజధానికే తమ మద్దతు అంటున్నారు. ఈ నేపథ్యంలో రాజధాని విషయంలో తెలుగుదేశం అధినాయకత్వం కానీ, ఇతర పార్టీలు కానీ చేస్తున్న విష ప్రచారాన్ని ఎవరూ అసలు నమ్మడంలేదన్నది నిజం.

మొత్తానికి విశాఖవాసులు ఇన్నాళ్లూ ఏదీ అడగలేదు, ఇపుడు వచ్చిన రాజధానిని కాదనుకోరని కూడా మేధావులు, విశాఖ అభివృద్ధి కాముకులు అంటున్నారు.. సమయం, రోజూ చెప్పలేము కానీ విశాఖకు రాజధాని కచ్చితంగా వచ్చి తీరుతుంది.



నీవు ఏ దిక్కుకు తిరిగినా సరే,
దారికడ్డంగా నిలబడే పెనుభూతం కులవ్యవస్థ.
ఈ బూతాన్ని చంపి పారవేస్తే తప్ప నీవు
రాజకీయ సంస్కరణగాని, ఆర్థిక సంస్కరణగాని
సాధించలేవు.

– అంబేద్కర్



# అనకొండ రైళ్ళు

- పి.సుకుమార్

రైళ్లలో కేవలం ప్రయాణికులను తరలించే రైళ్లు మాత్రమే కాదు.. వస్తువులను తరలించే గూడ్స్ రైళ్లు కూడా ఉంటాయి. అవి నిరంతరాయంగా నడుస్తూనే ఉంటాయి. విమానాలు, రోడ్డు రవాణా కన్నా ఎక్కువ మొత్తంలో వస్తువులను రైళ్ల ద్వారా రవాణా చేసేందుకు వీలు కలుగుతుంది. అయితే కరోనా నేపథ్యంలో మార్చి, మే నెలల్లో రైల్వే శాఖ అద్భుతమైన ప్రయోగం చేసింది. అదేమిటంటే

సాధారణంగా ఒక గూడ్స్ రైలుకు 40 నుంచి 50 వరకు బోగీలు ఉంటాయి. ఒక్కో రైలును నడిపించాలంటే అందుకు మ్యాన్ పవర్, విద్యుత్ లేదా డీజిల్ ఖర్చు అవుతాయి. దీంతోపాటు ఒక్కో రైలు ఒక్కో సమయంలో నడుస్తుంది కనుక.. అవి భిన్న సమయాలకు గమ్యస్థానాలకు చేరుతాయి. దీంతో ఎంతో సమయం వృథా అవుతుంది. అయితే ఈ ఇబ్బందులన్నింటినీ తగ్గించేలా రైల్వే శాఖ వినూత్న ప్రయోగం చేసింది. మార్చి నెలలో ఈస్ట్ కోస్ట్ రైల్వే 3 గూడ్స్ రైళ్లను కలిపి ఒకే రైలులా మార్చి దాన్ని గోడ్‌భగ, బాలాంగిర్ రైల్వేస్టేషన్ల మధ్య నడిపింది. ఆ రైలుకు 147 బోగీలను కలపడం విశేషం. అందులో 3 బ్రేక్/గార్డ్ బోగీలు, 4 ఇంజిన్లు ఉన్నాయి.

ఇక ఆ ప్రయోగం విజయవంతం అయ్యే సరికి మరో రెండు నెలలకు అంటే.. మే నెలలో సౌత్ ఈస్ట్ సెంట్రల్ రైల్వే అలాంటిదే మరొక ప్రయోగం చేసింది. ఈసారి కూడా రైళ్లను కలిపారు. దీంతో ఆ రైలులో మొత్తం 177 బోగీలు అయ్యాయి. ఇక ఆ రైలు పొడవు సుమారుగా 2 కిలోమీటర్లు అయింది. దాన్ని విశాఖపట్నం పోర్టుకు తరలించారు. అలా ఆ రైలును కూడా విజయవంతంగా నడిపారు. అయితే ఆ రైలు భారీగా పొడవు ఉండడం చేత దాన్ని అనకొండ ఆన్ రైల్స్ అని పైథాన్ ట్రెయిన్ అని పిలిచారు.

అయితే రైల్వే అధికారులు విడివిడిగా 3 రైళ్లను నడిపి ఉండవచ్చు. కానీ అలా చేసి ఉంటే 3 రైళ్లు గమ్యస్థానాలకు చేరుకునేందుకు భిన్న సమయం పట్టేది. దీంతో ఎంతో సమయం వృథా అయి ఉండేది. అలాగే మ్యాన్ పవర్, ఇంధనం కూడా ఎక్కువగానే ఖర్చు అయి ఉండేవి. కానీ వాటిని ఒకే రైలుగా కలపడం వల్ల 3 రైళ్లు ఒకేసారి గమ్యస్థానానికి చేరుకున్నాయి. దీనికి తోడు ఎంతో సమయం ఆదా అవడమే కాక.. ఇతర ఖర్చులు కూడా తగ్గాయి. అందువల్లే రైల్వే శాఖ వారు ఆ ప్రయోగం చేసి.. అలా 2 భారీ అనకొండ రైళ్లను నడిపారు. అయితే కరోనా నేపథ్యంలో మార్చి నుంచి లాక్‌డౌన్ ఉంది. ఈ క్రమంలో రైళ్లను కూడా రద్దు చేశారు. అందువల్ల రైళ్ల రద్దీ లేదు. దీంతో గూడ్స్ రైళ్లను అలా కలిపి నడిపారు. కరోనా నేపథ్యంలో ఇతర రైళ్లు లేనందువల్లే ఇలా చేయడం సాధ్యమైంది. సాధారణ సమయాల్లో రైళ్ల రద్దీ ఉంటుంది కనుక ఈ తరహా ప్రయోగాలు చేయలేరు. ఏది ఏమైనా.. రైల్వే వారు చరిత్రలోనే తొలిసారిగా ఇలాంటి ప్రయోగం చేసి రికార్డు సృష్టించారు. అందువల్ల అనకొండ రైలు అనే కొత్త పదం రైల్వే డిక్షనరీలో వచ్చి చేరింది. మరి ముందు ముందు ఇలాంటి ప్రయోగాలు చేస్తారో, లేదో చూడాలి.

# పుస్తెలమ్మి అయినా పులస తినాలి

-డి.ఉదయ్ భాస్కర్



వర్షకాలంలో మాత్రమే దొరికే అరుదైన చేప- పులస.! పుస్తెలమ్మి అయినా పులస తినాలి అనే సామెతను బట్టి చెప్పొచ్చు...ఆ చేప రుచి ఏ రేంజ్ లో ఉంటుందో.! ఈ చేప కేవలం గోదావరిలో మరియు హుగ్లీ నదిలో మాత్రమే దొరుకుతుంది.! కానీ గోదావరిలో దొరికే చేప రుచి చాలా బాగుంటుంది!

**ఖండాలు దాటుతూ...గోదావరికి చేరుతుంది!**

ఈ చేపలు ఆస్ట్రేలియా న్యూజీలాండ్ నుండి హిందూ మహాసముద్రం మీదుగా ప్రయాణం చేసి బంగాళఖాతంలోకి ప్రవేశిస్తాయి! గోదావరి నది అంతర్వేది వద్ద బంగాళాఖాతంలోకి ప్రవేశిస్తుంది..ఈ క్రమంలో అప్పటికే బంగాళఖాతానికి చేరిన ఈ చేపలు గోదావరి నది ప్రవాహానికి వ్యతిరేఖంగా వేగంగా ఈదుకుంటూ వెళ్తాయి.! సముద్రపు ఉప్పునీటి కంటే గోదావరి తీపి నీటిలో గుడ్లు పెట్టాలనే కారణంతో..!

సముద్రంలోనే విలసలే... గోదావరి నది నీటిలోకి వచ్చాక పులసలుగా మారుతాయి!

వాస్తవానికి సముద్రంలో ఉన్నప్పుడు వీటిని విలసలు అంటారు..ఉప్పునీటిలో ఉండడం కారణంగా అప్పుడు అంత టేస్ట్ ఉండవు..గోదావరి నీటిలోకి చేరగానే ఈ చేపకు అద్భుతమైన టేస్ట్ వస్తుంది!

**ఆడపులసలకు డిమాండ్ ఎక్కువ!**

పులస చేపల్లో ఆడ చేపకు అది కూడా గర్భంతో ఉన్న ఆడచేపకు డిమాండ్ ఎక్కువగా ఉంటుంది! ఇతర చేపలతో పోలిస్తే ముల్లులు ఎక్కువగా ఉన్నప్పటికీ ...దీని రుచి రీత్యా దీనికి డిమాండ్ ఎక్కువగా ఉంటుంది. అది కూడా ఈ చేపలు ఆగస్ట్ నుండి సెప్టెంబర్ మధ్యలోనే దొరుకుతాయి కాబట్టి మరింత డిమాండ్ ఉంటుంది!

**రేటు ఎలా ఉంటుంది?**

సముద్రానికి దగ్గరగా ఉండే యానాం, కోటిపల్లి ప్రాంతాల్లో దొరికే పులసలకు తక్కువ ధర ఉంటుంది.

ధవళేశ్వరం సమీపంలో దొరికే చేపలకు విపరీతమైన ధర ఉంటుంది! కేజీ 2000 నుంచి రూ.7 వేల వరకూ ఉంటుది.

**పులస ఇతర విశేషాలు.**

వలలో పడగానే చనిపోతాయి

సంక్రాంతికి బంధువులు వచ్చినట్టే... పులసలను తినడానికి కూడా ప్రత్యేకంగా బంధువులు వస్తుంటారు!

మత్స్యకారులు కడుపునిండా తిండి తినేది ఈ సీజన్ లోనే...పులస పేరుతో కొద్దోగొప్పో కూడబెట్టుకుంటారు.

పులసకు ఉన్న డిమాండ్ కారణంగా నకిలీ పులసలను మార్కెట్ లో అమ్ముతున్నారు..పులసలుగా మారకముందే సముద్రంలో దొరికే విలసలనే పులసలుగా అమ్ముతుంటారు. విలసలు - నలుపు, ఎరుపు రంగులో ఉంటాయి. పులసలు వెండి కలర్‌లో ఉంటాయి!

**పులసలు అంతరించి పోయే ప్రమాదం!**

పులసలకు ఉన్న డిమాండ్ దానికి తోడు గర్భంతో ఉన్న పులసలను తినడానికి ఎక్కువ ఇంట్రస్ట్ చూపడంతో వీటి ప్రత్యుత్పత్తి మీద తీవ్ర ప్రభావం పడుతుంది..ఇలాగే కొనసాగితే అరుదైన పులస అంతరించి పోయే ప్రమాదముంది!



# అప్పటిదాకా.. ఆగాల్సిందే...

**- కొత్తూరి లక్ష్మీ ఫణి**



కరోనాకు వ్యాక్సిన్ అందుబాటులోకి రావడానికి 6 నెలలు దాకా సమయం పట్టేట్టు ఉంది.ఒకవేళ అప్పుడు వచ్చినా, అంతకంటే ముందుగా వచ్చినా, అందరికీ చేరాలంటే 2021ద్వితీయార్థం వరకూ ఆగాల్సిందేనని ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యూహెచ్ఓ) ప్రధాన శాస్త్రవేత్త డాక్టర్ సౌమ్య స్వామినాథన్ చెబుతున్నారు. ఈమె గ్రీన్ రెవల్యూషన్ పితామహుడు గౌరవనీయులుడాక్టర్ స్వామినాథన్ కుమార్తె. నూటికి నూరుపాళ్ళు భారతీయురాలు. ఎంతో బాధ్యతాయుతమైన వ్యక్తి.ఈవిడ మాటలకు చాలా విలువ ఉంటుంది.డబ్ల్యూహెచ్ఓ అధిపతి గేబ్రియేసస్ లాగా పక్షపాత పూరితమైన, రాజకీయ వ్యాఖ్యలు చేసే వ్యక్తి కానేకాదు. మూడవ దశ క్లినికల్ ట్రయల్స్‌కు చేరుకున్న వ్యాక్సిన్ల పూర్తిస్థాయి ఫలితాలు తెలియాలంటే, ఈ ఏడాది చివర వరకూ ఆగాల్సిందేనని సౌమ్య స్వామినాథన్ మాటల ద్వారా తెలుస్తోంది. వ్యాక్సిన్లు 2021 ప్రథమార్ధంలోనే అందుబాటులోకి వచ్చే అవకాశమే ఉంది.కానీ, ప్రపంచ వ్యాప్తంగా ఉన్న జనాభాను దృష్టిలో పెట్టుకొని సౌమ్య స్వామినాథన్ పైవ్యాఖ్యలు చేశారు. కోట్లాది వ్యాక్సిన్ డోసులు అందుబాటులోకి రావడానికి సమయం పట్టడం సహజమైన అంశం. మూడవ దశ క్లినికల్ పరీక్షల ప్రయోగాలు పూర్తయిన తర్వాత మనకు వ్యాక్సిన్ల పంపిణీపై సంపూర్ణమైన అవగాహన వస్తుంది. వ్యాక్సిన్ల పరిశోధనలో ముందున్న మూడు కంపెనీలు సంయుక్తంగా ఒక స్పష్టమైన ప్రకటన చెయ్యడానికి యోచిస్తున్నట్లు సమాచారం. ప్రపంచవ్యాప్తంగా అనేక సంస్థలు వ్యాక్సిన్ల తయారీలో పోటీపడుతున్నాయి. ప్రజల్లో విశ్వాసాన్ని పెంచుకోడానికి, తద్వారా తమ సంస్థల బ్రాండ్ ఇమేజ్ తో పాటు వ్యాపారపరమైన విస్తరణ చేయడానికి తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నాయి. ప్రపంచ దేశాలన్నీ ఒక వ్యాక్సిన్ కోసం ఇంతగా ఎదురుచూడడం బహుశా చరిత్రలో ఇదే మొదటిసారి కావచ్చు.ఈ మందును తయారీ చేసే సంస్థలు సవాల్‌గా తీసుకుంటున్నాయి. అదే సమయంలో, ఇది గొప్ప అవకాశంగానూ భావిస్తున్నాయి.తొందరగా అందుబాటులోకి వచ్చే వ్యాక్సిన్లు ఎంత వరకూ బాగా పనిచేస్తాయి?, వైరస్ లో వస్తున్న మార్పులకు, దుష్ప్రభావాలకు అనుగుణంగా మళ్ళీ మరో వ్యాక్సిన్ రూపకల్పన చెయ్యాలా? అనే సందేహాలు కోట్ల బుర్రలను తొలుస్తున్నాయి.వీటన్నింటికీ పరోక్షంగా సమాధానం చెప్పడానికి ఫైజర్, మోడెర్నా, జాన్సన్ అండ్ జాన్సన్ కంపెనీలు ప్రజల ముందు ప్రతిజ్ఞ చెయ్యడానికి సిద్ధమవుతున్నట్లు మార్కెట్ వర్గాల్లో వినిపిస్తోంది. తమ వ్యాక్సిన్ల సురక్షత, సామర్థ్యం నిరూపణ అయ్యేంత వరకూ ప్రభుత్వాల ఆమోదం కోసం సంప్రదించకూడదని అనుకుంటున్నట్లు సమాచారం. దీని అర్థం క్లినికల్ ప్రయోగాలతో పాటు వ్యాక్సిన్ తయారీలో నైతిక ప్రమాణాలు, అత్యున్నతమైన శాస్త్రీయ పద్ధతులు పాటిస్తున్నామనే సంకేతం ప్రపంచానికి ఇవ్వడం కోసమేనని అర్థమవుతోంది. నిజంగా ఇది అభినందించవలసిన అంశమే. కోట్లాది రూపాయల వ్యాపారంతో ముడిపడి ఉన్న ఈ సందర్భాన్ని ఆర్థిక ప్రయోజనాలకు వెచ్చించే కుయుక్తులు ఉన్న వ్యక్తులు కూడా ఉంటారు. వ్యక్తుల నిజాయితీ, సంస్థల విశ్వసనీయతను కాపాడుకోవడం ఎంతో ముఖ్యం. కోట్లాదిమంది మనుషుల జీవితాలతో ముడిపడి ఉన్న అంశం ఈ వ్యాక్సిన్ తయారీ. మానవాళి మొత్తం వ్యాక్సిన్ల కోసం ఆశగా ఎదురుచూస్తున్న తరుణం ఇది.మానవ సంబంధాలు మృగ్యమవుతున్నాయి.ఎందరో బతుకుదెరువు పోరాటంలో అలసిపోతున్నారు.కొందరు అసువులు బాస్తున్నారు.కుటుంబసభ్యులు, స్నేహితులు, భాగస్వామ్యులు మరణించినా చూడలేని, వెళ్లలేని, కలవలేని, అక్కున చేర్చుకొని స్వాంతన కలిగించలేని దుర్భర పరిస్థితిలో సమాజం ఉంది. నిరుద్యోగం ప్రబలింది. ఆర్థిక అసమానతలు పెరిగిపోతున్నాయి. ఆకలి చావులు ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతున్నాయి. అనేక రంగాలు కునారిల్లిపోయాయి. ఎందరో మానసిక వత్తిళ్లకు గురవుతున్నారు. ఇది ప్రపంచ మానవాళికి పెనుసవాల్‌గా, పెనుచీకటిగా మారిన కాలం. ఈ దుర్భర పరిస్థితుల నుండి పైకి లేవాలి. మళ్ళీ లోకం తన కాళ్ళమీద తాను నిలబడాలి. మనుషులు మనుషులు, మనసులు మనసులు తిరిగి కలిసి సాగాలి. ఒకప్పటి సాధారణ పరిస్థితులు ఎప్పుడు వస్తాయో, అంటూ లోకం వెర్రిచూపులు చూస్తోంది. ఈ ఘోరకలికి ముగింపు పలుకకపోతే, ముందు ముందు తీవ్రమైన సామాజిక దృశ్యాలు చూడవలసి వస్తుంది. ఒకరకంగా ప్రభుత్వాలు చేతులెత్తేశాయనే చెప్పాలి. ఎవడి బతుకు వాడు బతకాల్సిందే అన్నట్లుగా కాలం నడుస్తోంది. ఆర్థిక స్తోమత, ప్రతి నెలా తప్పకుండా వచ్చే జీతమో, ఆదాయమో ఉన్న కొందరు తప్ప, ఎక్కువమంది అష్టకష్టాలు పడుతున్నారు. భౌతికదూరం పేరుతో ఆరోగ్యాన్ని చూసుకుంటూ, బతుకుతెరువు కూడా చూసుకోవాల్సిన విచిత్ర కష్టకాలం మానవాళికి వచ్చింది. భారత్‌లో రోజుకు 90వేల కేసులు దాటిపోయాయి. ప్రపంచంలో ఏ దేశంలోనూ ఒక్కరోజులో ఇన్ని కేసులు నమోదు కాలేదు. దేశంలో కేసుల సంఖ్య 45లక్షలు దాటాయి. బ్రెజిల్ తర్వాత రెండో స్థానంలో భారత్ ఉంది. త్వరలోనే బ్రెజిల్‌ను కూడా దాటిపోతాం. కేసులు పెరుగుతున్నా, రికవరీ రేటు 77శాతం దాటింది. ఇది ఊరట ఇచ్చే అంశం. దేశంలో సగటున 1000మరణాలు నమోదవుతున్నాయి. మరణాల శాతం 1.7శాతం ఉంది. ఇందులో ప్రపంచంలో భారతదేశం మూడవ స్థానంలో ఉంది.ప్రపంచ దేశాల్లో, భారత్ జనాభాలో అగ్రస్థానంలో ఉంది. 139కోట్ల 50లక్షల జనాభాతో, చైనా జనాభా సంఖ్యకు భారత్ దగ్గరవుతోంది. మన దేశ జనాభా సంఖ్యతో పోల్చుకుంటే, కరోనా కేసుల సంఖ్య తక్కువేనని చెప్పాలి. కానీ, కరోనా ప్రభావం జనావళి మనుగడపై చాలా ఎక్కువ ఉంది. అందరి ఆశలు వ్యాక్సిన్లపైనే ఉన్నాయి. అప్పటిదాకా ఆగాల్సిందేనా? ఇలా గడపాల్సిందేనా? అనే సందేహాలకు సక్రమమైన సమాధానం చెప్పే పరిస్థితిలో ఎవరూ లేకపోవడమే ట్రాజెడీ. మేధతో,అత్యాధునిక సాంకేతికతను శాస్త్రజ్ఞానం ద్వారా సంపాయించుకున్న మనిషి త్వరలో ఈ కరోనాను, కరోనా కల్పిత కాలాన్ని గెలవాలి. మనిషి గెలుస్తాడని విశ్వసిద్దాం.

# నిడదవోలు చరిత్ర

- టి.యుగంధర్ రెడ్డి




నిడదవోలును పూర్వము నిరవద్యపురము అని పిలిచేవారు. 14వ శతాబ్దములో అనవోతారెడ్డి జయించేవరకు నిడదవోలును వేంగిచాళుక్యులు పరిపాలించేవారు. అనవోతారెడ్డి తరువాత ఆయన సోదరుడు అనవేమారెడ్డి నిడదవోలును తన రాజధానిగా చేసుకొని పరిపాలించాడు. రాష్ట్రకూటులతొ జరిగిన యుద్ధములో రెండవ చాళుక్య భీముడు ఈ నగరములోనే విజయసారథిగా పేరుపొందినాడు. తూర్పు చాళుక్య కాకతీయ "నిరవద్యపుర" సంక్షిప్త చరిత్ర ఇదే నేటి నిడదవోలు . మన నిడదవోలు చారిత్రక ప్రసిద్ధిగల నగరం.చాళుక్య పరిపాలనతో ఇది "నిరవద్య పురము "గా ఖ్యాతి గాంచిన జలదుర్గం. దీనినే కేంద్రముగా చేసుకొని అనేకమంది చాళుక్యరాజులు తమ రాజ్యాన్ని విస్తరింప చేసారు. విష్ణుకుండినులు వేంగిని చాళుక్య రెండవ పులకేశి ధ్వంసం చేసి తమ్మునికి కృష్ణ గోదావరి మధ్య ప్రాంతం అప్పగించాడు. ఆ కుబ్జవిష్ణువర్ధనుడే తూర్పుచాళుక్య మూలపురుషుడు. వారికి ప్రధాన జలదుర్గం నిరవద్యపురం. మెకంజీదొర కైఫియతును బట్టి నిడదవోలు చాలా ప్రాచీన నగరము. ఇంత ప్రాచీన నగరాలు దేశంలో అక్కడక్కడ మాత్రమే ఉన్నాయి.తూర్పు చాళుక్య వీరుడు రెండవ విజయాదిత్యుడు అనేక యుద్దాలలో శత్రువులనోడించి రాజ్య



విస్తరణ చేశాడు. జననష్ట పాప పరిహారార్థం 108 శివాలయాలను కట్టించి "నిరవద్య " అనగా పాపము లేనివాడు అనే బిరుదు పొందాడు. అతనికి గల నిరవద్య అన్న పేరుతోనే ఈ ప్రాచీన నగరం "నిరవద్య పురమని" చరిత్రలో పిలవబడింది నిరవద్యపురము, పెదవంగూరులలో రాష్ట్ర కూటలకు-చాళుక్య రాజైన మొదటి చాళుక్య భీమునకు జరిగిన యుద్ధంలో చాళుక్యులు విజయం సాధించడంతో ఈ ప్రాంతంలో వారి పరిపాలన సుస్థిరము కాబడింది.ఆ యుద్ధంలో చాళుక్య భీముని కుమారుడు "ఇరిమర్తిగండ" మరణించాడు.అభిమన్యునితో పోల్చదగిన వీరుడు ఇతడు."దండినగండయ్య" అనే ప్రసిద్ధ రాష్ట్ర కూట సేనానిని ఆ యుద్ధం దక్షిణ భారతదేశ చరిత్ర గతిని మార్చినదీ యుద్ధము. ఆ తరువాత చాళుక్య రాజధాని గోదావరి ఆవలి గట్టు "రాజమందిరము"నకు చేరింది. నేటికీ మన ప్రాంత గ్రామీణులు రాజమండ్రిని రాజమంద్రం అంటుంటారు. గోదావరి ఆవలిగట్టున చాళుక్య రాజులకు వేసవి విడిది కోసం "రాజమందిరాలు" ఉండేదే నేటి రాజమహేంద్రి లేక రాజమండ్రి కీ.శ.972 సం ఎఎలో రాజధాని రాజమండ్రికి మార్చినట్లు చరిత్ర చెబుతోంది. ద్రాక్షారామం, భీమవరం, సామర్లకోట, పాలకొల్లు లలోని పంచా రామక్షేత్రాల నిర్మాత 2వ చాళుక్య భీముడే. ఈ దేవాలయాలలోని శిలా శాసనాల ద్వారా "నిరవద్యపుర" ప్రశస్తి తెలుస్తోంది.

నన్నయ మహా భారత రచనలో రాజరాజనరేంద్రుని నిరవద్యనరేశ్వర, నిరవద్యరవిప్రభ, నిరవద్యయువతీమదనా అని సంబోధించాడు.దీనిని బట్టి రాజరాజనరేంద్రుని కాలంలో కూడా నిరవద్యపురం చాళుక్యుల ప్రముఖ నగరమని తెలుస్తోంది. తెలుగు వారినందరినీ ఏకం చేయటానికి ఎంతో కృషి సల్పిన కాకతీయ గణపతి దేవ చక్రవర్తి తన జ్యేష్ఠ కుమార్తె రాణి రుద్రమదేవిని "నిరవద్యపుర" పాలకుడైన వీరభద్ర చాళుక్యునికి ఇచ్చి వివాహం చేశాడు.నిడదవోలు చాళుక్యులుగా వీరు చరిత్రలో ప్రసిద్ధి పొందారు.ఆంధ్ర సామ్రాజ్యాన్ని వరంగల్లు రాజదానిగా కాకతీయులు పరిపాలించే సమయంలో రాణి రుద్రమదేవి నిడదవోలుచాళుక్యుల కోడలు అయ్యింది. అంటే చరిత్ర ప్రసిద్ధినొందిన వీరనారి రాణిరుద్రమ నిడదవోలుకు కోడలిగా వచ్చిన ఘనచరిత్ర ఈ నగరమునకు గలదు. రుద్రమదేవి-వీరభద్రచాళుక్యుల పెద్ద కుమార్తె ముమ్మిడాంబను మరలానిడదవొలుచాళుక్యుల వంశం లోనే ఇవ్వడంతో జన్మించిన వాడే ప్రతాపరుద్రుడు వీరి దౌహిత్రుడు.వరంగల్లును ఏలినవాడు.మరి ఈయన నిడదవొలు చాళుక్యుడే.కాకతీయుడుగా మనకు చెబుతారు.ఓరుగల్లు విధ్వంసం చేయబడి, ప్రతాప రుద్ర చక్రవర్తి బందీగా చేయబడి, రాజమండ్రి ధ్వంసం చేయబడి కటకం వరకూ జరిగిన జునాఖాన్ దండయాత్రలో (సుల్తాన్ కావటానికి ముందు యువరాజు, మహ్మద్ బీన్ తుగ్లక్ ) బహూశా ప్రతాపరుద్రుని కుటుంబము పాలిస్తున్న ఈ నగరం కూడా 1323లో విధ్వంసానికి లోనై యుండవచ్చును. దానికి తగిన చారిత్రిక ఆధారాలుగా త్రవ్వకాలలో లభిస్తూనే యున్నాయి, ధ్వంసం చేయబడిన ఆలయ శిథిలాలు. పల్లవులకు కంచి ఎటువంటిదో చాళుక్యులకు నిరవద్యపురము అటువంటి గొప్ప శైవక్షేత్రము.

# ఒరిగిన సంగీత శిఖరం

- కె. శ్రీనివాస్, సీనియర్ జర్నలిస్ట్



**భా**రతీయ సంగీతమూర్తి అవతారం చాలించింది. ప్రఖ్యాత హిందుస్థానీ శాస్త్రీయ సంగీత గాయకుడు,విద్వాంసుడు పండిట్ జస్ రాజ్ కన్నుమూశారు. తొమ్మిది పదుల జీవితంలో, ఎనిమిది దశాబ్దాలకు పైగా పాడుతూనే ఉన్నారు.పాడుతూనే తుది శ్వాస వదిలారు.ఉచ్ఛ్వాస నిశ్వాసలే సంగీతంగా జీవించారు. అద్భుతమైన పాండిత్యం.పరమాద్భుతమైన కళా విన్యాసం.అన్నింటికీ మించిన భక్తి.శ్రావ్యమైన గొంతు.ప్రతి శృతిలోనూ మాధుర్యం చిలికే గాత్ర సంపద ఆయన సొత్తు. గంభీరమైన రాగాలు, స్వరాలు కూడా మాధుర్యంగా ఆ గానంలో ఒదిగిపోతాయి.తాను నేర్చుకున్న విద్య తన వద్దే వుంచుకోలేదు. గొప్ప శిష్య సంపదను సృష్టించారు. సంజీవ్ అభయంకర్, సాధనాసర్గమ్, సుమన్‌ఘోష్, తృప్తి ముఖర్జీ, కళా రామ్‌నాథ్ మొదలైన ఎందరో పేరెన్నిక గన్న కళాకారులంతా జస్‌రాజ్‌కు శిష్యులు. సుప్రసిద్ధ మేవాతీ ఘరానాలో సంగీత అభ్యాసం చేసిన పండిట్ జీ, ఆ ఘరానా గౌరవాన్ని ప్రపంచమంతా చాటి చెప్పారు.జయహో! మాతా! అని జస్‌రాజ్ కచేరీ ప్రారంభించేవారు. భజన్లు, అభంగ్‌లు, శ్లోకాలకు వీరు తీసుకువచ్చిన పేరు అంతా ఇంతా కాదు. వీరిది హిందుస్థానీ సంగీతమైనా, దక్షిణాది వారు కూడా వీరి పాటకు చెవి కోసుకుంటారు.ఉత్తరాది-దక్షిణాది అనే అడ్డుగీతలు చెరిపేసిన భారతీయ సంగీతమూర్తి. సంగీతాన్ని ప్రతిభా ప్రదర్శనగా ఏనాడూ చూపించలేదు.దేవతార్చనగానే భావించారు. దుర్గాదేవి ఉపాసకులు.తన కుమార్తెకు, ఇంటికి కూడా దుర్గాదేవి పేరు పెట్టుకున్నారు. శ్రీకృష్ణపరమాత్మను అంతగానే ఆరాధించారు.ఆ మూర్తులను హృదయ పద్మాలలో నిలుపుకొని గానం చేసిన పరమ భక్తుడు జస్‌రాజ్. ఎందరో మహా కళాకారులతో జుగల్ బందీలు, త్రిగళ్ బందీలు చేశారు.ఎవరైనా సరే, వీరి గానానికి బందీ కావాల్సిందే.పండిట్ హరి ప్రసాద్ చౌరాసియా, పండిట్ శివ్ కుమార్ శర్మ, ఎల్ సుబ్రహ్మణ్యం మొదలైన దిగ్గజ వాద్య విద్వాంసులు వీరితో జత కలిసి కచేరీలు చేశారు. జుగల్ బందీల్లోనూ జస్ రాజ్ ఎప్పుడూ ప్రతిభా ప్రదర్శన చెయ్యలేదు.సహజ గంగా తరంగంలా, మెరుపు వేగంతో ఆ గానం ప్రవహించింది.ఆయన ఒక యోగి. ఒక జ్ఞాని.ఒక మౌని. సంగీత రూప తపస్సంపన్నుడు.వారు పాడుతూ ఉంటే, ఆ దృశ్యం మనకు ఆ భావం కలిగిస్తుంది. శిష్యవాత్సల్యంబు చెలువుతీరిన మూర్తి.ప్రేమ స్వరూపుడు. పండిట్ జీ పరమ వినయ సంపన్నుడు.

జస్‌రాజ్‌కు కొన్ని కోట్లమంది అభిమానులు ప్రపంచమంతా ఉన్నారు. విద్యలో ఆయన చూడని లోతులు లేవు. కీర్తిలో ఆయన ఎక్కని శిఖరాలు లేవు.ఎప్పుడో 20ఏళ్ళ క్రితమే పద్మవిభూషణ్ పొందిన ఘనుడు. 35ఏళ్ళ క్రితమే సంగీత నాటక అకాడెమి అవార్డు సొంతం చేసుకున్నారు. జస్ రాజ్ గొంతులోనే ఒక చెప్పలేని మత్తు ఉంటుంది. భక్తి కోసమే పుట్టిన సంగీతమూర్తి. ఎనిమిది దశాబ్దాల పాటు ప్రపంచ వ్యాప్తంగా కోట్లాదిమందిని గానంతో తరింప జేసిన, పురుషాకృతి దాల్చిన సంగీత సరస్వతి జస్ రాజ్.దర్బారీ,అహిర్ భైరవ్, విలక్షణ తోడి, భాగేశ్రీ, భూప్, మాల్కౌన్స్, కావేరి, యమన్.. ఇలా ఏ రాగంలో పాడుతున్నా, వినేవారు రసలోకాల్లో విహరించాల్సిందే. ప్రతిభ,కళ, పాండిత్యం రంగరించుకున్న పరమ భాగవతోత్తముడు. వీరి విద్యా వికాసం వినయ స్వరూపం .చిన్ననాడే బేగం అక్తర్ గజల్స్ కు ఆకర్షితుడయ్యారు.సంగీతమే లోకంగా జీవించారు. జుగల్ బందీలోనూ వినూత్న ప్రయోగాలు చేశారు.త్రివేణి, ముల్తానీ, బేహడ, గౌడగిరి మల్హార్, పూర్వీ రాగాలు జస్ రాజ్ గొంతులో కొత్తగా పలుకుతాయి. చిదానంద రూప శివోహం శివోహం, ఓం నమో భగవతే వాసుదేవాయ, గోవింద్ దామోదర మాధవేతి, మేరో అల్లా,శ్రీ కృష్ణ మధురాష్టకం మొదలైన గీతాలు సుప్రసిద్ధం.అధరం మధురం, వదనం మధురం గీతం పరమాద్భుతం. హైదరాబాద్ కు - పండిట్ జీకి ఉన్న అనుబంధం చాలా ఆత్మీయమైంది. బాల్యమంతా ఎక్కువగా హైదరాబాద్ లోనే సాగింది. ఆ చిహ్నంగా, తండ్రి, సంగీత కళాకారుడు పండిట్ మోతీ రామ్ జీ స్మృతి చిహ్నంగా, ప్రతి సంవత్సరం హైదరాబాద్ లో, కార్తీకమాసంలో సంగీత సమారోహ్ నిర్వహించేవారు. చివరగా 2014 లో ఆంధ్రప్రదేశ్ లో,విశాఖపట్నంలో,శ్రీ కొప్పరపు కవుల కళా పీఠంవారి జాతీయ ప్రతిభా పురస్కారం అందుకున్నారు.ఆ సందర్భంగా జస్ రాజ్ మాట్లాడుతూ తెలుగు నా మాతృభాష అని చాటి చెప్పుకున్నారు. తెలుగురాష్ట్రాలు రెండుగా ఏర్పడినా, తెలుగువారంతా ఒక్కటే అని పండిట్ జస్ రాజ్ తెలుగునేలపై తనకున్న అనురాగాన్ని ఆవిష్కరించారు. నాదయోగి పండిట్ జస్ రాజ్ అవతారం సమాప్తమైంది. అనంత సంగీత లోకంలో, కాలంలో, ఆ నాదం వినిపిస్తూనే ఉంటుంది.జయహో! పండిట్ జీ.



# జ్ఞానపీఠ భరద్వాజ్

\- బుకర్

బడి విద్య కూడా దాటని ' భరద్వాజకు అత్యున్నత పురస్కారం..!!

"జ్ఞాన పీఠ " పురస్కారాన్ని అందుకున్న ఓ సామాన్యుడు ,!!

కొన్ని ఛీత్కారాలు... కొన్ని పురస్కారాలు!!

వీడెందుకు పనికొస్తాడని? "చాలా మంది ముఖం మీదే చెప్పారు.!!

భరద్వాజకు పిల్లనియ్యడానికి భయపడేవారట. చలం ప్రభావంతో "బూతు" రచనలు.. !!

జర్నలిస్టుగా నిలదొక్కు కొని,సాహితీ వేత్తగా.. పరిమళించాడు రావూరి భరద్వాజ.!!

ఓ గొప్ప వ్యక్తి మన కళ్ళముందే వుంటున్నా..

రోజూ మనతో మాట్లాడుతున్నా...ఆ వ్యక్తిలోని గొప్పతనాన్ని మనం గుర్తించం . అదే వ్యక్తికి

ఏదో ఓ రోజు ఒక 'గొప్ప పురస్కారం ' వచ్చింద

నుకోండి..ఇక ఆ మనిషికి బ్రహ్మ రథం పడతాం. ఆయన ఇంతోడు, అంతోడు అంటూ ..ఉన్నవీ,

లేనివీ కలిపి ఆకాశానికి ఎత్తేస్తాం.అది మనిషి

బలహీనత. లోకం తీరు కూడా.

రావూరి భరద్వాజ గారిది కూడా సరిగ్గా .ఇలాంటి పరిస్థితే. రచయితగా నవలలు,కథలు రాసినప్పుడు ఆయన్ను ఎవరూ.. అంతగా పట్టించుకోలేదు.కానీ..

జ్ఞానపీఠ ' పురస్కార ప్రకటన రాగానే ఆయనింటికి ' క్యూ 'కట్టారు..ఇది నా స్వానుభవంతో చెబుతున్న విషయం.ఎప్పుడూ నిర్మానుష్యంగా వుండే..ఆయన ఇల్లు (విజయనగర్ కాలనీ, హైదరాబాద్) ఆరోజు (జ్ఞానపీఠ్ ప్రకటన వెలువడిన రోజు) జన సంద్రంగా మారింది.పోలీసులు రంగంలోకి దిగి ట్రాఫిక్ కంట్రోల్ చేయాల్సిన పరిస్థితి తలెత్తింది. "వి ఐ పి 'లంతా (నేడు సుప్రీం కోర్టులో వున్న ఓ న్యాయమూర్తితో సహా) భరద్వాజ గారింటికి బారులు తీరారు. రోజూ చూసే భరద్వాజ గారిని... కాలనీ వాసులు ఆరోజు ప్రత్యేకంగా చూడటం, విశేష ప్రపంచం కూడా చాలా చిత్రమైంది? ఛీత్కరించిన చోటనే పురస్కారాల పంట పండింది. నువ్వు.. "పనికిరావు " పొమ్మన్న వాళ్ళే, ఆయన ఇంటర్వ్యూ కోసం పడిగాపులు పడ్డారు. నమ్మిన చోట నాప రాళ్ళు కూడా గుడిమెట్లవుతాయి.స్వయం కృషి వుంటే..." బడివిద్య " పూర్తి కాకున్నా అత్యున్నత మైన"జ్ఞానపీఠం " దక్కుతుంది. ఇదంతా. "రావూరి భరద్వాజ" గారి జీవితంలో జరిగింది.

ఎత్తుపల్లాలు,ఎగుడు దిగుడులు..జిల్లేళ్ళు,పల్లేర్లు సమంగా అనుభవించిన వాడు. ఓ సామాన్యుడు స్వయం కృషితో మాన్యుడిగా ఎదిగిన వైనాన్ని తెలుసుకోవాలంటే..."రావూరి భరద్వాజ "గారి జీవితంలోకి ఓ సారి తొంగి చూడాలి.!!

పగలంతా కూలి పని..రాత్రంతా పుస్తకం పఠనం. క్రమంగా పద్యాలు రాయడం మొదలు పెట్టాడు. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది.భరద్వాజకు అప్పటికి 17 సంవత్సరాలు తనకు 18 సంవత్సరాలని అబద్ధం చెప్పి సైన్యంలో చేరాడు. 1945 లోయుద్ధం ముగిశాక తిరిగి రోడ్డున పడ్డాడు.

1948లో నెల్లూరుకు చేరుకొని ఆచార్య రంగా సిఫార్సుతో జమీన్ రైతు వారపత్రికలో చేరాడు..

అప్పుడే అనేకమంది సాహితీ వేత్తలతో పరిచయాలు కలిగాయి.ఆత్రేయ 8 పేజీల పుస్తకాన్ని అచ్చువేస్తే..అందులో.."బక్కి డొక్క" అన్న చిన్న కవిత

రాశాడు భరద్వాజ.ఆతర్వాత దీనబంధు వారపత్రికలో చేరాడు.కులాంతర వివాహానికి సిద్ధమయ్యాడు. రోహిణీ అనే అనాథను పెళ్ళాడాలను కున్నాడు.

కానీ ఆ ప్రయత్నం నెరవేరలేదు.దీంతో నెల్లూరు వదిలేశాడు.

రోహిణిని మరిచిపోలేక తన " నీటి కలువలు..". "పంకజం.." కలియని బాటలు " అన్న కథల్లో రోహిణిని నాయికను చేశాడు.ఆ తర్వాత రోహిణి పేరుతో ఒక ప్రచురణ సంస్థను ప్రారంభించి ప్రేమ రుణం తీర్చుకున్నాడు..భరద్వాజ.!!

భరద్వాజకు పిల్లనియ్యడానికి భయపడేవారట. ఉద్యోగం లేదు..సద్యోగం లేదు పైగా నాస్తికుడు, పిల్లని తేవడానికి ఎవరూ ముందుకు రాలేదు. పెద్దల భరోసాపై మల్లయ్య తన రెండో కూతురు కాంతమ్మను యిచ్చి పెళ్ళి చేశారు.ఆ పెళ్ళికి ముని మాణిక్యం నరసింహారావు గారు కూడా వచ్చారట.

ఆ తర్వాత భరద్వాజ తెనాలికి చేరుకొని సినిమా, జ్యోతి, రేరాణి

పత్రికల్లో సహాయకుడిగా పనిచేశారు. ఆ తర్వాత సమీక్ష పత్రికలో చేరాడు.పిమ్మట మద్రాసు వెళ్ళి..చందమామ పత్రికలో చేరాడు.ఆ తర్వాత అభిసారిక, జ్యోతి,చిత్ర సీమల్లో పనిచేశారు.తర్వాత హైదరాబాద్‌కు వచ్చి యువ పత్రిక సంపాదక బాధ్యతలు చేపట్టాడు. ఆతర్వాత ఆకాశవాణిలో స్క్రిప్ట్ రైటర్‌గా ఉద్యోగం వచ్చింది.పిమ్మట తెలుగు ప్రసంగ కార్యక్రమాల ప్రయోక్తగా కేంద్ర సమాచార ప్రసారాల శాఖలో చేరారు భరద్వాజ, జర్నలిస్టుగా నిలదొక్కు కొని,సాహితీ వేత్తగా పరిమళించాడు.రవీంద్రుడు,చలం రచనల ప్రభావంతో ఎదిగాడు. అవార్డులు..రివార్డులూ వచ్చాయి.చివరకు విశ్వవిద్యాలయాల గౌరవ డాక్టరేట్ కూడా పొందాడు.

**రచనకు శ్రీకారం..!!**

17వ యేట నుంచి రచనా వ్యాసంగాన్ని ప్రారంభించారు భరద్వాజ.వివిధ సాహిత్య ప్రక్రియల్లో అనేక రచనలు చేశారు.ఇందులో కేవలం పొట్ట కూటికోసం చేసిన "అతి చెత్త " రచనలు కూడా వున్నాయి ఇష్టం వున్నా..లేకపోయినా .... ఆకలి, దరిద్రం నా చేత పనికిమాలిన రచనలు చేయించాయి. డబ్బుల కోసం డిటెక్టివ్ రచనలు చేశాను.అలాగే బూతు రచనలూ చేశాను." అంటూ.. ఎంతో నిజాయితీగా చెప్పారు భరద్వాజ.

**ఛీత్కారాలు..!!**

భరద్వాజ గారి జీవితంలో పురస్కారాల కంటే ఛీత్కారాలే ఎక్కువ వున్నాయి. తొలుత తన "తల్లిదండ్రుల" తో ప్రారంభమైన ఛీత్కారాలు, ఆ తర్వాత జీవితంలో అడుగడుగునా ఎదురయ్యాయి వీడెందుకు పనికొస్తాడని? " చాలా మంది ముఖం మీదే చెప్పారు.

కొందరు ఆయన వెనుక గుసగుసలాడారు. ఇవన్నీ భరద్వాజకు తెలుసు.తెలిసే వీటన్నిటిని ఆయన సహించారు, భరించారు.

1944 లో అనుకుంటా...ఓ రోజు భరద్వాజ వారి బంధువుల ఇంటికెళ్ళాడు. స్నానం చేయడానికి సబ్బు కావాలని అడిగాడు.అప్పటికి భరద్వాజ స్నానం చేసి రెండ్రోజులైంది.ఒళ్ళంతా ఒకటే గబ్బు. భరద్వాజ పరిస్థితిని చూసి వాళ్ళ బంధువులు ఏమనుకున్నారో ఏమో గానీ," వీడి మొఖానికి సబ్బు ఒక్కటే తక్కువైందా?అంటూ ఈసడించారు. దాంతో భరద్వాజ మనస్సు చివుక్కుమంది. నిరసనగా భరద్వాజ " సబ్బులేకుండానే స్నానం చేశాడు "...నిజానికిదొక్కటే కాదు..ఇలాంటి సంఘటనలు ఎన్నో? ఎన్నెన్నో భరద్వాజ గారి జీవితంలో తారసపడ్డాయి.!

చలం.గారి ప్రభావం..బూతు రచనలు..!!

గుడిపాటి వెంకట చలం గారి రచనలంటే భరద్వాజ గారికి ఎంతో ఇష్టం.నూనూగు మీసాల నూత్నయవ్వనంలో చలం ప్రభావంతో భరద్వాజ గారు పుంఖాను పుంఖాలుగా బూతు రచనలు చేశారు. చలం గారితో పరిచయం పెంచుకున్నారు.తొందరగానే వారిద్దరి మధ్య సాహితీ బంధం బలపడింది.

భరద్వాజ గారు రాసిన తొలి పుస్తకం "రాగిణి " (1950) కి చలం గారు ముందుమాట రాశారు. (అచ్చయిన ఆయన తొలి కథ మాత్రం " విమల 1946ఆగస్టు,ప్రజామిత్ర).

చలం గారి కథను తిప్పి పంపిన భరద్వాజ !!

భరద్వాజ గారు తెనాలిలో ఓ పత్రికలో పనిచేస్తున్నప్పుడు 'మన భరద్వాజ వున్నాడు కదా 'అని చలం గారు ఓ కథను ప్రచురణకోసం పంపారు.

అయితే చలం కథను తిరుగుటపాలోనే తిప్పి పంపారు భరద్వాజ.. చలంగారి కథలో వైవిధ్యం లేకపోవడమే అందుకు కారణం.తన కథను ప్రచురించకుండా తిప్పి పంపినందుకు చలం గారు ఏమాత్రం కోపగించు కోలేదట. పైగా..అప్పట్లో భరద్వాజ గారు తన రచనల్లో బూతుల్ని గుప్పించినా, "బాగా వుందయ్యా " భరద్వాజ అంటూ చలం గారు మెచ్చుకునే వారట.

భరద్వాజ గారు చలం సాహిత్యాన్ని విస్తృతంగా చదివారు. దాంతో చలం భావాలు, ఐడియాలజీ ఆయనకు బాగానే ఒంటబట్టాయి.ఓ దశలో చలం శైలిని అచ్చు గుద్దినట్లు అనుకరించారు భరద్వాజ. దీనివల్ల చలం గారి రచనలకు, భరద్వాజ రచనలకు మధ్య భేదం కనుక్కోవడం కూడా కష్టమయ్యేదట. అయితే ఆతర్వాత భరద్వాజ గారు క్రమంగా చలం ప్రభావం నుండి బయటపడ్డారు అది వేరేసంగతి.

**చలంగారిని విభేదించిన భరద్వాజ !!**

ఓ రకంగా చలంగారితో భరద్వాజ గారు 'డిఫర్ ' అయ్యారనే చెప్పొచ్చు.దీనికి ప్రధాన కారణం 'వేశ్యావృత్తిలో " స్వేచ్ఛ"ను గురించి చలం వర్ణించిన తీరుకు,లోకంలోని వాస్తవిక పరిస్థితికి మధ్య ఎంతో అంతరాయం వుందని భరద్వాజ గుర్తించారు.చలం గారి మాటలకు, లోకం పోకడలకు మధ్య ఏమాత్రం సామీప్యత లేదన్నది భరద్వాజ గారి అబ్జర్వేషన్. అప్పటి నుండే చలంగారి భావ జాలంతో ఎడంగా జరిగారు. భరద్వాజ. సెక్స్, బూతు వంటి భ్రమలు,బలహీనతల నుండి క్రమంగా బయ టపడి , సామాజిక స్పృహను అలవర్చుకొని గొప్ప రచనలు చేశారు

**పాకుడురాళ్ళు.!!**

భరద్వాజ గారు..అంతకు ముందు రాసిన 'పాలపుంత' కథనే తిరగరాసి "పాకుడు రాళ్ళు"

నవలగా మలిచారు.మద్రాసులో సినిమా కథలు రాస్తున్న సమయంలో ఓ సినీనటి(నవలా నాయిక మంజరి)తో పరిచయమవడం..ఆమె జీవితం లోని బాధలు..వెతలు వెరసి... పాకుడు రాళ్ళు "కథా వస్తువైంది.చలనచిత్ర పరిశ్రమ నేపథ్యంలో వెలువడిన తొలి తెలుగు నవల ఇదే కావడం విశేషం.

ఈ నవల నేపథ్యం సినిమారంగం.ఆడాళ్ళు అక్కడ నిలదొక్కొకొని పైకి రావాలంటే ఎన్ని కష్టాలు పడాలో...ఎంత శారీరక హింసకు గురి కావాలో కళ్ళకు కట్టినట్లు దృశ్యీకరించారు... భరద్వాజ గారు.

పాకుడు రాళ్ళు" (1965) నవలకు దేశంలో అత్యున్నత జ్ఞానపీఠ పురస్కారం (2012) లభించింది. సినీ రంగంలోని స్త్రీల కష్టాల్ని వున్నదున్నట్లుగా వర్ణించిన నవల ఇది. వాస్తవానికి చాలా దగ్గరగా రాశారు భరద్వాజ.

(1965లో కృష్ణాపత్రికలో ధారావాహికంగా వచ్చింది ) ఇందులోని నాయిక మంజరి పడిన కష్టాల కంటే...నిజ జీవితంలో భరద్వాజ గారు పడిన కష్టాలేం తక్కువకాదు.

ఉద్యోగాలకు తెలివి పెట్టుబడిలా, ఆడవాళ్ళకు శరీరం పెట్టుబడి కావడమే దౌర్భాగ్యం.ఈ నవలా నాయిక. మంగకు(సినీ పేరు మంజరి) నాటకాల వల్ల కనీస సంస్కారం, లోకం పోకడ కొంతయినా అబ్బింది. అదీ లేకపోతే.. తమ జీవితాలకు అంత మెక్కడో తెలీక, ఆ చీకటి బతుకుల, గతుకులబాటలో ..సతమతమై,పతనమైపోవడం మినహా మరో మార్గం లేదు.

ఎప్పుడో... అనామకంగా రాలిపోయే కాగితపు పువ్వు ఆమె జీవితం. దీనికి బాధ్యులెవరంటే... కొంత సమాజం మరికొంత ఆమె పుట్టుక, కర్మల కారణం అంటారు రచయిత.

ఆ సాలె గూళ్ళ నుండి బయటకు రాలేని పరిస్థితి . ఆమెది.. ఒకవేళ బయటపడినా.... పెనం మీంచి పొయ్యిలోపడ్డ తీరయ్యేది.

మంగమ్మ ఉరఫ్ మంజరి ప్రస్థానం ఈ నవలా ఇతివృత్తం. అందం, తెలివీ ఉండీ..,శరీరాన్ని వ్యాపార వస్తువుగా మార్చుకునే ఓ ఆడది చేసిన జీవన ప్రయాణం ఇది. ఆమె మగవాళ్ళను ద్వేషించ నక్కర లేదు. అలా ద్వేషిస్తే..అది వంచనే అవుతుంది.. మగాళ్ళను మెట్లలా వాడుకుని ఆమె అత్యంత ఉన్నత స్థానం చేరుకుంటుంది. ఈ ప్రయాణంలో ఆమెకు ప్రతీ ఒక్కరి మీద అపనమ్మకం, ఎత్తుకు పైయెత్తులు.

**వేసేది.డబ్బు తెచ్చే సుఖాలను అనుభవించేది..**

అందాన్ని, మనుషుల్నీ ఎరవేసి తన చుట్టూ కుక్కల్లా తిప్పుకునేది.ఇదంతా ఆమెకు ఓ ఆట. అయితే... తను ఒక స్థాయికి వచ్చాక గౌరవంగా స్థిరపడడం పెద్దసమస్యేం కాదు..అసాధ్యమూ కాదు. కానీ ఆమె సెలిబ్రిటీ జీవితం ఆమెకు వ్యసనం అయిపోతుంది. ఆమెలో ఎక్కడో మానవతా కోణం చూపిస్తూ, తన గత జీవితపు ఛాయలైన రామచంద్రం, రచయిత, వసంత, రాజామణి లను గౌరవించడం ఒక్కటే..

గుడ్డిలో మెల్ల. ఆమె ఫక్తు వ్యాపార ధోరణి అలవాటయిన ప్రముఖ సినీతార. తాడిని తన్నేవాడుంటేవాడి తల దన్నే వాడుంటాడన్నట్టు, ఈమె కన్నా తెలివైన వాళ్ళు ఈమెను పావుగా వాడుకుంటారు.

చివరకు...ఒక 'సి(నీ) తార అంతం.

తను లైబ్రరీలో చదువుకోడానికి ఆరోజుల్లో సంవత్స

ర చందా..3 రూపాయలు కట్టిన " లైబ్రేరియన్ కొల్లూరి వెంకటేశ్వర్లుకు పాకుడు రాళ్ళు నవలను అంకితమిచ్చి రుణం తీర్చుకున్నారు భరద్వాజ.జీవనసమరం, భరద్వాజ రాసిన సామాన్యుల బతుకులకు విశేషాదరణ లభించింది."దైవరాజకీయాలు " కథకు స్వర్ణ కంకణం లభించింది 1968,1983 సంవత్సరాల్లో సాహిత్య అకాడమీఅవార్డులు దక్కాయి.1987లో సోవియట్ ల్యాండ్ నెహ్రూ... అవార్డ్ ను అందుకున్నారు. మూడు విశ్వవిద్యాల యాలు గౌరవ డాక్టరేట్‌తో సన్మానించాయి. నాలుగు విశ్వవిద్యాలయాల్లో పిహెచ్‌డి స్థాయిపరిశోధనలు జరిగాయి.వీరి రచనలు ఇంగ్లీషు, హిందీ, తమిళ, మలయాళ తదితర భాషల్లోకి అనువాద మయ్యాయి.

పొట్టకూటికోసం ,వ్యవసాయ కూలీగా,పశువుల కాపరిగా,రంపం లాగే పనివాడిగా,తిత్తులూదే కూలీగా, పేపర్ బాయ్‌గా, చిన్న పత్రికల్లో ఉపసంపా దకుడిగా పనిచేశారు.ఆయన జీవిత పాఠశాలలో నేర్చుకున్నఅనుభవ సారాన్ని రచనల్లోరంగరించారు.కాబట్టే .." జ్ఞానపీఠ" పురస్కారానికి అర్హులయ్యారు.

**భరద్వాజ సాహిత్య దర్శనం..!!**

17నవలలు, 37కథా సంకలనాలు..47 బాలల కథలు, బాలలకోసం 6 చిన్ననవలలు.11సాహిత్య గ్రంథాలు,33 సైన్స్ కథలు, 3 వ్యాసం సంకలనాలు 8నాటకాలు ఆయన కలం నుంచి జాలువారాయి. భార్య మరణానంతరం రాసిన ఎలిజీ "నాలోని నువ్వు" ఇంకా చిన్న కథలు అవీ ఇవీ.. అన్నీ.కలుపు కుంటే సాహిత్య సాగరమే అవుతుంది.

పాకుడు రాళ్ళు నవల తర్వాత ...కాదంబరి, ఇదం జగత్.వేకువ లాంటి నవలల్ని ఒక ప్రత్యేక ప్రయోజ నాన్ని ఉద్దేశించి రాశారు.ఆ తర్వాత రచించిన ... "కరిమింగిన వెలగపండు " నవలపై వివిధ విశ్వ విద్యాలయాల్లో పరిశోధనలు జరిగాయి.1981 లో వచ్చిన జీవన సమరం రచన భరద్వాజకు మంచి పేరు తెచ్చిపెట్టింది. వ్యక్తిగతంగా ఆయనకు కూడా జీవన సమరం రచనంటే ఎంతో ఇష్టం

**కథలు...!!**

రావూరి భరద్వాజ అనేక కథలు రాశారు. ఒకదోమ కథ"... ఒక చీమ కథ." తేనీరు "కథానాయకుడు దొరికాడు".'పేదనిజం'.వాడే వీడు "..లాంటి కథలు ఆయనకు కథా రచయితగా గుర్తింపు తెచ్చిపెట్టాయ ప్రతీ గొప్ప వ్యక్తి వెనుక ఒక స్త్రీ వుంటుందన్న మాటలో ఎంత నిజముందో.. భరద్వాజ గారి సహధర్మచారిణి " కాంతమ్మ" గారిని చూస్తే.. తెలుస్తుంది."సహధర్మ చారిణి అనే భావనకు రూపం వస్తే..అది ' కాంతమ్మ' అవుతుందంటారు..భరద్వాజ మొదటి తల్లి పేరు ' లేమి '(దరిద్రం) .. నా రెండవ తల్లి పేరు "కాంతం'.అంటారు

భరద్వాజ సతీ వియోగంతో..ఆ పరమ శివుడు పడిన దుఃఖం ఎటువంటిదో తెలీదు కానీ...భరద్వాజ పడిన దుఃఖం అక్షరాలుగా ప్రవహించి,..5 స్మృతి (ఎలిజీ) రచనలుగా అవతరించాయి.1988 ఆగస్టు 1 న కాంతమ్మ గారు కాలం చేశారు.అప్పటి నుండి భరద్వాజ గారిడైరీలు కాంతమ్మ గారి స్మృతితో తడిసి ముద్దయ్యాయి.

నేనిప్పుడు సీతలేని రాముడ్ని..పార్వతి లేని శివుడ్ని.చుట్టూ ఎందరెందరున్నా..అందరి మధ్యా ఒంటరి వాడ్ని...అనేవారు భరద్వాజ. తనకు ప్రాణ ప్రదమైన "కాంతం "లేని "ఏకాంతం" లో కూడా కాంతాన్ని దర్శించడానికి నా దృష్టి భరద్వాజ.జ్ఞాన పీఠం పురస్కారం వచ్చినప్పుడు సంతోషం పెంచుకునేందుకు భార్య పక్కన లేకపోయిందని బాధపడేవారు..శోకంలో నుంచి శ్లోకం పుట్టినట్లు. ఆయన బాధలోంచి ..స్మృతి కావ్యాలు పుట్టాయి.

ఏకాంతంలో తన భార్య కాంతమ్మను తలుచు కుంటూ..రోజూ రాసుకున్న డైరీలే..ఈ స్మృతి

రచనలు.అవి...

1.నాలోని నువ్వు

2.అఃతరంగిణి

3.ఐతరేయం

4.అయినా ఒక ఏకాంతం

5.ఒకింత వేకువ కోసం.

ఇవన్నీ..స్మృతి కావ్యాలుగా ప్రసిద్ధికెక్కాయి.

భరద్వాజ గారు ప్రత్యేకంగా కవిత్వం రాయలేదు కానీ...ఆయన వాక్యాలు కవిత్వంలా మైమరపిస్తాయి.

నేనో వాన చినుకుగా మారి నీ చిన్నారి పెదవుల మీద వాలి పోదామనుకుంటున్నాను. నేనో వెన్నెల కిరణంగా మారి నీ చెక్కిలి మీంచి జారిపోయాననుకుం టున్నాను.

"నేనో పరిమళం తరంగాన్నయ్యి నిన్ను నిలువునా ఆవరించు కొందామనుకుంటున్నాను. ఇటువంటి రసాత్మక వాక్యాలు భరద్వాజ రచనల్లో కోకొల్లలు. ఈ వాక్యాల్ని చూస్తే..రవీంద్రుని గీతాంజలి లోని సౌందర్యోపాసనను భరద్వాజ గారు ఔపోసన పట్టారా? అనిపిస్తుంది. కొన్ని చోట్ల గీతాంజలిని పోలిన పంక్తుల్ని మక్కికి మక్కిలా వాడేశారు కూడా..

ఎక్కడ అన్నాను రాశులు ప్రక్కనే ఆకలి చావులుం దవో..

ఎక్కడ పసిపాపల చేతులు పనులను తాకవో..

ఎక్కడ పడుతుందని పిడికెడు మెతుకులు కోసం వ్యభిచరించదో..

వైద్యం డబ్బుకి కాక..జబ్బుకు లభిస్తుందో..

ఎక్కడ శుష్క వాగ్దానాలు హోరెత్తించవో..

రవీంద్రుని సౌందర్య పిపాసకు సామాజిక స్పృహ ను జోడించడం భరద్వాజ ప్రత్యేకత.

భరద్వాజ ఏమి రాసినా (చలం ప్రభావం నుంచి బయట పడ్డాక) సామాజిక స్పృహతోనే రాశారు. సమాజం లోని కష్టాలను, బాధల్ని అక్షరీకరించారు. నాణేనికి రెండో పక్క..!! కేవలం బూతే ... కాదు.." .నాణేనికి రెండో పక్కలా "తన రచనలకు సామాజిక స్పృహ కూడా వుందని భరద్వాజ గారు రుజువుచేశారు. చలం గారి 'మత్తు' ఒదిలే దాకా భరద్వాజ "బూతు" రచయితగానే వున్నారు. నిజానికి చలం ప్రభావంలో నుంచి బయ టకు రాకుండా వున్నట్లయితే... ఆయనబూతు రచయితగానే మిగిలిపోయే వారేమో? చలం గారి భావాలకు, సిద్ధాంతాలకు ఎడంగా జరగడంవల్లనే.. భరద్వాజ గారు "జ్ఞానపీఠం" దాకా చేరుకున్నారా? ఏమో.?

చివరగా...

భరద్వాజ పేదరికంలో మగ్గిపోయారు. జీవితంలో ఎదురు దెబ్బలు తిన్నారు.. భంగపడ్డాడు..అవమానాలు పాలయ్యారు.. అయినా...ఆత్మ విశ్వాసం కోల్పోకుండా.. ఎదురొడ్డి నిలిచారు..పడి లేచిన కెరటమయ్యారు..

స్వ సుఖం కంటే... లోకం ఆనందాన్ని కోరుకున్నారు.

ఆకలి, దరిద్రం, అజ్ఞానం, దోపిడి, ఇవి లేని సమాజం కావాలి. నేను సుఖపడ గలిగేది... సంతోషం. నా... చుట్టూ వున్నవారు సుఖపడితే.. కలిగేది ఆనందం." అంటారు భరద్వాజ. ఆయన తన సుఖంలోని సంతోషం కంటే.. తోటివారి సుఖం వల్ల తనకు కలిగే ఆనందమే మిన్న అనడం..

భరద్వాజ గారి వ్యక్తిత్వంలో మెచ్చు తునక. దుర్భర దారిద్ర్యంలో పుట్టినా. మనసున్న మారాజు భరద్వాజ. పుట్టెడు దుఃఖంలో మునిగినా..అందు లోనే ఆనందాన్ని వెతుక్కున్న మౌనముని !

# విజయ విహారం

– శారద

కార్యసాధనలో ఎదురైన ఆటంకాల కంటకాలను తొలగిస్తూ, అవరోధాల వారధులను దాటుతూ, ఆశయ శిఖరం చేరేవారిని వరించే కన్య పేరే విజయలక్ష్మి. ఆశయాన్ని స్వప్నిస్తూ, గాఢమైన కాంక్షతో నిరంతరం ప్రయత్నించేవారికే విజయకన్య దక్కుతుంది.

అనేకమంది విజేతల గాథలను పురాణాలు లిఖించాయి. కౌరవులను జయించిన పాండవులు, వాలి రావణాది రాక్షసులను వధించిన రాముడు, మహిషాసురుణ్ణి జయించిన కాళికామాత, నరకాసురుణ్ణి జయించిన సత్యభామలు తమ శక్తిసామర్థ్యాలతో విజేతలయ్యారు. సత్య నిష్ఠకై కష్ట నిష్ఠూరాలు భరించి విశ్వామిత్రుని పరీక్షలో నెగ్గిన హరిశ్చంద్రుడూ విజేతే.

"ప్రత్యర్థుల బలాలు, బలహీనతలను తెలుసుకుని ప్రణాళికతో దాడి చేస్తే విజయం తథ్యమన్న" కౌటిల్యుడి మాటల్ని నిజం చేసిన రాజులెందరో చరిత్ర గుర్తించింది. మలయా, సుమాత్రా, జావా దీవులను జయించి హిందూ ధర్మాన్ని రక్షించిన రాజేంద్ర చోళుడు, సముద్ర మార్గాన తూర్పు దిక్కులో పయనిస్తూ రాజులను జయించి విశాల సామ్రాజ్య మేర్పరిచిన కౌండిన్య, పాటలీపుత్రం రాజధానిగా కాబూలు నుండి కళింగము, హిమాలయాలు మొదలు దక్షిణాన్నేలిన అశోక చక్రవర్తి, దేశరక్షణకై బృహద్రథుణ్ణి వధించి, యవనులను తరిమికొట్టిన పుష్యమిత్రుడు, శుంగ శాతవాహన, యవనుల్ని ఓడించిన కళింగరాజు ఖారవేలుడు, నందులను జయించి మౌర్య సామ్రాజ్య స్థాపకుడైన చంద్రగుప్తుడు, శకులను జయించి విక్రమశకానికి నాంది పలికిన విక్రమాదిత్యుడు మున్నగువారు సాహస పరాక్రమాలతోనే కాకుండా సుపరిపాలనతో జనహృదయాలను దోచుకున్నారు.

"స్థిరమైన గమ్యం, ఖచ్చితమైన మార్గం, రాజీలేని ప్రయత్నాలే విజయాన్నందిస్తాయన్న" వివేకానందుని పలుకులకు తార్కాణాలుగా నిలిచిన వారున్నారు. స్వాతంత్ర్య సాధనకై మొక్కవోని స్థైర్యంతో పోరాడి సాధించిన మహాత్మాగాంధీ, అనేక సంస్థానాలను విలీనం చేస్తూ విశాల భారతాన్ని ఆవిష్కరించిన వల్లభాయి పటేల్ మున్నగువారు మేటి నేతలే కాక జన హృదయ విజేతలయ్యారు.

"మానవ శరీరమొక రథమనియు, బుద్ధి సారథియనియు, ఇంద్రియాలు అశ్వాలనియూ, వాటిని వశంలో ఉంచుకున్నప్పుడే సంసార సంగ్రామంలో జయం పొందుతారని" విదుర నీతి బోధించినట్టు భౌతిక విజయాలనే కాకుండా ఆధ్యాత్మిక విజయాలను కూడా సాధించాలి మానవులు. "జీవితం వడ్డించిన విస్తరి కాదని, కష్టాలు ఓర్చుకున్నప్పుడే లభించిన విజయానికి మూల్యం దక్కుతుందని " కవులు చెప్పినట్టు నిరంతరం శ్రమిస్తే తప్ప విజేతగా నిలవడం అసాధ్యం. అలాంటి విజయాలే అధిక ఆనందాన్నిస్తాయి.

"సంతృప్తి సాధనలో కాకుండా ప్రయత్నంలో ఉంటుందని, పూర్తి స్థాయిలో ప్రయత్నిస్తే సంపూర్ణ విజయం దక్కుతుందన్న" మహాత్ముని మాటల్ని ఆచరిస్తే విజయ శిఖరాలు చేరుకోవడం తథ్యం.

# అనుభూతి

శ్రీ

కథ చెప్పమ్మా, ఒక మంచి కథ చెప్పు...!

ఏం కథ చెప్పను....? ఏడు చేపల కథ.... పంచతంత్ర కథ .... చందమామ కథ.....?

ఊహు.. అవన్నీ ఎప్పుడో చెప్పేసావు, ఏదైనా కొత్త కథ చెప్పు...

కొత్త కథంటే....? ఊ.. సరే వినండి మరి....

✡✡✡

అనగనగా ఒక పాపాయి.

పొద్దున్నే డ్యూటీ ఎక్కిన సూర్యుడు ఇంకా నిద్దరోతున్న పాపాయిని చూసి, తను వచ్చినా ఇంకా ఈ చందమామ వెళ్లలేదేంటా అని అనుమానంగా గుచ్చి గుచ్చి చూసాడు.

వెచ్చగా తాకిన కిరణాలకి కళ్ళు నులుముకుంటూ లేచింది పాపాయి.

నిన్న రాత్రి పక్కలో పెట్టుకుని, గట్టిగా పట్టుకుని పడుకున్న కొబ్బరాకు బొమ్మని దగ్గరగా పొదువుకుని నవ్వుకుంది.

ఒక్కసారిగా ఏదో గుర్తొచ్చినట్టు పక్కకి చూసి, మంచం మీద నుండి దబ్బున దూకి అమ్మకోసం పరుగెత్తింది... తన కంటే ముందే తన కాలిమువ్వల శబ్దం తన సందడిని ఇల్లంతా నింపింది.

పూజ చేసుకుంటున్న బామ్మ చటుక్కున పాపాయిని పట్టుకు ముద్దాడి, నోటి నిండా పంచదార పోసింది. తీపి నిండిన నోటితో బామ్మ బుగ్గపై అంత కంటే తియ్యని ముద్దు పెట్టి కిలకిలా నవ్వింది పాపాయి.

వంటింట్లో నుండి వస్తున్న ఇడ్లీ వాసన మళ్ళీ అమ్మని గుర్తు తెచ్చింది.

సర్రున వంటిట్లోకి పరుగెత్తి గట్టిగా అమ్మ కాళ్ళని చుట్టుకుని చీరకొంగుని మొహంమీదేసుకుని ఆడుకుంది . కొంగు పక్కకి తీసిన అమ్మకి పాపాయి మొహం అచ్చం కొబ్బరాకుల్లో నుండి తొంగి చూసే చందమామల్లె అనిపించింది. తన కంటి కాటుక వేలితో తీసి, చెవి వెనుకగా దిష్టి చుక్క పెట్టి ముద్దాడింది అమ్మ.

అంతే... పాపాయి చారెడు కళ్ళు చుక్కల్లా మెరిసాయి....!

తూనీగలా పెరట్లోకి తుర్రుమంది.

మొక్కలకి పాదులు చేస్తున్న తాతతో నేను కూడా సాయం చేస్తానంటూ జత చేరి, ఆ గడ్డిలో కుందేలు పిల్లలా తిరిగింది పాపాయి.

ఇంతలో అనుకోకుండా తన చేతిపై ఓ రంగురంగుల సీతాకోకచిలుక.... పట్టుకోవాలని టక్కున చేయి చాపింది, అంతే..! అది పాపాయి చేతిపై రంగుల సంతకం చేసి రివ్వున ఎగిరిపోయింది.

అబ్బురంగా ఆ రంగులని చూస్తున్న పాపాయిని,



ఆలస్యమైపోతుందంటూ పెరట్లోకి తీసుకెళ్లి నలుగుపెట్టి లాల పోసింది అమ్మమ్మ. బొట్టు, కాటుక దిద్ది, జడ దువ్వి కృష్ణుడి పిలక వేసింది.

ఈలోగా అమ్మ వెండిగిన్నెలో పాలబువ్వ కలిపి పాపాయికి కొసరి కొసరి తినిపించింది.

అటుపై నాన్న సైకిల్ ముందు తన కోసమే పెట్టించిన బేబీ సీట్ మీద కూర్చొని బడికి బయల్దేరింది.... ఏనుగు అంబారీ ఎక్కిన బుల్లి యువరాణిలా నాన్నతో తెగ గారాలు పోయింది.

బడిలో పలక మీద అక్షరాలు దిద్ది, నోరారా పద్యాలు చదివింది.

సాయంత్రం ఇంటికి చేరీచేరటమే, నేస్తాలతో ఆటకి పరిగెత్తింది జింకపిల్లలా.

ఎందరు నేస్తాలు... ఎన్నెన్ని ఆటలు...

దాగుడు మూతలు, ఇసుకలో ఇళ్ళు...కోతికొమ్మచ్చిలు...

ఆనందంలో నిలబడనివ్వని కాళ్ళనే రెక్కలుగా చేసుకొని తూనీగలా తిరిగింది.

కాకెంగిలి చేసిన జామకాయలు, చిలుకలా కొరికి తింది.

పోకిరీ కోకిలతో పోటీకి 'కూ' అంటూ గొంతు కలిపింది.

నవ్వింది... తుళ్లింది...ఎగిరింది...

ఇంతలో నల్లని మబ్బులు కమ్మిన ఆకాశం చినుకు పూలవాన పోసింది పాపాయిపై..

ఆ మట్టి వాసన గుండెల నిండా పీలుస్తూ, ఈ వాన తన కోసమే పడుతుందన్నట్టుగా చేతులు చాపి తిరుగుతూ పురివిప్పిన నెమలిలా ఆడింది.

పనిగా అటువైపెళ్తున్న పెదమావయ్య వర్షంలో తడుస్తున్న పాపాయిని చూసి గబగబా తన తువ్వాలు కప్పి ఎత్తుకుని ఇంటికి తీసుకెళ్తుంటే, ఇంకా ఆట చాలని పాపాయి కళ్ళల్లో నుండి జారిన నీటి చుక్క ఆ వానలో కలిసిపోయింది.

ఇంతలో మెల్లగా తగ్గిపోయింది వాన!

సందెవేళకి గూడు చేరిన పిట్టల్లా, కాళ్ళు తపతపా కొట్టుకుంటూ ఇల్లు చేరిన పాపాయికి అమ్మ తల తుడిచి, పొడి బట్టలు మార్చి,వేడి వేడి అన్నం పెట్టి, చిన్ని బొజ్జకి 'శ్రీరామరక్ష' తీసి, కొంగుతో మూతి తుడిచింది.

వాకిట్లో మంచం వేసుకుని పడుకున్న తాత పక్కకి చేరి కథలు చెప్పమంటూ మారం మొదలెట్టింది .

తాత చెప్పే కథ వింటూ...ఊ కొడుతూ చెయ్యి చాపి వేలితో ఆకాశంలో చుక్కలు లెక్కపెడ్తూ అలసి సొలసి నిద్దర్లోకి జారుకుంది పాపాయి.

సాయంత్రం వర్షానికి కొబ్బరాకుపై నిలిచిన ఒక వాన చుక్క పాపాయి నుదుటిపైకి జారింది...

తన వెన్నెలంతా ఒక్క చిన్న నవ్వులో నింపుకుని, తనకంటే మెరిసిపోతున్న పాపాయికి, చందమామ పెట్టిన ముద్దు అది...!



'అంతే... అయిపోయింది కథ' అంటూ నవ్వుతూ పిల్లల వైపు చూసాను... వాళ్ళ కళ్ళలో సన్నటి నీటి పొర!

"ఆ పాపాయి ఎంత లక్కీ, అస్సలు బోర్ కొట్టదు తనకి", "అవును, తనకెంత మంది చుట్టాలు, ఫ్రెండ్స్ ఉన్నారో", "వాళ్ళ తాత వాళ్ళు కూడా సేమ్ హౌస్ లో ఉంటారు".... ఇలా సాగుతున్నాయి పిల్లల మాటలు.

గుండెలో కలుక్కుమంది నాకు...

ఇంక ఇప్పుడు ఎలా చెప్పాలి వీళ్ళకి ఆ లక్కీ పాపాయిని నేనే అని....?

ఇది నా బాల్యం... మన బాల్యం... ఇప్పటి పిల్లలకి కథగా, కలగా మిగిలిపోయే బాల్యమని....?

ఎక్కడో కొందరు మహాదృష్టవంతులైన పిల్లలకి తప్ప, వేరే పసివాళ్లకు ఈరోజుల్లో ఈ అదృష్టం ఎక్కడ దక్కుతుంది?

యూట్యూబ్ లు, లెక్కలేనన్ని ఛానెళ్ళు, టీవీ లు చిన్నప్పుడే అన్నీ చెప్పేస్తున్నాయి వీళ్ళకి...

ఇక అమాయకత్వపు ఆనవాళ్ళేవి...? పసితనం ప్రసక్తేది...?

ఇప్పటి పిల్లలు ఈ నాలుగు గోడల ప్రపంచంలో ఏ విషయమైనా టక్కున నేర్చుకుంటున్నారు.

కానీ జ్ఞానం పెరుగుతుంది తప్ప అనుభూతులు మిగలట్లేదు.

అందుకే వీళ్ళు బాధని చెప్పుకోలేరు... ఓటమిని ఒప్పుకోలేరు... పక్కవాళ్ళతో పంచుకోలేరు.... సమూహంలో ఒంటరయిపోతున్నారు!

మనం ఎంత గింజుకున్నా వీళ్లకి మనంత అందమైన బాల్యాన్నైతే ఇవ్వలేం

అందుకే కనీసం మనం ఇవ్వగలిగింది అయినా ఇద్దాం ...

బొమ్మలు, బిస్కట్లు,ఎక్స్-బాక్స్ లు, టీవీ లు, మాక్ బుక్స్, స్మార్ట్ ఫోన్స్

ఊహూ... ఇవేవి కాదు....

"సమయం"

అవును... మనం వాళ్ళతో గడిపే సమయం.....ఆ సమయం లోనుండి పుట్టే జ్ఞాపకాలు....

ఆ జ్ఞాపకాలు మన పసితనపు ఆనవాళ్లు ... తరం నుండి తరానికందే చేబదుళ్ళు....

అవి వాళ్ళు ఎదిగాక, తరచి తరచి చూసుకొని మురిసిపోయే మనసు పుస్తకాల్లో దాచుకునే నెమలీకలు

ఏ అనుభూతినైనా కెమెరా మెమోరీల్లోనే తప్ప, కుదురుగా మనసు పొరల్లోకెక్కించలేని చిందరవందర తొందర బ్రతుకులు మనవి.

మనలా ఎందుకు పరిగెడుతున్నామో తెలియని ఈ గందరగోళం లో వాళ్ళని కూడా ఇరికించొద్దు.

---

స్వామి అగ్నివేష్ సామాజిక కార్యకర్తగా అంతర్జాతీయ స్థాయిలో ఘనతకెక్కారు. ఈయన చిక్కోలు (శ్రీకాకుళం) వాసే. 1939లో తన తల్లిదండ్రుల మరణానంతరము తాతగారి స్వగ్రామము చత్తీస్ ఘడ్ వెళ్లిపోయారు. ఫిలాసఫీ, న్యాయవాద కోర్సులు చదివినప్పటికీ సామాజిక సమస్యలపై పోరాడేందుకే తన జీవితాన్ని అంకితం చేశారు. కొన్నాళ్ళు లెక్చరర్‌గా కలకత్తాలో పనిచేసారు. కొద్దికాలము లాయర్‌గా ప్రాక్టీష్ చేసారు. తాను చదివిన చదువుకు పరమార్ధం చేకూర్చే ఉద్దేశంతో సామాజిక సమస్యల పరిష్కారానికి విశేష కృషి జరుపుతున్నారు. హర్యానా రాష్ట్రంలో శాసనసభ్యుడుగా ఎన్నికై విద్యామంత్రిగా సైతం పనిచేసారు.అన్నాహజారే చేపట్టిన ఉద్యమంలో స్వామి అగ్నివేష్ పాలుపందుకున్నారు. 2018లో అటల్ బీహారీ వాజ్ పేయికి నివాళి అర్పించడానికి వెళ్తుండగా మార్గమధ్యంలో అగ్నివేష్ పై దాడి జరిగింది.



పర్యావరణ సమస్యలు, బాలలవెట్టిచాకిరిపై పోరాటం, ప్రాంతీయ ఉద్యమాలు తదితర అంశాలపై ఆయన తనదైన శైలిలో ఉద్యమిస్తూ ప్రజలను చైతన్యవంతులను చేస్తున్నారు. ఇటీవల సోంపేటలో థర్మల్ విద్యుత్ కేంద్రం నిర్మాణానికి వ్యతిరేకంగా ఉద్యమం చేస్తున్నవారికి తన మద్దతు ప్రకటించారు. ఆయన "World council of Arya Samaj" కు అధ్యక్షుడిగా ఉన్నారు. అనారోగ్య కారణంగా డిల్లీలోని ఎయిమ్స్‌లో చికిత్స పొందారు, లివర్ సిరోసిస్‌తో బాధపడుతున్న స్వామి అగ్నివేష్, మంగళవారం రోజు నుండి వెంటిలేటర్ పైనే ఉన్నారు. ఇతర సమస్యలు కూడా తోడవడంతో ఇక పోరాటం చేయలేక దేహం వదిలారు. 11సెప్టెంబర్ 2020సాయంత్రం స్వర్గస్తులైనారు.

- ప్రజామీడియా సౌజన్యంతో

# బెంగాల్‌లో కరోనా రాజకీయాలు

- కె.చంద్రశేఖర్






**కో**విడ్‌ను ఎదుర్కోవడంలో ఒక్కో రాష్ట్రం ఒక్కో రీతిగా వ్యవహరిస్తోంది. అధ్వాన్నంగా వ్యవహరించినవాటిలో బెంగాల్ ఒకటి. గమనిస్తే మెట్రోలున్న రాష్ట్రాలన్నిటిలో యీ సమస్య తీవ్రంగా వుంది. ఆ తర్వాత పెద్ద నగరాలున్న రాష్ట్రాలలోనూ వ్యాధి వ్యాపిస్తోంది. దీనికంతా కారణం ఆ నగరాలలోని మురికివాడలు. మామూలుగానే అక్కడుండేవారు ఆరోగ్యకరమైన, పరిశుభ్రమైన పరిస్థితుల్లో నివసించడం అసాధ్యం. లాక్‌డౌన్ రోజులో ఇరవై నాలుగు గంటలూ వారిని ఆ వాడల్లోనే వుంచేయడంతో వారు సులభంగా జబ్బు పడ్డారు. తాము మసలిన చోటల్లా ఆ వ్యాధిని యితరులకు అంటించారు.

కలకత్తా నగరంలో మురికివాడలు ఎక్కడున్నాయా అని వెతకనక్కరలేదు. అసలే ఊరే ఓ పెద్ద మురికివాడలా తోస్తుంది, హౌరా రైల్వే స్టేషన్‌లో దిగి కొన్ని మైళ్లు ప్రయాణించేటప్పటికి! కొన్ని ప్రాంతాలు మాత్రం బాగుంటాయి. మొదటిసారి ఆ వూరు వెళ్లినవాళ్లకు ప్రధాన రహదారుల్లో పేవ్‌మెంట్ల మీద కాపురం వుండే పేదలను చూసి మతి పోతుంది. బస్సుల్లో, ట్రాముల్లో, లోకల్ రైళ్లలో కిక్కిరిసి వెళ్లే జనాలను చూస్తే కళ్లు తిరుగుతాయి. ఎక్కడ చూసినా జనమే. ఎవరికీ పరిశుభ్రత ఉన్నట్లు తోచదు. చాలా పెద్ద హోటళ్లు తప్ప, ఓ పాటి ఉడుపి హోటల్ లాటిది కనబడదు. జనమంతా రోడ్ల పక్కన నిరభ్యంతరంగా తినేస్తూ వుంటారు.

ఇలాటి ఊరులో కోవిడ్ వంటి భయంకరమైన అంటువ్యాధి ఎంతటి ప్రభావం చూపుతుందో ఎవరైనా ఊహించవచ్చు. వ్యాధి ప్రకోపం చూశాకైనా పౌరులు క్రమశిక్షణగా వుండి, జాగ్రత్త పడితే పరిస్థితి కొంత బాగుపడేది. కానీ బెంగాల్‌లో లేనిదే క్రమశిక్షణ. ముంబయిలో బస్సు ఎక్కేటప్పుడు క్యూ పాటిస్తారు, కలకత్తాలో అలాటి ప్రశ్నే ఉదయించదు. ప్రజలు ఎవరి మాటా వినరు. ప్రభుత్వోద్యోగులలో బద్ధకం, నిర్లక్ష్యం ఎక్కువ. కలకత్తా మెట్రో ఒక్కటే అన్ని రకాలుగానూ మినహాయింపు. ఏదైనా సరే పద్ధతి ప్రకారం వుండడమనేది, కలకత్తాలో అరుదుగా జరుగుతుంది. అందుకే ఒకప్పుడు దేశరాజధానిగా, పారిశ్రామిక రాజధానిగా వున్న కలకత్తా క్రమేపీ కళ తప్పింది.

ప్రభుత్వాధినేతగా ఎవరున్నా సరే, కలకత్తాలో ఏదైనా సాధించడమంటే ఏటికి ఎదురీదడం లాటిదే. నిన్న సిపిఎం ఉన్నా, ఈ రోజు తృణమూల్ ఉన్నా, రేపు బిజెపి ఉన్నా పరిస్థితుల్లో మార్పు రావడం చాలా కష్టం. ఎందుకంటే కలకత్తాలో ఉండేది బెంగాలీలు మాత్రమే కాదు. చుట్టు ప్రక్కల రాష్ట్రాలలోని పేదలందరూ అక్కడికే వచ్చి చేరతారు. ఎలాగోలా బతకడానికి తంటాలు పడుతూ, పరిస్థితులను అతలాకుతలం చేస్తారు. సింపుల్‌గా చెప్పాలంటే సిటీ ఈజ్ అన్‌మేనేజబుల్!

దీనికి తోడు ప్రస్తుతం పరిపాలన చేస్తున్నది మమతా బెనర్జీ! అసలే తిక్క మనిషి, వైఫల్యాలు ఒప్పుకునే రకం కాదు. పైగా గత కొద్దికాలంగా బిజెపి కారణంగా రాజకీయ అనిశ్చితి ఎదుర్కొంటోంది.

వాళ్లు ప్రతీదానికీ గొడవ చేస్తున్నారు, గవర్నరు ద్వారా యిబ్బంది పెడుతున్నారు. ఈమె కూడా మొరటుగా వాళ్లను ఎదుర్కుంటూ వస్తోంది. ఇలాటి టైములో యీ అంటువ్యాధి వచ్చిపడింది.

ఇక బిజెపి. 2019లో పార్లమెంటు ఎన్నికలలో 40 శాతం ఓట్లు, 42 లోకసభ స్థానాలకు 18 సీట్లు గెలుచుకుంది. (అసెంబ్లీ నియోజకవర్గాలుగా తర్జుమా చేస్తే 120) గెలిచి 2021 అసెంబ్లీ ఎన్నికలకు ఉవ్విళ్లూరుతోంది. 'ఎయ్ బార్ బంగాల్' (ఈసారి బెంగాల్) అనే రణన్నినాదం యిచ్చి మమతను అనునిత్యం దుయ్యబడుతోంది. పార్లమెంటు ఎన్నికల ఫలితాల తర్వాత ఒకళ్లిద్దరు తృణమూల్ నాయకులు తమవైపు ఫిరాయించడంతో, ఇంకేముంది తృణమూల్ ఖాళీ అయిపోతోంది, అంతా మా పక్కకు వచ్చేస్తున్నారని ఆశ పెట్టుకుని ఆ మేరకు ప్రకటించేసింది.

తీరా చూస్తే ఎవరూ రాలేదు. తృణమూల్‌లో యిప్పటికీ 24 ఎంపీలు, 215 మంది ఎమ్మెల్యేలు ఉన్నారు. కోవిడ్, ఏంఫన్ తుపాను ఎదుర్కోవడంలో పార్టీ అప్రదిష్ఠపాలైన తర్వాత కూడా యిప్పటివరకు ఒకళ్లిద్దరు మంత్రులు సాటి మంత్రుల గురించి వ్యతిరేకంగా మాట్లాడాడు తప్ప. తక్కినవాళ్లు బిజెపివైపు గెంతుకుంటూ రాలేదు. పైగా సిఏఏ, ఎన్‌పిఆర్ విషయంలో బిజెపి తీసుకున్న మతపరమైన విభజన స్టాండ్ బెంగాలీలను మెప్పించలేదు. ఆ విషయంలో మమత బిజెపిపై పైచేయి సాధించిందనే చెప్పాలి. అందువలన కాస్త క్రుంగుబాటులో వున్న బిజెపికి కోవిడ్ భలేగా పనికి వచ్చింది. దానికి తోడుగా తుపాను కూడా వచ్చి రాష్ట్రమంతా అల్లకల్లోలం కావడంతో రాబోయే అసెంబ్లీ ఎన్నికలలో విజయం తమదే అనే ధీమాలో ఉన్నారు.

కోవిడ్ విషయంలో మమత తొలి నుంచీ మూర్ఖంగా, మొండిగా వ్యవహరించింది. వ్యాధి తీవ్రతను గుర్తించకపోవడం, టెస్టులు చేయించకపోవడం, అంకెలు దాచిపెట్టడం, లాక్‌డౌన్ సమయంలో కొన్ని దుకాణాలు తెరిపించడం.. యిలా చాలా తప్పులు చేసింది. బిజెపి వాటిని ఎత్తి చూపించినకొద్దీ ఉక్రోషంతో మరీమరీ పొరపాట్లు చేసింది. తాము పాలిస్తున్న రాష్ట్రాలలో కూడా కోవిడ్ అదుపులోకి రావటం లేదని తెలిసినా బిజెపి బెంగాల్‌పై ప్రత్యేకదృష్టి పెట్టి మమతను అల్లరిపాలు చేయాలని చూసింది. సెంట్రల్ టీమ్స్‌ను పంపి వారి చేత వ్యాఖ్యలు చేయించింది. ప్రతిగా మమత వారిని నిరాదరించి, సలహాలు నిరాకరించి వ్యాధి మరింత ముదరడానికి కారకురాలైంది.

మామూలుగానే ప్రభుత్వాసుపత్రుల నిర్వహణ అధ్వాన్నంగా వుంటుంది. అపరిశుభ్రంగా బతికే అసంఖ్యాక పేద పౌరులున్న కలకత్తా లాటి నగరంలో యింకెలా వుంటుందో ఊహించుకోవచ్చు. అక్కడి ప్రజలు ఎప్పుడూ చూసినా ఫ్రస్ట్రేషన్‌తో ఎవర్ని పట్టుకుని కొడదామా అని చూస్తూంటారు. ప్రతిభావంతులు, నిజాయితీపరులు అయిన డాక్టర్లు దెబ్బలు తిన్న సందర్భాలు అనేకం. కరోనా సమయంలో మన దగ్గరే ప్రభుత్వడాక్టర్లు దెబ్బలు తింటున్నారు. ఇక అక్కడ వేరే చెప్పాలా? రోగం వచ్చినవారు ప్రభుత్వాసుపత్రులకు వెళ్లడమంటే నరకానికి వెళ్లినట్లే. ప్రయివేటు ఆసుపత్రులు, చేసిందేమీ లేకపోయినా దోచేశాయి. హైదరాబాదులోనే అలాటి కేసులు వింటున్నాం. అందువలన తప్పులన్నీ మమత నెత్తిన రుద్దడం భావ్యం కాదు.

మమత లాక్‌డౌన్ సరిగ్గా అమలు చేయించలేదనే వాదనా కరక్టు కాదు, కలకత్తాలోచాలా ఏరియాల్లో పకడ్బందీగా అమలైంది. పేదలున్న కొన్ని ప్రాంతాలలో అమలు కాకపోయి వుండవచ్చు. హైదరాబాదులో మాత్రం అన్నిచోట్లా ఒకేలా అమలైందా? ప్రజలకు ఆ స్పృహ ఉండాలి. పోలీసులు ఎంతకని చూడగలరు? సడలింపు యివ్వగానే చేపల దుకాణాలు తెరిపించిందని, పాన్‌షాపులు తెరిపించిందని చాలామంది విరుచుకు పడ్డారు. మన దగ్గర మాత్రం మాంసం దుకాణాలకు అనుమతించినప్పుడు ప్రజలు తిరణాళ్లలా వెళ్లి సామాజికదూరం పాటించకుండా ఒకరి మీద మరొకరు పడిపోలేదా? చేప లేకపోతే బెంగాలీ ముద్ద ముట్టడు. మందు షాపులు తెరిచినప్పుడు? మనకు మందు ఎలాగో వాళ్లకు పాన్ అలాగ! ఒక స్థాయికి మించి ప్రజలను ఏ ముఖ్యమంత్రీ అదుపు చేయలేడు.

కోవిడ్ విషయంలోనే పడుతూలేస్తూ వుంటే వలస కార్మికులను తిరిగి తెప్పించే సమస్య వచ్చింది. బెంగాల్‌లో పొట్ట గడవక, చాలామంది ముంబయి వంటి అనేక ప్రాంతాలకు వలస పోయారు. శ్రామిక రైళ్లు వేశాక, వాళ్లంతా తిరిగి రాసాగారు. బెంగాల్ వాళ్లే కాదు, ఈశాన్య రాష్ట్రాలవారందరికీ కూడా బెంగాల్‌యే ముఖద్వారం. వాళ్లంతా తిరిగి వస్తే, అసలే అధ్వాన్నంగా వున్న బెంగాల్ పరిస్థితి మరింత చెడుతుందని భయపడిన మమత ఆ రైళ్లను అడ్డుకుందామని చూసి మరింత చెడ్డపేరు తెచ్చుకుంది. 'వాటిని కరోనా ఎక్స్‌ప్రెస్‌లుగా స్థానికులు భావిస్తున్నారు' అనడంతో బిజెపి యాగీ చేసింది. మొత్తానికి వాళ్లు రానూ వచ్చారు. కేసులూ పెరిగాయి.

ఏది ఏమైనా క్వారంటైన్‌ల నిర్వహణలో కూడా బెంగాల్ ప్రభుత్వానికి చాలానే చెడ్డపేరు వచ్చింది. ఇలాటి పరిస్థితిలో భీకరాతి భీకరమైన ఏంఫన్ తుపాను వచ్చి నిరాశ్రయులు మరింతమంది పెరిగారు. లాక్‌డౌన్ సడలించి రాకపోకలు అనుమతించాక సమస్య మరింత జటిలమైంది. ఎందుకంటే కలకత్తా జనాభా సొంత వాహనాలు ఉపయోగించడం అరుదు. అందరూ పబ్లిక్ ట్రాన్స్‌పోర్ట్‌యే వాడతారు. కలకత్తాలో పనిచేసే వారిలో చాలామంది పక్క ఊళ్లలో వుంటూ బస్సుల్లో, రైళ్లల్లో వస్తూ వుంటారు. వాటిని మొదట్లో నిలిపివేసి, తర్వాత కొద్దిగా అనుమతించడంతో ఆఫీసులకు రావలసినవారు వాటిలో కిక్కిరిసి వస్తున్నారు. సామాజికదూరం అవలంబించడం అసాధ్యమై పోయింది.

రాష్ట్రం యిలా సతమతమవుతూండగానే బిజెపి మాత్రం రాజకీయ పోరాటం ప్రారంభించేసింది. పది నెలల్లో రాబోయే అసెంబ్లీ ఎన్నికల కోసం అమిత్ షా "పరివర్తన్" పేర 'వర్చువల్ ర్యాలీ' ప్రారంభించి బిజెపి కార్యకర్తలతో సంభాషించారు. దీనికై రాష్ట్రమంతా 70 వేల టివిలు ఏర్పాటు చేయడంతో యీ కష్టకాలంలో యీ హంగామా కావాలా? అనే విమర్శ వచ్చింది. "ఇది రాజకీయాలు చేసే సమయమా? మమతను గద్దె దింపండి అనే ఉద్యమం యిప్పుడు అవసరమా? మోదీని దింపేయండి అని నేనేమైనా అడుగుతున్నానా? దేశమంతా కలిసికట్టుగా మహమ్మారిని ఎదుర్కోవాలి కానీ యిదేమిటి?" అంటూ మమత ధర్మపన్నాలు చెపుతోంది.

# జాగ్రత్తగా ఉందాం

- కె.జయకుమార్




శాస్త్రీయంగా రోగ నిరోధకశక్తిని పెంచుకోడానికి మందులేమి లేవనే ఎక్కువమంది వైద్యులు అంటున్నారు. ఆరోగ్యానికి- మనసుకూ ఎంతో సంబంధం ఉందనీ శాస్త్రవేత్తలు చెబుతున్నారు. అలవాట్లు భౌతికమైనవి, ఆలోచనలు మానసికమైనవి. ఈ రెండింటినీ సక్రమ మార్గంలో నడుపుకుంటే చాలా రోగాలు దరిచేరవని నిపుణుల అభిప్రాయం. ఈ కరోనా కాలంలో, వీటిపై దృష్టి పెట్టడం తప్పనిసరి అని భావించాలి. కరోనా మరణాల తీరును విశ్లేషించుకుని ముందుకు సాగాల్సిన తరుణంలో మనం ఉన్నాం. సరియైన సమయంలో కరోనాను గుర్తించకపోవడం, గుర్తించినా వైద్యాన్ని అశ్రద్ధ చేయడం, కొన్ని వైద్యశాలల్లో వైద్య సౌకర్యాలు, చికిత్సా విధానాలు బాగా లేకపోవడం, సోకినవారికి అప్పటికే దీర్ఘకాలిక వ్యాధులు తీవ్ర స్థాయిలో ఉండడం, వీటన్నింటికి తోడు భయం, కంగారు, ఆందోళనలు మొదలైనవి కరోనా మరణాలకు కారణమవుతున్నాయి. ఇంకొక పక్క సామాన్యులు ప్రైవేట్ వైద్యాన్ని భరించే పరిస్థితులు లేనేలేవు. కరోనా మరణాలపై ప్రభుత్వాలు, నిపుణులు విశ్లేషణ చేపట్టాలి. ఏ ఏ కారణాలతో మరణాలు సంభవిస్తున్నాయో ప్రజలకు వివరించి మార్గదర్శనం చెయ్యాలి. సంబంధిత శాఖలను సత్ఫలితాల దిశగా నడిపించాలి. అందరినీ అప్రమత్తం చెయ్యాలి. ఇది ప్రభుత్వాల బాధ్యత. వైరస్ సోకకుండా చూసుకోవడంలో కొంతమంది అశ్రద్ధగా ఉంటున్నారని పరిశీలకుల భావన. మాస్కులు ధరించడం, భౌతిక దూరం పాటించడం, శానిటైజెర్లు వాడడంతో పాటు, స్వయం నియంత్రణ కూడా ముఖ్యం. మన మీద పర్యవేక్షణ లేదని, మునుపటిలాగా ప్రవర్తించేవారి సంఖ్య కూడా ఎక్కువగానే ఉంది. అత్యవసర వస్తువులు, సరుకులు తప్ప, అవసరంలేని వాటి పట్ల ఆకర్షణ తగ్గించుకోవడం చాలా ముఖ్యం. ఈ కామర్స్, కొరియర్, షాపింగ్, ప్రయాణాలకు దూరంగా ఉండడమే క్షేమం. వ్యాక్సిన్లు వచ్చేంత వరకూ జాగ్రత్తలు పాటించడం తప్పదు. ఆహారం, అలవాట్ల ద్వారా రోగ నిరోధక శక్తిని పెంచుకోవడం మనం తక్షణమే తీసుకోవాల్సిన జాగ్రత్తల్లో భాగంగానే భావించాలి. 8 గంటల పాటు నిద్ర పోవడం ద్వారా రోగ నిరోధక శక్తి పెరుగుతుంది. శరీరానికి, మనసుకు, బ్రెయిన్ కు తగినంత విశ్రాంతి తప్పకుండా కావాలి. అది నిద్ర ద్వారానే లభిస్తుంది. అది మానసిక, శారీరక శక్తులను పెంచుతుంది. ధ్యానం, యోగ, ప్రాణాయామం, సంగీత వినడం, పుస్తకాలు చదవడం ఇవ్వన్నీ ఒత్తిడిని తగ్గిస్తూ, శక్తిని పెంచేవే. పోషకాలు ఎక్కువగా ఉండే ఆహారాన్ని తీసుకోవడం, సమతుల్యత, సంపూర్ణత్వం కలిగిన ఆహార నియమాలను పాటిస్తే శక్తి సహజంగా పెరుగుతుంది. వ్యాయామం, శారీరక శ్రమ ద్వారా కూడా రోగ నిరోధక శక్తి బాగా వృద్ధి చెందుతుంది. ఇవన్నీ సహజ సిద్ధమైన మార్గాలని వైద్యులు ఎప్పటి నుండో చెబుతున్నారు. మనసు, శరీరాన్ని శక్తివంతంగా మలచుకొని, రోగ నిరోధక శక్తిని పెంచుకోవడం మన చేతుల్లోనే ఉంది. మన చేతిలో, మన పరిధిలో ఉన్న జాగ్రత్తలు పాటిస్తే, చాలా వరకూ కరోనా వైరస్‌ను ఎదుర్కోగలుగుతాం. మరణాలను అధిగమిస్తాం. ఈ కరోనా సమయంలోనే చాపకింద నీరులాగా స్వైన్ ఫ్లూ కూడా వ్యాపిస్తోందనే వార్తలు గుప్పుమంటున్నాయి. కర్ణాటక, తెలంగాణలో నమోదవుతున్నట్లుగా తెలుస్తోంది. ఈ వైరస్ తుమ్ము, దగ్గు ద్వారా వ్యాపిస్తుంది. కరోనా-స్వైన్ ఫ్లూ లక్షణాలు కొంచెం అటుఇటుగా ఒకేరకంగా ఉంటాయి. జ్వరం, దగ్గు, గొంతు నొప్పి, ఒళ్ళునొప్పి మొదలైనవి స్వైన్ ఫ్లూ లక్షణాలు. కోవిడ్ పరీక్షలతో పాటు, ఇన్ఫ్లుయంజా పరీక్షలు కూడా నిర్వహించడం ముఖ్యం. కరోనా కోసం ఏ జాగ్రత్తలు పాటిస్తున్నామో, స్వైన్ ఫ్లూ కూడా అవే జాగ్రత్తలు పాటిస్తే సరిపోతుందని నిపుణులు సూచిస్తున్నారు. వాక్సిన్లు అందుబాటులోకి వచ్చి, కరోనా కట్టడి అయ్యేంతవరకూ మన పరిధిలో ఉన్న జాగ్రత్తలు మనం పాటించడమే ఏకైక మార్గం.

# కవితా గంగాధరుని శతవసంతం

- యన్. భాను, సీనియర్ జర్నలిస్ట్

దేవరకొండ బాలగంగాధర తిలక్ శత వసంత కాలమిది. ఆగష్టు 1వ తేదీ,1921లో జన్మించారు. ఈ కవి తిలకుని వందవ పుట్టినరోజు ఇది. అమృతం కురిపించిన, ఖడ్గం ఝుళిపించిన, కన్నీళ్లు కార్పించిన ప్రజాకవి. వయస్సు సగం తీరకముందే, నలభై ఐదవ ఏట,1966లో అంతరించాడు. అంతములేని కవితామృతం అందరికీ పంచాడు. తిలక్ ను ఇష్టపడని భావుకుడు ఉండడు. తిలక్ కవిత్వం దాటకుండా ముందుకు వెళ్లిన అభ్యుదయ ప్రేమికుడు ఉండడు. విశ్వనాథ, శ్రీ శ్రీ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, తిలక్.. ఈ నలుగురు ఆధునిక శక కవితా సౌధానికి నాలుగు స్థంభాలు. నాల్గు కవితా పయోనిధులు. కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ,విశ్వనాథ కలిస్తే తిలక్ అవుతాడు. వీరందరి కవితా, కథన శిల్పాలు, అక్షర గవాక్షాలు తిలక్ లో ఉన్నాయి. వీరందరినీ నింపుకుంటూనే, తన మార్గంలో, తన మానాన తాను వెళ్ళాడు. శ్రీ శ్రీ ని అనుకరించవచ్చు. కృష్ణశాస్త్రిని అనుసరించవచ్చు. తిలక్ ను అనుసరించడం, అనుకరించడం, అధిగమించడం అసాధ్యం. కృష్ణశాస్త్రి,శ్రీశ్రీ తిలక్ ను కొంతకాలం వెంటాడారు. తిలక్ వీళ్లందరినీ వెంటాడాడు ప్రేమతో, పరిమళంతో, కరుణతో..... తిలక్ భావకవుల్లో అభ్యుదయకవి, అభ్యుదయ కవుల్లో భావకవి. ఇతనిలో కవి, కథకుడు ఇద్దరూ దాగి ఉన్నారు. ఊగి ఉన్నారు. “అమృతం కురిసిన రాత్రి” ఒక జలపాతం. “నల్లజర్ల రోడ్డు” కథాలోకంలో ఒక ఆరని దీపం. తిలక్ అక్షరాలు కన్నీటి జడులలో తడిసేదయా పారావతాలు, ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు,వెన్నెల్లో ఆడుకునే అందమైన ఆడపిల్లలు. కరుణ,విప్లవం,రసికత మూడు కలగలిసిన అభ్యుదయ భావుకుడు తిలక్. రోడ్డు మీద తారసిల్లే బిచ్చగాళ్ళు,దగాపడ్డ తమ్ముళ్లు,పడుపుగత్తెలు, ఆనాధలు,అభాగ్యులు, చీకటి లోకపు చక్రవర్తులు తిలక్ కవిత్వంలో విలపిస్తారు, వీరిలో ఒక్కొక్కరు గొంతెత్తి అరుస్తారు, కన్నీళ్లతో పిలుస్తారు, కోరలు చాచి హుంకరిస్తారు,కోక చాచి కవ్విస్తారు. తిలక్ కవితాభూమిలో, గాజుకెరటాల వెన్నెల సముద్రాలూ, జాజిపువ్వుల అత్తరు దీపాలు, మంత్రలోకపు మణిస్థంభాలు, సుందర చిత్ర విచిత్రాలు ఉంటాయి. కవిత్వం ఒక ఆల్కెమీ, దాని రహస్యం తిలక్ కే తెలుసు. “అమృతం కురిసిన రాత్రి” కవితా సంకలనం జగత్ ప్రసిద్ధం. ఈ కవితాసతిని ఎందరో ప్రేమించారు. తిలక్ మరణించిన తర్వాత కుందుర్తి ఆంజనేయులు పీఠికతో, 1968లో ఈ సంకలనం ముద్రణ పొందింది. 1971లో ఉత్తమ కవితా సంపుటిగా కేంద్ర సాహిత్య



అకాడెమి అవార్డు పొందింది. ఇంత అమృతమైన కవిత్వాన్ని అందించిన తిలక్ ఇది అందుకోకుండానే 1966లోనే అస్తమించాడు. వయస్సు సగం తీరకముందే అంతరించిన ప్రజాకవి.... నభస్సు సగం చేరకముందే అస్తమించిన ప్రభారవి... అంటూ శ్రీశ్రీ గుండెలు బాదుకున్నాడు. తను రాసిన ఒక కవితా శీర్షిక “ప్రభాతము-సంధ్య”కు తగ్గట్టుగా, తక్కువ సమయంలోనే ప్రభవించాడు.టక్కున సంధ్యలో కలిసి పోయాడు.”అమృతం కురిసిన రాత్రి” కవితా పంక్తులు అలవోకగా అప్పజెప్పే తిలక్ ప్రియులు కొన్ని వేలమంది ఈ తెలుగునేలపై ఇప్పటికీ ఉన్నారు. అగ్ని రగిలినా, అమృతం కురిసినా, అందం, ఆనందం కవిత్వ పరమావధి అంటాడు. గాంధీగారి దేశంలో...గజానికొక గాంధారీ పుత్రుడు ఉన్నాడని ఆనాడే అన్నాడు. పవిత్రుల నుండి, పతివ్రతల నుండి,లక్షలాది దేవుళ్ళ పూజారుల నుండి నా దేశాన్ని రక్షించమని తిలక్ వాపోతాడు. నీతిమాటలు, సోది కబుర్లు చెప్పే నకిలీల నుండి ప్రజలను రక్షించమని ఆ కవిజీవుని వేదన. తిలక్ కవితా శిల్పం అసాధారణమైంది. నేను చూశాను నిజంగా మూర్తీభవించిన దైన్యాన్ని..., అని,తేలికైన పదాలతో మెల్లగా మొదలు పెట్టి,కల్లోల నిరధుల్ని, గచ్ఛత్ శవాకార వికారుల్ని...అంటూ శబ్దాల మోత మోగిస్తాడు.కాలానికి ఒక రూపం లేదు, దానికొక పాపం కూడా లేదు, అంటాడు. గోరువంకలు అనే పద్య సంకలనం కూడా విలక్షణమైంది. పద్యంలో ఉండే ప్రాసను పాటించకుండా, అక్షరాల సంఖ్యకు సంబంధం లేకుండా, భావం ప్రధానంగా, అది ఎక్కడ ముగిస్తే, అక్కడ ఆపేస్తాడు.ఇది తిలక్ పద్యశిల్పం. దీన్ని పద్యమని అనాలా, లేదా అన్నది పండితులే తేల్చాలి. తిలక్ అక్షరాలు చాలాచోట్ల ఆడుకున్నాయి. చాలామందిని ఆదుకున్నాయి. కవితలు, కథానికలు, నాటకాలు, నాటికలు ఇలా అనేక ప్రక్రియల్లో తిలక్ సారస్వత విన్యాసం చేశాడు. “అమృతం కురిసిన రాత్రి” అఖండమైన కీర్తి తెచ్చి పెట్టింది. “నల్లజర్ల రోడ్డు” కథ గొప్ప కథగా కితాబులు పొందింది. శ్రీ శ్రీ, కృష్ణశాస్త్రి కంటే వయస్సులో చాలా చిన్నవాడు. ఎవరో పైనుండి పిలిచినట్లు,చిన్ననాడే అర్జెంట్ గా పైకి వెళ్ళిపోయాడు. పెద్దవాడిగా పెద్ద గుర్తింపు తెచ్చుకున్నాడు. పిన్నలు పెద్దల హృదయ నభోంతరాళంలో ప్రతిభా రవిగా వెలుగుతూనే ఉన్నాడు. ప్రజాకవిగా మిగిలే ఉంటాడు. శతమానం భవతి అన్నట్లుగా, కవితాలోకంలో శతవసంతం చిరంజీవిగా ఉన్నాడు. నూరేళ్ళ పండుగ సందర్భంగా, ఆ నవకవితా వతంసుని భవ్య కవిత్వాన్ని భజిద్దాం. బాలగంగాధర తిలకుని నిత్యం తలపుల్లో తలుద్దాం.

# కరోనా సినిమా

-గౌతమ్




అన్నా.. ఒక్క 1000 రూపాయిల ఉంటే ఇస్తావా? ఇల్లు గడవడం కష్టంగా ఉంది.. !

పిల్లలు ఆకలి అంటున్నారు.. ! కాస్త సహాయం చేయరు.. ! ఫోన్ లో నాగు దీనంగా అడుగుతున్నాడు!

అటు వైపు నుండి.. డబ్బులు లేవని సమాధానం.

నాగు.. మానస థియేటర్‌లో క్లీనర్ కమ్ బాయ్..

పార్కింగ్ కూడా చూసుకునేవాడు.

కావాల్సినంత ఆదాయం లేకపోయినా.., ఇన్నాళ్లు కడుపు నింపుకోవడానికి ఇబ్బంది లేకుండా జీవిస్తూ వచ్చాడు.

అయితే.., అన్నం పెడుతూ వచ్చిన వచ్చిన సినిమాకి కరోనా కష్టం వచ్చింది.

అమ్మలా చూసుకుంటూ వచ్చిన థియేటర్ మూత పడింది. నాగు జీవితం రోడ్డున పడింది.

ఇక చివరి ప్రయత్నంగా.. మానస థియేటర్ లో క్యాంటిన్ మెయింటెనెన్స్ చూసుకునే రమేశ్ కి ఫోన్ చేశాడు నాగు.

మళ్ళీ అదే మాట..! అన్నా బిడ్డలు ఆకలి అంటున్నారు.

రమేశ్ గుండె చివుక్కుమంది!

రోజూ క్యాంటీన్ లో మిగిలిన సమోసాలు, పఫ్ లను పిల్లలకి తినిపించని .. నాగుకి పార్సిల్ కట్టించే వాడు రమేశ్.

అల.. తాను ప్రేమ కురిపించిన బిడ్డలు ఆకలితో ఉన్నారా..? అంటూ మధనపడ్డాడు రమేశ్..

రే.. నాగు .. ఒక్క అరగంటలో ఫోన్ చేస్తా అంటూ.. ఫోన్ పెట్టేశాడు రమేశ్ .

అప్పటికికప్పుడు సహాయం చేయడానికి గాని, సమాధానం చెప్పడానికి గాని రమేశ్ చేతిలో కూడా డబ్బులు లేవు!

రమేశ్ ఫోన్ అందుకొని.. టిక్కెట్ కౌంటర్ లో పని చేసే సుబ్బుకి ఫోన్ చేశాడు.

రమేశ్ ఫోన్ లిఫ్ట్ చేస్తూనే.. సుబ్బు మాట్లాడటం మొదలు పెట్టేశాడు.

అన్నా.. నేనే చేద్దాం అనుకుంటున్నా.. ! నువ్వే చేశావు!

ఒక 2 వేలు డబ్బులు కావాలన్నా.. ఇబ్బందిగా ఉంది. సుబ్బు ఆపకుండా మాట్లాడుతూనే ఉన్నాడు.

వైట్ అండ్ వైట్ వేసుకొని..

దర్జాగా టిక్కెట్ కౌంటర్ లో కూర్చొని.., నెలకి లక్ష సంపాదించే వాడిని కూడా క్యూలో వెయిట్ చేపించే సుబ్బు.. ఇలా అయిపోయాడు ఏంటి ?

సినిమాలు లేకుంటే.. మా సినిమా ఇలా ఉంటుందా అంటూ.. ఆలోచనలో పడిపోయాడు... రమేశ్ !

అటు నుండి సుబ్బు... హలో అన్నా ఉన్నావా? అంటూ అరుస్తున్నాడు !

సుబ్బు.. అరుపులకి తేరుకొన్న రమేశ్..

ఒక్క అరగంటలో ఫోన్ చేస్తా అంటూ.. కాల్ కట్ చేశాడు.

ఇప్పుడు అర్జెంట్ గా.. రమేశ్ కి 6 వేలు కావాలి..

1వేయి పార్కింగ్ నాగుకి, 2 వేలు టిక్కెట్ బుక్కింగ్ సుబ్బుకి, 3 వేలు తనకి...!

ఇక లాభం లేదనుకొని.. మానస హాల్ యజమాని దామోదర్ రెడ్డికి ఫోన్ చేశాడు రమేశ్.

ఏం.. రమేశ్..? మన పిల్లలు అంతా ఎలా ఉన్నారు? అంటూ దామోదర్ నుండి పలకరింపు వచ్చింది.

కానీ.., రమేశ్ కి ఆలస్యం చేసే అంత సమయం లేదు... !

పార్కింగ్ నాగు గాడి ఇంట్లో పిల్లలలానే.., తన ఇంట్లో వాళ్ళు కూడా ఆకలితోనే ఉన్నారు.

అన్నా అర్జెంట్ గా 6 వేలు కావాలన్నాడు.. రమేశ్!

దామోదర్ రెడ్డి వాయిస్ కి బ్రేక్..

తమ యజమాని స్థితి రమేశ్ కి అర్థమయ్యి.. మౌనంగా ఫోన్ పక్కన పెట్టేశాడు.

రెండు గంటల తరువాత దామోదర్ రెడ్డి నుండి రమేశ్ కి ఫోన్ వచ్చింది.

ఆనందంగా ఫోన్ లిఫ్ట్ చేశాడు రమేశ్..

దామోదర్ : రే రమేశ్ 10 నిమిషాల్లో థియేటర్ దగ్గరికి రారా.. !

రమేశ్ : ఏంటన్నా విషయం ? థియేటర్స్ మళ్ళీ ఓపెన్ అయ్యాయా? ( ఆశగా)

దామోదర్ : లేదురా.. చిన్న పని.. చెప్తా రా.

దానితో రమేశ్ అడుగులు... ట్రంక్ రోడ్డు దాటి.. మానస హాల్ వైపు సాగాయి.

రమేశ్ కి ఆ దారిలో పోతుంటే.. ఒకప్పుడు తాను సగర్వంగా బతికిన రోజులు గుర్తుకి వస్తోన్నాయి.

ఎన్నో ఆలోచన మధ్య.. మానస హాల్ వద్దకి చేరుకొన్నాడు రమేశ్..

మూడు నెలల తరువాత మళ్ళీ రమేశ్ తమ థియేటర్ లో అడుగు పెట్టాడు.

ఎప్పుడూ కళకళలాడిపోతుండే మానస థియేటర్ కళ తప్పి దర్శనం ఇచ్చింది.

అభిమానుల అరుపులతో, కోలాహలంతో సందడిగా ఉండే ఆ ప్రాంతంలో.. ఇప్పుడు నిశ్శబ్దం రాజ్యం వెళ్తోంది!

చూస్తుండగానే రమేశ్ కళ్ళల్లో కన్నీటి సుడులు తిరిగాయి.

ఎదురుగా తమ యజమాని దామోదర్ అన్న.

ఒకప్పటిలా లేదు..

స్టార్ హీరోల కటౌట్ ముందు కూడా... సింహలా కనిపించిన దామోదర్ అన్నఇప్పుడు చాలా డల్ గా కనిపిస్తోన్నాడు.

మరోవైపు రమేశ్ చూస్తుండగానే.. లారీలోకి కుర్చీలు ఎక్కిస్తోన్నారు పనివాళ్ళు.

అప్పటికే నేల, బెంచి, కుర్చీ, బాల్కనీ... చైర్స్ అన్నీ లారీ లోకి వెళ్లిపోయాయి.

రమేశ్ కి పరిస్థితి అర్థం అయ్యింది.. !

పరిగెత్తుకుంటూ.. హాల్ లోపలికి వెళ్ళాడు...

కళ తప్పిన అమ్మని కళ్ళారా చూసి.. రమేశ్ గుండె ఆగిపోయినంత పని అయ్యింది.

దుఃఖం తన్నుకొచ్చేస్తోంది రమేశ్ కి.. !

అలా తన క్యాంటీన్ వైపు కదిలాడు.. !

కోక్ మిషన్, కాఫీ మిషన్, సమోసాలు, పఫ్ స్టాండ్ ఇవ్వేవి.. లేని క్యాంటీన్ ప్రదేశం.. రమేశ్ కి స్మశానంలా తోచింది.

ఇంతలో బయట నుండి టేబుల్ కదిలిస్తోన్న శబ్దం...

ఆ టేబుల్.. ఆ టేబుల్..

అవును ఆ టేబుల్ మానస థియేటర్ లక్కీ టేబుల్..

సమరసింహా రెడ్డి కలక్షన్స్ వర్షంలో తడిచిన టేబుల్ అది..!

ప్రేమికుందాం రా..! వసూళ్లకు సాక్ష్యంలా నిలిచిన టేబుల్ అది..!

ఒక్కడు, ఖుషీ, ఇంద్ర, సింహాంద్రి, మగధీర లాంటి సూపర్ హిట్స్ స్థాయిని దగ్గర ఉండి లెక్క కట్టిన టేబుల్ అది!

బాహుబలితో తన గల్లా పెట్టె నిండిపోతే తెగ మురిసిన టేబుల్ అది..

బాక్సాఫీస్ రికార్డ్స్ కి నిలువెత్తు సాక్ష్యంగా నిలిచిన ఆ టేబుల్.. కదలిపోతుంటే.. దామోదర్ రెడ్డి.. గుండె అక్కడే బద్దలైపోయింది.

సామాను అంతా లారీకి ఎక్కేసింది..

రమేశ్.. తమ దామోదర్ అన్నని ఏమి అడగలేదు.. ! అడిగే ధైర్యము చేయలేదు! అడిగినా చెప్పే స్థితిలో ఆయన లేదు!

మనసుకి అర్థమైపోయిన ఆ చేదు నిజాన్ని.. మరోసారి విని తట్టుకునే శక్తి రమేశ్ కు కూడా లేదు..

అమ్మేసిన మానస థియేటర్ ఫర్నీచర్ కూడా బాగానే వసూళ్లు కురిపించింది..

అందులో నుండి కొంత మొత్తం తీసి.. రమేశ్ చేతిలో పెట్టాడు దామోదర్ రెడ్డి.

రేయ్ రమేశ్.. ఇది మీరంతా సమానంగా పంచుకోండి!

ఇది జీతం కాదు, అప్పు కాదు, సాయం కాదు..

అమ్మని అమ్మేసిన.. ఓ దౌర్భాగ్యుడు పంచుతోన్న వాటా.. !

తల్లి తాను చనిపోతూ కూడా బిడ్డల గురించే ఆలోచిస్తోంది అంటారు.. !

మన అమ్మ లాంటి థియేటర్ కూడా అదే పని చేసిందిరా అంటూ.. రోదిస్తూ.. అక్కడే కూలబడ్డాడు దామోదర్ రెడ్డి.

అంతటితో మానస థియేటర్ లో చివరి ఆట ముగిసింది...! కరోనా సాగరంలో కరిగి కూలుతున్న "కళ"ల సౌధాల్లో సినిమా కార్మికుల.. సినిమహాళ్ల కార్మికుల ఆశల సౌధాలు కూడా...

(సీతారామశాస్త్రి జయంతి సందర్భంగా)

# అద్వితీయ నటనా ధురీణ! ధూళిపాళ్ల

– ఎన్.హేమంత్



“వంచనతో మంచిగా నటించి, ద్యూతలాలసుడైన ధర్మజుని హస్తినకు రావించి, పాచికలాడించి, సర్వమూ హరించి, ఆ ద్రౌపదిని నీ కన్నులముందు నిండుకొలువులో, ఎల్లరూ గొల్లున నవ్వునటుల, దాని దురంకార మదమణుగు నటుల, వలువలూడదీసి, ప్రాణముతోనున్నను, చచ్చిన రీతిగా నిశ్చేష్టితగా నిలిపి... ఆహా నాటి పరాభావాగ్ని మరచిపోని, మా మామ శకుని చేసిన ప్రతీకారమిదా అని పదుగురూ సెహబాష్ అనునటుల, భారతేతిహాసమున నా చరిత్ర చిరస్థాయిగా, సువర్ణాక్షరములతో చిత్రింపబడునటుల పగతీర్చకపోతే, నేను గాంధార రాకుమారుడనే కాను... నీ తల్లి గాంధారీదేవి తోడబుట్టినవాడనేగాదు” అని సుయోధనుడు, అతని తమ్ముల సమక్షంలో భీషణ ప్రతిజ్ఞ చేసే సమయంలో ఈ విలక్షణ నటుడు ఏకబిగిన పలికే సంభాషణలు, హావభావాలు, కళ్ళలో కసి... చూసితీరవలసిందే.

అలాగే...“తండ్రీ మీ ఆజ్ఞ. ఇదే నా ప్రతిజ్ఞ. బ్రతిమాలిన శిలభత్యముగా మెసవిన ఈ ప్రతి అన్నపు మెతుకు, ఒక్కొక్క విషగుళికయై, నా నవనాడులలో ప్రవహించు రక్తమంతయు విరిగి, విషపూరితం కావించి, సహోదరి సంస్థానమన్న మమతా పాశమును తెంచి, తాత్కాలిక విజయ సూచిక మాయోపాయ సంఘటిత పరస్పర విశ్లేష భావ వ్యూహ రచనా సమర్థమై, నిరంత కపటయోచన తరంగాలతో మతికి మత్తెక్కించి, అయినవారిని కానీయక, ఆప్యాయతతో కలసి మెలసి మననీయక ఒకటిగా కలియనీయక, కక్షలు రగిలించి, మనసులు మండించి, నా ప్రతీకార జ్వాలలతో ఈ కురువంశమంతయు మాడి మసై, నామరూపాలు లేకుండునట్లు చేయకపోతే... నేను గాంధార రాకుమారుడనే కాను..” అనే డైలాగులను, ఆ సన్నివేశంలో ఆ నటుడి నటనాపటిమను ఎప్పటికీ మరిచిపోలేం.

ఇలాంటి ఎన్నో సందర్భాలలో ప్రేక్షకులను మెప్పించిన ఆ నేర్పరి ప్రముఖ రంగస్థల నటుడు, తదనంతరం తెలుగు సినిమాల్లో విలక్షణమైన నటన ప్రదర్శించిన ధూళిపాళ్ళ సీతారామ శాస్త్రి. మయసభలో పాంచాలి పరిహసించిందని ఆక్రోశంతో రారాజు ప్రతీకారం చేయాలని నిర్ణయిస్తే శకుని అడ్డుపడి అది తరుణం కాదని, మార్గం కాదని, మంచిగా తన పాచికలతో వంచించి, పరిహసించిన పాంచాలిని నిండుసభలో వలువలూడ్చించి వివస్త్రగా నిలిపి పరాభవిస్తానని వాగ్దానం చేస్తాడు. ఇటువంటి భారత భాగవత ఘట్టాలను కూర్చి 1966లో ఎన్.టి. రామారావు 'శ్రీకృష్ణ పాండవీయం' పేరుతో చిత్రాన్ని నిర్మించి అఖండ విజయాన్ని సాధించారు. కురుసార్వభౌముడికి కుటిల నీతులు బోధించిన శకుని పాత్ర పోషించింది ప్రఖ్యాత రంగస్థల నటుడు ధూళిపాళ్ళ సీతారామ శాస్త్రి. అంతేకాదు అదే 'శ్రీకృష్ణ పాండవీయం' చిత్రంలో రామారావుకు సుయోధనుడి పాత్రలో డైలాగులు ఎలా వినూత్నంగా చెప్పాలో శిక్షణ ఇచ్చి ఆ పాత్రలో రామారావును మెప్పింపజేసిన ఘనత కూడా ఆయనదే. 'దానవీరశూరకర్ణ' చిత్రంలో శకుని పాత్ర పోషిస్తూ వంకర చూపులతో, తల ప్రక్కకు వంచి నర్మగర్భంగా మాట్లాడుతూ ప్రేక్షకుల మన్ననలు అందుకున్న ధూళిపాళ్ళ ఇంటిపేరుతోనే ప్రసిద్ధుడు. రంగస్థల రారాజుగా జేజేలు అందుకుంటూ సాంఘిక, పౌరాణిక, జానపద చిత్రాల్లో తనదైన శైలిలో డైలాగులు చెబుతూ రాణించిన ధూళిపాళ్ళ వర్ధంతి ఏప్రిల్ 13 సందర్భంలో వారిని గురించిన కొన్ని విశేషాలు..,,

## పరిచయ భాగ్యం...

ధూళిపాళ్ళ జన్మించింది సెప్టెంబరు 24, 1921 న గురజాల తాలూకా దాచేపల్లి గ్రామంలో. తల్లిదండ్రులు రత్నమ్మ, శంకరయ్య. దాచేపల్లి

గ్రామంలోని వారి ఇంటి వెనక నాగులేరు ప్రవహిస్తూ వుండేది. పండ్లతోటలు, తమలపాకు తోటలతో ఆ గ్రామం కళకళలాడుతూ వుండేది. తండ్రి వేదాధ్యయనం చేసినా, యాభై ఎకరాల పొలంతో వ్యవసాయమే ప్రధాన వృత్తిగా ఎంచుకొని రైతుగా స్థిరపడ్డారు. శాస్త్రికి ముగ్గురు అన్నదమ్ములు, ఇద్దరు తోబుట్టువులు. అంత పొలం వున్నా, మెట్టప్రాంతం కావడంతో వచ్చే ఫలసాయం ఇంటి ఖర్చులకే సరిపోయేది. శాస్త్రి ప్రాథమిక విద్య దాచేపల్లిలోనే పూర్తి చేశారు. తరవాత వేదాధ్యయనం కోసం బాపట్ల వెళ్లి శాస్త్ర పాఠాలు అభ్యసించారు. అనంతరం గురజాల తిరిగి వచ్చి ఒక న్యాయవాది వద్ద గుమాస్తాగా చేరారు. తను కూడా వకీలుగా రాణించాలనే ఆశవున్నా అది నెరవేరలేదు. గుమాస్తా గిరి వెలగబెడుతూ ఇంగ్లీషు భాషమీద పట్టు సాధించారు. సంగీతం మీద, నాటక కళల మీద ధూళిపాళ్ళకు మక్కువ ఉండడంతో గుంటూరు పట్టణానికి దగ్గరలో వున్న ఒక గ్రామంలో 1935లో 'శ్రీకృష్ణ తులాభారం' నాటక ప్రదర్శన జరుగుతూ వుంటే అక్కడకు వెళ్లి అందులో సత్యభామ చెలికత్తె (నళిని) వేషం ధరించారు. అప్పుడు ధూళిపాళ్ళకు పదిహేనేళ్ళు. తరవాత వరసగా ధూళిపాళ్ళకు ఆడవేషాలు ధరించే పాత్రలు చాలా వచ్చాయి. అలా మూడేళ్ళ వరకు ఆడ పాత్రలే పోషిస్తూ వచ్చారు. వాటిలో చింతామణి నాటకంలో రాధ, బొబ్బిలియుద్ధం నాటకంలో మల్లమాంబ పాత్రలు ధూళిపాళ్ళకు మంచి పేరుతెచ్చి పెట్టాయి. ఒకసారి ప్రముఖ రంగస్థల నటులు మాధవపెద్ది వెంకట్రామయ్య ధూళిపాళ్ళ నటన చూసి, ఆడవేషాలకు స్వస్తిపలకమని సలహా ఇచ్చారు. దాంతో ధూళిపాళ్ళ ఆయనవద్ద శిష్యరికం చేశారు. వెంకట్రామయ్య గారి శిక్షణలో దుర్యోధన పాత్ర పోషించడంలో మెళకువలు నేర్చుకొని, అఖిలాంధ్ర పాండవోద్యోగ నాటక పోటీలలో ప్రథమ బహుమతి పొందారు. తరవాత ఆంధ్రప్రదేశ్ నాటక కళాపరిషత్ నిర్వహించిన ఏకపాత్రాభినయ పోటీల్లో మయసభ సన్నివేశంలో దుర్యోధనుడిగా నటించి ప్రథమ బహుమతి స్వీకరించారు. ఆ తరవాత బ్రహ్మనాయుడు, యుగంధరుడు, బిల్వమంగళుడు, రంగరాయుడు పాత్రలు పోషించి మంచి రంగస్థల నటుడుగా పేరు తెచ్చుకున్నారు. గుంటూరులో 'స్టార్ థియేటర్స్' పేరుతో నాటక సంస్థను నెలకొల్పి అనేక పౌరాణిక నాటకాలు ప్రదర్శించేవారు. ఆ రోజుల్లో కురుక్షేత్రం నాటక ప్రదర్శన జరిగితే మొదటి కృష్ణుడుగా ఈలపాట రఘురామయ్య, రెండవ కృష్ణుడుగా పీసపాటి నరసింహమూర్తి, మూడవ కృష్ణుడుగా షణ్ముఖి ఆంజనేయరాజు నటిస్తే దుర్యోధన పాత్రను ధూళిపాళ్ళ పోషించేవారు.

## రోషనార కోసం మద్రాసులో...

1959లో మద్రాసు నగరంలోని పచ్చియప్ప కళాశాలలో 'రోషనార' నాటకం ప్రదర్శించారు. అందులో రామసింహుడుగా ధూళిపాళ్ళ నటించారు. ఎ.వి. సుబ్బారావు అందులో శివాజీ పాత్ర పోషించారు. ఆ నాటకానికి ప్రసిద్ధ దర్శక నిర్మాత బి.ఎ. సుబ్బారావు, వేదాంతం రాఘవయ్య, జి. వరలక్ష్మి వంటి ఉద్దండులు విచ్చేసి ధూళిపాళ్ళ సంభాషణలు పలికే తీరును నిశితంగా గమనించారు. ప్రేక్షకుల నుండి ధూళిపాళ్ళ సంభాషణలకు కరతాళ ధ్వనులు మోగడం అతనికి లాభించింది. దాంతో ధూళిపాళ్ళ సినిమారంగ ప్రవేశానికి దారులు తెరచుకున్నాయి. బి.ఎ. సుబ్బారావు సినిమాలో నటించే అవకాశం కలిపిస్తానని మాట ఇచ్చారు. అయితే ధూళిపాళ్ళకు నాటకాల మీద వున్న మోజు సినిమాల మీద లేదు. ఆయన పెద్దగా సినిమాలు చూసిందీ లేదు. ఒకరోజు మద్రాసుకు రమ్మని బి.ఎ.ఎస్ ప్రొడక్షన్స్ అధిపతి బి.ఎ. సుబ్బారావు వద్దనుంచి ధూళిపాళ్ళకు వుత్తరం వచ్చింది. ఆయన పెద్దన్నయ్య ప్రోద్బలంతో ధూళిపాళ్ళ తెనాలి వెళ్లి చెన్నై రైలెక్కారు. బి.ఎ. సుబ్బారావు 'భీష్మ' (1962) చిత్రాన్ని నిర్మిస్తూ అందులో దుర్యోధనుడి పాత్రను ధూళిపాళ్ళ కు ఇచ్చారు. తొలిరోజు షూటింగులో భీష్ముణ్ణి సర్వసైన్యాధ్యక్షునిగా దుర్యోధనుడు ప్రకటించే సన్నివేశం తీస్తున్నారు. ఎదురుగా భీష్ముని వేషంలో వున్న నటరత్న ఎన్.టి. రామారావుకు దర్శకనిర్మాత సుబ్బారావు పరిచయం చేయగా రామారావు ధూళిపాళ్ళను మందహాసంతో స్వాగతించారు. తాపీ ధర్మారావు రాయగా ధూళిపాళ్ళ చెప్పిన డైలాగు తొలిషాట్‌లోనే ఒకే అయింది. అలా రామారావుతో కలిగిన పరిచయం స్నేహంగా చిగురించి చిత్రసీమను వదిలేదాకా కొనసాగింది. 'భీష్మ' చిత్రం విడుదలై ఘనవిజయం సాధించడంతో ధూళిపాళ్ళకు అనేక సినిమాల్లో నటించే అవకాశాలు వెంటవెంటనే వచ్చాయి.

## శ్రీక్రిష్ణ పాండవీయంతో పైపైకి..

నటుడనేవాడు తనను తాను మరచిపోకుండా తాత్కాలికోద్రేకంలో, సృజనాత్మక శక్తి కలిగినప్పుడు మాత్రమే తన భావ ప్రకటన ద్వారా రసోత్పత్తిని కలిగించగలుగుతాడు అనే సూత్రాన్ని తు.చ తప్పకుండా పాటించిన వారు ధూళిపాళ్ళ. అందుకు ప్రేరణ 1966లో రామకృష్ణ ఎన్.టి.ఆర్ కంబైన్డ్ పతాకం మీద రామారావు స్వీయ దర్శకత్వంలో నిర్మించిన 'శ్రీక్రిష్ణ పాండవీయం' చిత్రంలో ధూళిపాళ్ళ నటన. ఈ చిత్రం ద్వారా భిన్న ప్రవృత్తులు గల శ్రీకృష్ణ, సుయోధన పాత్రలను తనే ధరించాలనే నిర్ణయం తీసుకున్నారు రామారావు. భారత, భాగవత కథలను జల్లెడపట్టి, మరే సినిమాలోను చూపించని విధంగా శకుని జీవిత ఘట్టాలను ఇందులో పొందుపరచారు. ఇక శకుని పాత్ర ఎవరు ధరిస్తారా అనే మీమాంసకు తెరదించుతూ ఆ అవకాశాన్ని రామారావు ధూళిపాళ్ళకు ఇచ్చారు. అది ద్విభాషా చిత్రం కావడంతో తెలుగు, తమిళ వర్షన్లలో కూడా ధూళిపాళ్ళనే ఆపాత్ర పోషించాల్సిందని సూచించారు. అంతకుముందు శకుని పాత్రను సియ్యస్సార్ ఆంజనేయులు, ముదిగొండ లింగమూర్తి, నెల్లూరి నగరాజరావు పోషించి మెప్పించి వున్నారు. ఆ పాత్రను ధూళిపాళ్ళ ఛాలెంజ్‌గా తీసుకొని వాచకంలోనూ, అభినయంలోను భిన్న ప్రవృత్తిని కనపరుస్తూ సాధన చేశారు. సినిమాలో శకుని పాత్ర బాగా పండింది. సినిమా సూపర్ హిట్ కావడంతో ధూళిపాళ్ళ సినీ 'శకుని మామ' అయిపోయారు. తరవాత 'బాలభారతం' (1972), 'దానవీరశూర కర్ణ' (1977) సినిమాల్లో శకుని పాత్ర ధూళిపాళ్ళనే వరించింది. 'శ్రీకృష్ణార్జునయుద్ధం' సినిమాలో గయుడుగా, నర్తనశాలలో దుర్యోధనుడుగా, బొబ్బిలియుద్ధంలో నరస రాయలుగా, వీరాభిమన్యులో ధర్మరాజుగా, సీతాకల్యాణంలో వశిష్టుడుగా, మరికొన్ని సినిమాల్లో రావణాసురుడు, మైరావనుడుగా ధూళిపాళ్ళ నటించి మెప్పించారు. ధూళిపాళ్ళ బయట ఎక్కడైనా కనపడితే 'శకుని మామ' అని పిలిచేవారు. అలా ధూళిపాళ్ళ రెండు దశాబ్దాలపాటు పౌరాణిక, జానపద, సాంఘిక చిత్రాల్లో మంచి పాత్రలు పోషిస్తూ వచ్చారు. సాంఘిక చిత్రాల్లో అటు దుష్టపాత్రలు, ఇటు సాత్విక పాత్రలు పోషించి మెప్పించారు. బాంధవ్యాలు, ఆత్మీయులు, బాలరాజు కథ, రెండు కుటుంబాల కథ, కలెక్టర్ జానకి, మంచిమనుషులు, గుణవంతుడు, మహామంత్రి తిమ్మరుసు, కథానాయకుడు, ఆత్మగౌరవం, ఉండమ్మా బొట్టుపెడతా వంటి 300 సినిమాల్లో ధూళిపాళ్ళ నటించి ప్రేక్షకుల మన్నన పొందారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నాటక అకాడమీ వారు ధూళిపాళ్ళను కళాప్రపూర్ణ బిరుదుతో సత్కరించారు. తెలుగు యూనివర్సిటీ వారు ఉగాది పురస్కారాన్ని ప్రదానం చేశారు. బాంధవ్యాలు చిత్రంలో నటనకు ధూళిపాళ్ళకు నంది బహుమతి లభించింది. తమిళ పత్రికలు కూడా ధూళిపాళ్ళను 'నడిప్పిళ్ పులి నడత్తల్ పశువు' అంటూ కీర్తించాయి. అంటే 'నటనలో పులి, నడతలో గోవు' అని

అర్ధం. నిర్మాతల కోరిక మీద ధూళిపాళ్ళ చివరిసారి మురారి, చూడాలని వుంది సినిమాల్లో నటించారు. ధూళిపాళ్ళ కు చిన్నతనంలోనే వరలక్ష్మమ్మతో వివాహమైంది. వీరికి ఒక కుమార్తె ఇద్దరు కుమారులు వున్నారు.

### సత్ప్రవర్తన తోడుగా...

నాటకాలు వేసేవాళ్ళు చెడిపోతార్రా అని ధూళిపాళ్ళను వారి తండ్రి హెచ్చరిస్తూ వుండేవారు. కారణం నాటకాల్లో వేషాలు వేసేవారు వ్యసనాలకు బానిసలు కావడమే. తండ్రి చేసిన హెచ్చరికలు ధూళిపాళ్ళకు ఎప్పుడూ గుర్తుకొస్తూ ఉండేవి. ఆ హెచ్చరికలను ధూళిపాళ్ళ జీవితాంతం గుర్తుపెట్టుకొనే మసలారు. మద్రాసులో షూటింగు జరిగితే ఇంటి నుంచే భోజనం క్యారేజి వచ్చేది. అవుట్ డోర్ షూటింగుల్లో తప్ప నిర్మాతలు తెప్పించిన భోజనం ఆరగించిన రోజులు ధూళిపాళ్ళ చరిత్రలో లేవు. నిత్యకర్మ, ధూపదీప నైవేద్యాలు ధూళిపాళ్ళకు క్రమశిక్షణ నేర్పాయి. ప్రతియేటా సతీసమేతంగా వారణాసికి వెళ్లి రెండుమూడు నెలలపాటు అక్కడే వుండి కాశీనాథుని పూజించేవారు. అక్కడ నవగ్రహ ఆలయం లేకుండడంతో ఆలయ నిర్మాణం చేయాలని ప్రయత్నించి అనారోగ్య కారణాల వలన ఆ ప్రయత్నాన్ని విరమించారు. గుంటూరులో ఆంజనేయస్వామి ఆలయాన్ని నిర్మించాలనే సంకల్పంతో, తెలుగు, తమిళ, కన్నడ చిత్రాల్లో నటించే అవకాశాలను వదలుకొని, మద్రాసులో వున్న ఆస్తుల్ని అమ్ముకొని గుంటూరు చేరి అత్యంత దీక్షతో మారుతీ నగర్‌లో ఆంజనేయస్వామి ఆలయ నిర్మాణాన్ని చేపట్టి పూర్తి చేశారు. దాంతో ధూళిపాళ్ళ మనసు ఆధ్యాత్మిక మార్గంలోకి మళ్ళింది. తను నిర్మించిన ఆలయాన్ని కంచి కామకోటి పీఠానికి సమర్పించారు. మానవజన్మ విశిష్టతను, మోక్ష సాధన అవసరాన్ని తెలుసుకొని తరించాలని భావించి, కంచి కామకోటి పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ జయేంద్రసరస్వతీ స్వాముల చేతుల మీదుగా సన్యాసం స్వీకరించారు. తన పేరును 'మారుతీ సేవేంద్ర సరస్వతి'గా మార్చుకున్నారు. రామాయణం, సుందరకాండ గ్రంధాలను తెలుగులో రాసి ప్రచురించారు. ఒక ట్రస్టును ఏర్పాటుచేసి తద్వారా ఆధ్యాత్మిక సేవా కార్యక్రమాకలు చేస్తూవచ్చారు. సుదూర ప్రాంతాలకు వెళ్లి సుందరకాండను పారాయణంచేసి భక్తులను ఆశీర్వదించే వారు. గుంటూరులో ఒక కళావేదిక నిర్మించాలనే సత్సంకల్పంతో మూడుతరాల నటులతో నాటక ప్రదర్శన ఏర్పాటుచేసి నిధిని ప్రోగుచేసి కళాసేవకు తోడ్పడ్డారు. ఆ రంగస్థలం పైనే రెండులక్షల నిధి సమకూరడం ధూళిపాళ్ళ మీద ప్రజలకు వుండే గౌరవాన్ని సూచిస్తుంది. మానవశక్తిని బలీయమైన అతీంద్రియ శక్తి ఏదో నడిపిస్తుందని ధూళిపాళ్ళ నమ్మకం. కొంతకాలం ఊపిరితిత్తుల వ్యాధితో ధూళిపాళ్ళ బాధపడుతూ ఏప్రిల్ 13, 2007న కాలంచేశారు. ఆధ్యాత్మిక సౌరభాలను వెదజల్లేందుకు తన శేషజీవితాన్ని అంకితం చేసిన ధన్యజీవి ధూళిపాళ్ళ.



# తెలుగు సినిమాటకు పాటను నేర్పిన - చందాల

**- ప్రజామీడియా నెట్‌వర్క్**

ప్రాధాన్యత గుర్తింపు పొందని తొలి తెలుగు సినీ గేయ రచయిత చందాల కేశవదాసు గారు. భలే మంచి చౌక బేరము శ్రీకృష్ణతులాభారం చలన చిత్రంలో పాట, నాటక ప్రారంభ ప్రార్థన గీతం, పరబ్రహ్మ పరమేశ్వర, ఇంకా కనకతార, బలి బంధనం నాటకాలరచయిత, హరికథకులు కృష్ణాజిల్లా వత్సవాయి మండలం పోలంపల్లి గ్రామం లోని ఒక యోగి పుంగవులు శ్రీ నాగ దాసు గారు గురించి హరికథ కూడా వీరు రాశారు. అవధానాలు చేశారు భద్రాచలం వెళ్ళే భక్తుల కోసం తిరువూరులో ఒక మంచినీటి బావిని కూడా తవ్వించారట, దానికి దాసుగారి బావి అని పేరు.



తన సంపాదనను ఖమ్మం నుంచి కోదాడ వెళ్లే దారిలో ఉన్న తమ్మెర సీతారామచంద్ర స్వామి వారి ఆలయ నిర్వహణ కోసం ఖర్చు పెట్టారు.

అపర రామదాసుగా వీరికి పేరు.

ఇంతటి ప్రఖ్యాతమైన వ్యక్తి. 1876 సంలో జన్మించారు. నాయకన్ గూడెంలో వీరి సమాధి ఏ పరిస్థితుల్లో ఉందో క్రింది ఛాయాచిత్రాల లో చూడవచ్చు.

గత సంవత్సరం ఖమ్మం లోని కళాకారులు కొందరు వెళ్ళి దాసు గారి సమాధి వద్ద శుభ్రం చేసి వారివంతుగా దాసుగారికి సేవ చేశారు. ప్రభుత్వం పట్టించుకుని దాన్ని తీర్చిదిద్దవచ్చు.

తెలుగు సినిమాకు పాట రాసిన మొట్టమొదటి వ్యక్తి గా కేశవదాసు గారి కీర్తి తెలుగు జాతి ఉన్నంత కాలం గుర్తు పెట్టుకోవాల్సిందే.

కానీ వారి సమాధి, వారి సాహిత్య జీవితం చాలా నిరాదరించబడ్డాయి. తెలంగాణ సాహిత్య అకాడమీకి ఎన్నోమార్లు తెలియజేసాము. తెలంగాణ సంగీత నాటక అకాడమీ వారికి వివరాలన్నీ అందజేసాము. జిల్లాలో పట్టించుకునే నాధుడే లేడు. కళారంగం పట్ల, కళా సాహిత్య సృష్టికర్తల పట్ల, ఆయా ప్రాంతాలలో, పుట్టి,ఆ ప్రాంతపు కీర్తిప్రతిష్టలను విశ్వ విశ్వవిఖ్యాతం చేసిన మహనీయుల పట్లశ్రద్ధ తీసుకోవలసిన బాధ్యత ప్రభుత్వానికి తప్పనిసరిగా ఉండాలి. అనుకోవటం నిరాశ దురాశానేమో....

మా జిల్లాలోని కలెక్షన్ కింగ్ లు కళారంగంలో పైరవీలకు ఇస్తున్న ప్రాధాన్యత ఇటు వంటి స్ఫూర్తి దాతల కు ఇవ్వకపోవటం ఒకరకంగా చాలా మంచిది. ఎందుకంటే వారి ప్రతిభను కొలిచే పేరా మీటర్లు వీళ్ళు కానందుకు ప్రతిభావంతులు పవిత్రంగా మిగిలిపోతారు.

# జగన్ "ఉక్కు" సంకల్పం

జె.రత్నం, ఎం.ఎ.,బిఎల్







చంద్రబాబు పాలనలో అసాధ్యమన్న దాన్ని సుసాధ్యం చేస్తున్నారు. దీనికి పాలకుల దీక్షాదక్షితలే కారణంగా చెప్పొచ్చు. కడప జిల్లాలో ఉక్కు పరిశ్రమ ఏర్పాటు కోసం రెండు అంతర్జాతీయ సంస్థలతో పాటు మరో ఐదు దేశీయ సంస్థలు ముందుకు రావడం జగన్ సుపరిపాలనకు నిదర్శనంగా చెప్పొచ్చు.

కడప హైగ్రేడ్ ఉక్కు కర్మాగార నిర్మాణానికి పెట్టుబడులు పెట్టడానికి లిబర్టీ, ఆర్సెలార్ మిట్టల్ వంటి అంతర్జాతీయ పేరు మోసిన సంస్థలు ఆసక్తికరనబరచడం శుభపరిణామంగా చెప్పొచ్చు. అలాగే ఈ రెండు సంస్థలతో పాటు టాటా స్టీల్స్, ఎస్ఆర్ స్టీల్స్ సహా మొత్తం ఐదు దేశీయ కంపెనీలు కూడా పెట్టుబడులు పెట్టేందుకు ముందుకు వచ్చినట్టు సంబంధిత అధికారులు తెలిపారు. వైసీపీ అధికారంలోకి వచ్చిన తర్వాత పెట్టుబడులన్నీ వెనక్కి పోయాయని, ఒక్క పరిశ్రమ కూడా ఏర్పాటు కాలేదంటూ ప్రతిపక్షాలు గగ్గోలు చేస్తున్న విషయం తెలిసిందే.

ఈ నేపథ్యంలో ఉక్కు కర్మాగారం ఏర్పాటుకు దిగ్గజ కంపెనీలు ముందుకు రావడం ప్రధాన ప్రతిపక్ష పార్టీ టీడీపీకి ఎంత మాత్రం రుచించని వ్యవహారమనే చెప్పాలి. కడప స్టీల్ ఫ్యాక్టరీకి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వైఎస్ జగన్‌మోహన్‌రెడ్డి గత ఏడాది డిసెంబర్ 23న జమ్మలమడుగు మండలం సున్నపురాళ్లపల్లె దగ్గర శంకుస్థాపన చేసి శ్రీకారం చుట్టారు. వైఎస్సార్‌సీపీ ప్రభుత్వం అధికారంలోకి వస్తే కడప ఉక్కు పరిశ్రమకు శంకుస్థాపన చేస్తామని ఇచ్చిన హామీని నెరవేర్చే క్రమంలో జగన్ ముందడుగు వేసిన విషయం తెలిసిందే. మూడేళ్లలో ఫ్యాక్టరీ నిర్మాణం పూర్తి చేసి ఉత్పత్తి ప్రారంభించాలనేది జగన్ ప్రభుత్వ లక్ష్యం.

ఈ స్టీల్ ఫ్యాక్టరీని రూ.15 వేల కోట్ల పెట్టుబడి అంచనాతో ఏడాదికి 30 లక్షల టన్నుల ఉత్పత్తి సామర్థ్యంతో ఏర్పాటు చేసేందుకు పనులు జరుగుతున్నాయి. జమ్మలమడుగు మండలం సున్నపురాళ్లపల్లి, పెదనందలూరు గ్రామాల్లో 3,275.66 ఎకరాలను కేటాయించారు. దీని కోసం రూ.10 లక్షల మూల ధనంతో ఏపీ హైగ్రేడ్ స్టీల్స్ లిమిటెడ్ పేరిట ఒక ప్రత్యేక కంపెనీని ప్రభుత్వం ఏర్పాటు చేసిన విషయం తెలిసిందే.

ఈ నేపథ్యంలో ఆ ఉక్కు కర్మాగారంలో పెట్టుబడుల కోసం ఈ ఏడాది జూలై 7న టెండర్లు పిలిచారు. రూ.6 వేల కోట్ల నుంచి రూ.30 వేల కోట్ల వరకు పెట్టుబడులు పెట్టడానికి వీలుగా విదేశీ, స్వదేశీ కంపెనీలు ప్రతిపాదనలు దాఖలు చేసినట్టు అధికారులు తెలిపారు.

కాగా కంపెనీలతో ఒప్పందం కుదిరే నాటికి ప్లాంట్ నిర్మాణ ప్రదేశంలో మౌలిక సదుపాయాలను కల్పించేందుకు ప్రభుత్వం వేగంగా చర్యలు తీసుకుంటోంది. జాతీయ రహదారితో అనుసంధానంతో పాటు స్థానికంగా ఇంటర్నల్ రోడ్లు, ప్రహరీగోడల నిర్మాణ పనులు మొదలు పెట్టారు. మూడేళ్ల లోపు కరవు ప్రాంతమైన కడప జిల్లాలో ప్రత్యక్షంగా వేలాది మంది, పరోక్షంగా లక్షలాది మందికి ఉపాధి కల్పించేందుకు జగన్ ప్రభుత్వం అన్ని రకాల చర్యలు తీసుకుంటోంది.

జగన్ పాలనలో ఉక్కు ఫ్యాక్టరీ ఏర్పాటు ఓ పెద్ద మైలురాయిగా చెప్పొచ్చు. నిరుద్యోగులకు, కరవు ప్రాంత ప్రజలకు ఉపాధి కల్పించాలన్న ముఖ్యమంత్రి ఉక్కు సంకల్పానికి ఇంతకంటే నిదర్శనం ఏం కావాలి.

# నేపాల్‌కు ఏమైంది?

-ప్రజామీడియా నెట్‌వర్క్

భారత్ భూభాగాలైన కాలపానీ, లిపులేక్, లింపియాధుర తనవేనంటూ అధికారికంగా ప్రపంచానికి చాటి చెప్పడానికి నేపాల్ సిద్ధమైంది. ఈ చర్యల్లో భాగంగా, ఈ ప్రాంతాలను కలుపుకొని కొత్త మ్యాప్ తయారుచేసింది. దీనికి సంబంధించిన బిల్లును పార్లమెంట్ దిగువ సభలో ప్రవేశపెట్టి ఆమోదం పొందింది. అక్కడ నుండి నేషనల్ అసెంబ్లీకి పంపించి, అక్కడ కూడా ఆమోదం పొందిన వెనువెంటనే దేశ అధ్యక్షుడి సంతకంతో, చట్టంగా మార్చుకొనే పనిలో నిమగ్నమై ఉంది. రాజ్యాంగ సవరణలు చేసుకొని, జాతీయచిహ్నంలోని రాజకీయ మ్యాప్‌లో మార్పులు చేసుకుంటుంది. ఇదంతా, ఇప్పుడు ఇంత అర్జెంట్‌గా ఎందుకంటే? భారత్‌ను నైతికంగా దెబ్బగొట్టి, చైనాకు ఆనందాన్ని కలుగజేయడానికి... అని చెప్పవచ్చు. ఇది నేపాల్‌కు స్వయంగా పుట్టిన బుద్ధి కాదు. చైనా వెనకాల నిల్చొని, ఆడిస్తున్న నాటకం. భారతదేశంలో సరిహద్దు వివాదాలు సృష్టించడమే చైనా విధానం. లడాఖ్ ప్రాంతంలో వేల సంఖ్యలో సైన్యాలను మోహరించి, యుద్ధవాతావరణం సృష్టించింది. ఇంకో పక్క, నేపాల్‌ను, పాకిస్తాన్‌ను రెచ్చగొడుతోంది. ఈ పరిణామాల వల్ల భారత్‌కు జరిగే నష్టం పెద్దగా ఏమీ ఉండదు. చివరకు దెబ్బతినేది నేపాల్ మాత్రమే. భారత్ విషయంలో నేపాల్‌కు లోలోపల భయం ఉన్నా, చైనా ఇచ్చే ఊతంతో, పైకి మేకపోతుగాంభీర్యం ప్రదర్శిస్తూ, సరిహద్దు వివాదాలకు తెరతీస్తోంది. ఈ భూభాగాలను మ్యాప్‌లో పెట్టుకున్నంత మాత్రాన నేపాల్‌కు ఒరిగేదేమీలేదు. భౌగోళికంగా ఆక్రమించుకున్నప్పుడే వారి ప్రాంతాలవుతాయి. ఇది అంత తేలికగా జరిగేది కాదు. తన భూభాగాలను ఆక్రమించుకొనే ప్రయత్నం చేస్తే, భారతదేశం ఊరుకుంటుందా? భారత్ అంతకంటే ధీటుగా సమాధానం చెప్పి తీరుతుంది. మనతో యుద్ధం చేసేంత శక్తి నేపాల్‌కు లేదు. ద్వైపాక్షిక చర్చల ద్వారా ఉభయతారకంగా సమస్యలను పరిష్కారం చేసుకోవడమే ఉత్తమ మార్గం. భారత్ ఆ ధర్మానికే ఎప్పుడూ కట్టుబడి ఉంటుంది. లేనిపక్షంలో, అంతర్జాతీయ న్యాయస్థానాలకు వెళ్లాల్సి రావచ్చు. దీనికి సిద్ధమయ్యేంత పరిస్థితుల్లో నేపాల్ లేదనే చెప్పాలి. గతంలో, ఈ సరిహద్దు అంశాల్లో కొంత వివాదం ఉన్నప్పటికీ, నేపాల్ దుందుడుకు చర్యలకు పాల్పడలేదు.ప్రస్తుతం, చైనా ప్రేరణతోనే ఇది జరుగుతోంది. నేపాల్ ప్రపంచంలో ఏకైక హిందూ దేశం. ఇప్పటికీ అక్కడ 80శాతం పౌరులు హిందువులే ఉన్నారు. కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చినప్పటి నుండీ చైనాకు కాస్త దగ్గరయ్యారు. చైనా కూడా కమ్యూనిస్టు దేశం కాబట్టి భావసారూప్యత పేరుతో, స్వప్రయోజనాలతో రెండు దేశాల పాలకులు మరింత దగ్గరయ్యే ప్రయత్నాలు చేసుకుంటున్నారు. నేపాల్ లో పాలకులు మాత్రమే కమ్యూనిస్టులు. ప్రజలంతా ఎక్కువశాతం హిందువులు, ముఖ్యంగా భారతదేశం పట్ల గౌరవభావం ఉన్నవారు. ప్రపంచంలోని పేద దేశాలలో నేపాల్ ఒకటి. ఆర్థిక, వాణిజ్య సంబంధాల నేపథ్యంలో చైనాతో ఎంత అవసరం ఉందో, ఇండియాతోనూ నేపాల్‌కు, అంతకు మించిన అవసరాలు ఉన్నాయి.పైగా, సాంస్కృతికంగా, ఆధ్యాత్మికంగా, పర్యాటకంగా నేపాల్‌కు - భారత్‌కు ఉన్న బంధాలు, అనుబంధాలు చాలా గొప్పవి. ప్రస్తుత ప్రధానమంత్రి కె.పి శర్మ ఓలి కంటే ముందుగా పరిపాలించిన వారి సమయంలో, ఇండియా-నేపాల్ మధ్య ఒక బృహత్ నిర్మాణం చేపట్టాలని రెండు దేశాల ప్రభుత్వాలు ఆలోచనలు చేశాయి. ప్రస్తుతం వివాదానికి కేంద్రబిందువుగా ఉన్న కాళీనదిపై హైడ్రో ఎలక్ట్రిక్ పవర్ ప్రాజెక్టు నిర్మించాలనుకున్నారు. ఇది ఉభయులకూ ప్రయోజనకారి. ముఖ్యంగా నేపాల్‌కు ఎక్కువ ప్రయోజనకరమైన ప్రాజెక్టు. ఈ నిర్మాణం చేపట్టడానికి కావాల్సిన ఆర్థిక స్థోమత నేపాల్‌కు లేదు. భారతదేశం ఆ బరువు, బాధ్యత తీసుకొని నేపాల్ కు సహాయం చెయ్యాలనుకుంది. ఎందుకో, తర్వాత ఆ ప్రాజెక్టు ముందుకు వెళ్ళలేదు. నేపాల్ పట్ల భారత్ ఇంత ఉదారంగా ఆలోచించింది.నిజం చెప్పాలంటే, నేపాల్‌లో ఎక్కువ పరిశ్రమలు స్థాపించింది భారతీయులే. నేపాల్ వ్యాపార,వాణిజ్య, ఆర్థిక ప్రగతిలో భారత్ పాత్ర శిఖర సదృశమైంది. అక్కడి ప్రజలకు ఇవన్నీ తెలుసు. అందుకే, వారు మన పట్ల ఆరాధనా భావంతో ఉంటారు. గూడా సైనిక ఒప్పందాల్లోనూ భారత్ సమున్నతంగా ప్రవర్తించింది. భారతదేశంతో సరిహద్దు వివాదాల విషయంలో, మరీ ముఖ్యంగా ఈ మ్యాప్ రూపకల్పన మొదలైన అంశాల్లో, అక్కడి ప్రతిపక్ష పార్టీలు ప్రధాని కె.పి.శర్మ ఓలి పట్ల వ్యతిరేక భావనతోనే ఉన్నారు. జాతీయత అనే అంశంలో ప్రజల్లో తమపై వ్యతిరేకత వస్తుందేమో? అనే భయంతో ఈ బిల్లుకు ఆమోదం తెలిపారు. చైనాతో పోల్చుకుంటే భారతీయ పాలకులు నైతికంగా రుజువర్తన కలవారనీ, విశ్వాసం పెంచుకోతగిన వారనీ నేపాల్ పాలకులకూ తెలుసు. కానీ, చైనా అవలంబిస్తున్న మిత్రభేద తంత్రానికి ఆకర్షితులవుతున్నారు. ఇదంతా నూటికి నూరు శాతం చైనాకు భారతదేశంపై ఉన్న ఏడుపే కారణం. మామూలుగానే చైనీయులను ఎవ్వరూ నమ్మరు. కరోనా సృష్టి అంశంలో, చైనాపై ప్రపంచంలోని చాలా దేశాలకు వ్యతిరేకభావం బాగా పెరిగిపోయింది. ముందు ముందు, ఇంకా తీవ్రంగా పెరిగే అవకాశాలు కనిపిస్తున్నాయి. దీనికి భిన్నంగా, ప్రపంచ దేశాలకు భారత్ పట్ల విశ్వాసం, గౌరవం బాగా పెరుగుతున్నాయి. డబ్ల్యూ.హెచ్.ఓ లో తైవాన్ సభ్యత్వ విషయం, కరోనా వైరస్ మూలాలు ఛేదించాలని అమెరికా, ఫ్రాన్స్, యూ.కె, ఆస్ట్రేలియా మొదలైన దేశాలు డిమాండ్ చేసిన నేపథ్యంలో భారత్ దానికి మద్దతు పలకడం, లడాఖ్ ప్రాంతంలో భారత్ మౌలిక వసతులు పెరిగే దిశగా నిర్మాణాలు చేపట్టడం, భారత్ అమెరికా మిత్రదేశమనే అనుమానాలు ఉండడం మొదలైన కారణాలతో భారత్ ను లక్ష్యంగా చైనా వ్యతిరేక చర్యలు చేపడుతోంది. అరుణాచల ప్రదేశ్ నాదే అంటూ గొంతు పెంచుతున్న సమయంలో, ఆ మధ్య, భారత్ ప్రధాని నరేంద్రమోదీ ఒక కీలక వ్యాఖ్య చేశారు. లడాఖ్ లేక్‌కు దగ్గరలో ఉండి, ప్రస్తుతం పాకిస్తాన్ ఆక్రమిత భూభాగంలో ఉన్న గిల్జిత్, బాల్టీస్థాన్ ప్రాంతాలను మేము స్వాధీనం చేసుకుంటామని నరేంద్రమోదీ ప్రకటించారు. ఈ రెండు ప్రాంతాలపై కూడా చైనా ఎప్పటినుండో కన్నేసింది. నరేంద్రమోదీ ప్రకటన చైనాను ఉలిక్కిపాటుకు గురిచేసింది. ఇటువంటి అనేక కారణాలు, వ్యతిరేకతలు మూటగట్టుకొని, నేపాల్‌ను భారతదేశంపై చైనా ఉసిగొల్పుతోంది. ఇప్పటికైనా, నేపాల్ భారతదేశం విలువ తెలుసుకొని ప్రవర్తిస్తే క్షేమం. లేకపోతే, భవిష్యత్తులో భారీ మూల్యం చెల్లించుకోక తప్పదు. భారత్ ఎప్పటికైనా ప్రపంచంలో అన్ని రకాలుగా అగ్రస్థానం పొందుతుంది. ఈ తరుణంలో, నేపాల్ మేలుకుంటే మంచిది.భారత్ తో సత్ సంబంధాలు పెంచుకుంటే మరీ మంచిది.

# పవర్ ప్లాంట్‌లో ప్రమాదం...
# తెలంగాణాకు అపార నష్టం...

- డా॥ఎల్లయ్య






శ్రీశైలం రిజర్వాయర్ ఎడమ గట్టున ఉన్న పవర్ ప్లాంట్ తెలంగాణకు అత్యంత విలువైన కరెంట్ ఇస్తోంది. కృష్ణా జలాల్లో మన రాష్ట్రా నికి వచ్చే నీటి వాటాను సమర్థంగా వాడుకునేందుకు ఉపయోగపడుతోంది. మొత్తం 900 మెగావాట్ల పవర్ జనరేట్ చేసే కెపాసిటీ ఉన్న ఈ ప్లాంట్ లో 6 పవర్ యూనిట్లున్నాయి. ఒక్కో యూనిట్ కెపాసిటీ 150 మెగావాట్లు. ఈ ప్లాంట్ కు రివర్సిబుల్ టర్బయిన్లను వాడారు. అందుకే మార్కె ట్ లో పవర్ డిమాండ్, రేట్ బాగున్నప్పుడు పవర్ ఉత్పత్తి చేస్తారు. ధర తక్కువ ఉన్నప్పుడు రివర్సిబుల్ టర్బైన్లతో కిందున్న నీటిని తిరిగి రిజర్వాయర్ లోకి ఎత్తిపోస్తారు. అందుకే టీఎస్ జెన్ కో పరిధిలో ఉన్న థర్మల్, హైడల్ ప్రాజెక్టులన్నింట్లో దీనికి ప్రత్యేకత ఉంది. కానీ కృష్ణా నదీ జలాలను, శ్రీశైలం ప్రాజెక్టును కబ్జా చేసేందుకు కొంత కాలంగా ఏపీ ప్లాన్ చేస్తోంది. శ్రీశైలంకు చుక్క నీళ్లు రాకుండా మళ్లించేందుకు పోతిరెడ్డిపాడు, సంగమేశ్వరం లిఫ్ట్ ప్రాజెక్టును డిజైన్ చేసుకుంది. ఈ టైమ్ లో జరిగిన ప్రమాదంతో మన రాష్ట్ర ప్రయోజనాలకు చాలా నష్టం జరగనుందని నిపుణులు హెచ్చరిస్తున్నారు.శ్రీశైలం రిజర్వాయ్ రెండు రాష్ట్రాల ఉమ్మడి ప్రాజెక్టు అయినా ఏపీ సర్కారు పెత్తనం చేస్తోంది. ఓవైపు పోతిరెడ్డిపాడు గండిని డబుల్ చేయడంతో పాటు సంగమేశ్వరం లిఫ్ట్ కట్టే కొత్త పనుల వేగం పెంచింది. మరోవైపు ఎస్ఎల్‌బీసీ పవర్ హౌజ్ కు నీటి విడుదలను నిలిపేయాలని కృష్ణా బోర్డుకు ఫిర్యాదు చేసింది. ఈ టైమ్ లో పవర్? ప్లాంట్ లో జరిగిన ప్రమాదం తెలంగాణకు తీరని నష్టమేనని ప్రభుత్వ వర్గాలు అంటున్నాయి. రిపేర్ల కోసం ప్లాంట్ మూతబడితే ఏపీ మరింత పట్టు బిగుస్తుందని, కృష్ణా జలాల్లో తెలంగాణకు వచ్చే వాటాకూ గండి పడుతుందని ఇంజనీర్లు హెచ్చరిస్తున్నారు. 2004 అంచనాల ప్రకారం ఎస్.ఎల్.బీ.సీ పవర్ హౌజ్ విలువ రూ. 4 వేల కోట్లు. ఇప్పుడీ విలువ దాదాపు 4 రెట్లు పెరిగింది. అంటే రూ.16 వేల కోట్లు. కాబట్టి ఇక్కడ జరిగిన నష్టం తీవ్రతను ఇప్పుడే లెక్కగట్టలేమని ఇంజనీర్లు చెబుతున్నారు. అండర్ గ్రౌండ్‌లో జరిగిన ప్రమాదమని.. మంటలు 10 గంటలకు పైగా ఉండటంతో ప్లాంట్ ఎక్కువ దెబ్బతిని ఉంటుందని, రూఫ్ గ్రౌటింగ్ దెబ్బతింటే భారీ నష్టం జరిగినట్లేనని అంచనా వేస్తున్నారు. దీంతో రిపేర్లకు, ప్లాంట్‌ను తిరిగి నడిపేందుకు లెక్కలేనంత ఖర్చవుతుందని చెబుతున్నారు. ఇదంతా టీఎస్ జెన్‌కోకు ఆర్థిక భారంగా మారుతుందంటున్నారు.కృష్ణా నది ఫుల్‌గా ఉండటంతో ఈ ప్లాంట్ నుంచి రోజుకు దాదాపు రూ.15 కోట్ల విలువైన పవర్ రాష్ట్రానికి అందుతోంది. ఈ సీజన్ లో ఏప్రిల్ నుంచి ఇప్పటివరకు 676 మిలియన్ యూనిట్ల పవర్ ను ఇక్కడ ఉత్పత్తి చేశారు. ఇన్‌ఫ్లో ఎక్కువుండటంతో ఈ నెలలో గత 20 రోజుల్లోనే 399 మిలియన్ యూనిట్ల ఉత్పత్తి అయింది. గురువారం నాటి ప్రమాదంతో పవర్ ప్లాంట్‌కు భారీ నష్టం జరిగినట్లు ప్రాథమికంగా అంచనా వేశారు. ప్లాంట్ పునరుద్ధరణకు ఎంత టైమ్ పడుతుందో జెన్‌కో వర్గాలు చెప్పలేకపోతున్నాయి. అప్పటివరకు రోజూ కోట్ల విలువైన కరెంటును కోల్పోవటంతో పాటు రాష్ట్ర అవసరాలకు బయట కొనుక్కోవాల్సి వస్తుంది. శ్రీశైలంలో నీళ్లు నిండుగా ఉన్నప్పుడు పవర్ ఉత్పత్తి ఎక్కువ జరుగుతుంది. ఈ సీజన్ లోనే ప్రమాదం జరగటంతో టీఎస్ జెన్‌కో వర్గాలు తలపట్టుకుంటున్నాయి.

# కన్నా ..కిం కర్తవ్యం..

- ఎస్.సిహెచ్. వెంకటేష్, ఎం.ఎ.,ఎంఫిల్ - బెంగళూరు



బీజేపీ అధిష్టానం అకస్మాత్తుగా కన్నా లక్ష్మీనారాయణను తీసేసి, సోము వీర్రాజును పెట్టడానికి చాలా విశ్లేషణలు, సంక్షిప్త అభిప్రాయాలు బోలెడు వినిపిస్తుంటాయి... పైన చదివినవి కొన్ని మాత్రమే... నిజమే, కన్నాను ఎంపిక చేసుకున్నప్పుడు ఓ తప్పు జరిగింది... మంచి లీడరే... పైగా ఏపీ పాలిటిక్స్‌లో కాపు ఫ్యాక్టర్ కూడా బలమైనదే... తెలుగుదేశం చుట్టూ కమ్మలు, జగన్ చుట్టూ రెడ్లు పోలరైజ్ అవుతున్న దశలో ఈ కాపు లీడర్ ఎంపిక జరిగింది... కానీ బేసిక్‌గా కన్నా కాంగ్రెస్ కల్చర్‌లో ఎదిగినవాడు... బీజేపీ వాతావరణంలో ఇమడలేదు... పైగా బీజేపీ మళ్లీ అధికారంలోకి వస్తే తనకు ఏదో మంచి పదవి దక్కుతుందని అనుకున్నాడు... కానీ..

గత లోకసభ ఎన్నికల సమయంలో పార్టీ ఇచ్చిన డబ్బుల వినియోగంపై తన మీద బాగా ఆరోపణలొచ్చాయి... పార్టీ హైకమాండ్ ఎంక్వయిరీ చేయించుకుంది... నిర్ధారణ చేసుకుంది... అంతే, తరువాత ఇక ఏ అధికారిక పదవీ లేదు, ప్రాధాన్యం లేదు... బీజేపీ ఎప్పటికప్పుడు తనను మార్చేయాలని అనుకున్నా, ఏవో రాజకీయేతర కారణాలతో వాయిదా పడుతూ వస్తోంది... ఈలోపు గంగ చంద్రముఖిగా మారినట్టు కన్నా కాషాయచొక్కా రంగు పసుపు రంగులోకి మారిపోయింది... చంద్రబాబు ఎజెండా ప్రకారం వ్యవహరించసాగాడు... చంద్రబాబు తెలివిగా లెఫ్ట్ హ్యాండ్‌గా సీపీఐ రామకృష్ణ, రైట్ హ్యాండ్‌గా బీజేపీ లక్ష్మీనారాయణను వాడుకోవడం స్టార్ట్ చేశాడు... బీజేపీలోకి మార్గం సుగమం చేయటానికి సీఎం రమేష్, సుజనా చౌదరి, టీజీ వెంకటేష్ తదతరులూ బీజేపీలోకి వెళ్లారు... చివరకు పవన్ కల్యాణ్ కూడా బీజేపీతో దోస్తీ చేసుకున్నారు.

కానీ చంద్రబాబు ఆశించినట్టు మోడీ అంత సానుకూలంగా ఏమీ లేదు... గతంలోనైతే చంద్రబాబు అవసరాలు, ఇష్టాయిష్టాలను బట్టి బీజేపీ కొన్ని సమయాల్లో తనకు తోకగా మారిపోయేది, కొన్ని సందర్భాల్లో విడిపోయేది... వాటిని డిసైడ్ చేయటానికి ఇప్పుడు వెంకయ్యనాయుడు యాక్టివ్ కాదు... మొన్నమొన్నటిదాకా తనను బూతులు తిట్టి, తన అంతు చూస్తానని బెదిరించి, వందల కోట్లను ఖర్చు పెట్టిన చంద్రబాబు ఇప్పుడు హఠాత్తుగా ఇప్పుడు తన ప్లేట్ ఫిరాయించగానే, బీజేపీ వాళ్లు పరుగున వచ్చి అలుముకునే వెంకయ్య కాలం కాదు ఇది... అమిత్ షా కాలం... అది అంచనా వేయడంలో కన్నా ఫెయిల్ అయ్యాడనే చెప్పాలి.

అమరావతి దగ్గర్నుంచి, నిమ్మగడ్డ వ్యవహారం దాకా కన్నా వైసీపీ ఇంట్రస్టులకు భిన్నంగా వెళ్లాడు... అసలు తెలుగుదేశంకన్నా బీజేపీయే వైసీపీ ప్రధాన ప్రత్యర్థి అన్నంతగా వ్యవహరించాడు... నిజానికి బీజేపీ హైకమాండ్ ఆ మూడ్‌లో ఏమీలేదు... సో, రాను రాను కన్నా ఏపీ బీజేపీని టీడీపీ తోకగా మారుస్తుండేసరికి... బీజేపీ హైకమాండ్ తప్పనిసరై తోకను కత్తిరించాల్సి వచ్చింది... వైసీపీతో ఇప్పుడు మరీ అంత శత్రుత్వం అవసరం లేదు, కాపు లీడర్ కావాలి, అగ్రెసివ్‌గా ఉండాలి, సంఘ్ నుంచి ఎదిగి ఉండాలి... ఈ ఈక్వేషన్లలో సోము వీర్రాజు ఫిట్టయ్యాడు... ఇన్నాళ్ల డైలమాకు ఫుల్ స్టాప్ పెట్టేసి, కన్నాను చెట్టు కొమ్మల మీద నుంచి కిందకు తోసేసింది...కన్నా ఏం చేయాలి..? బ్యాక్ టు కాంగ్రెస్..? చాన్స్ లేదు... అసలు ఏపీలో ఆ పార్టీ ఏముందని..? అక్కడికి వెళ్తే ఏమొస్తుందని..? బీజేపీలోనే ఉండలేడు... ఉన్నా సరే, సెకండ్ కేడర్‌లో ఉండాల్సి వస్తుంది... ఉండలేడు... ఇక మార్గం..? టీడీపీ... అవును, ఇప్పుడు నేరుగానే పచ్చచొక్కా వేసుకోవచ్చు... కానీ టీడీపీ పరిస్థితి కూడా ఏమంత బాగాలేదు... ఆ క్యాంపు నుంచే క్రమేపీ లీడర్లు ఖాళీ చేస్తున్నారు... జగన్ ప్రలోభపెట్టి, కేసులు పెట్టి ఖాళీ చేయిస్తున్నాడు...అయితే ఈ ఎపిసోడ్ లో కన్నా లక్ష్మీనారాయణ బలిపశువు అయ్యారనే మాట మాత్రం వాస్తవం. గడచిన సార్వత్రిక ఎన్నికలకు ముందు, కన్నా లక్ష్మీనారాయణ వైసీపీలో చేరతారని జోరుగా ప్రచారం జరిగింది. ఆయనకు గుంటూరు జిల్లా నుంచి అసెంబ్లీ టికెట్ కూడా ఖాయమనే వార్తలు వచ్చాయి. అయితే అదే సందర్భంలో బీజేపీ ఆయనను రాష్ట్ర అధ్యక్షుడిగా నియమించి కాళ్లకు బంధం వేసింది.

ఐదుగురు ముఖ్యమంత్రుల దగ్గర మంత్రిగా పనిచేసిన అనుభవం, రాష్ట్ర రాజకీయాల్లో సీనియర్ నేత అయ్యి ఉండి, జగన్ కింద ఎలా పనిచేస్తావంటూ కొంతమంది లేనిపోని గాంభీర్యాన్ని, అహాన్ని ఆయనకు అంటగట్టారు. వైసీపీలోకి వెళ్తే, జగన్ వెనక ఉండాల్సి వస్తుందని, బీజేపీలో కొనసాగితే ఏపీ మొత్తం చేతిలో ఉంటుందని రెచ్చగొట్టారు. ఇంకేముంది పాపం కన్నా.. జాతీయ పార్టీ రాష్ట్ర అధ్యక్షుడిగా కొనసాగారు.

అయితే ఆయన హయాంలో రాష్ట్రంలో బీజేపీ దారుణ పరాజయాన్ని మూటగట్టుకుంది. సాక్షాత్తూ పార్టీ అధ్యక్షుడి స్థానంలో నర్సరావుపేట నుంచి లోక్ సభకు పోటీచేసి ఘోరంగా ఓడిపోయారాయన. నోటా కంటే కాస్త ఎక్కువగా ఓట్లు తెచ్చుకుని నాలుగో స్థానంతో సరిపెట్టుకోవాల్సి వచ్చింది. అదే వైసీపీలో చేరి ఉంటే, మంత్రి పదవి సంగతి దేవుడెరుగు కనీసం ఎమ్మెల్యేగా అయినా పక్కాగా గెలిచి ఉండేవారు. ఒకవేళ టికెట్ ఇవ్వడం కుదరకపోతే.. కచ్చితంగా ఈ దఫా రాజ్యసభలో కూర్చుని ఉండేవారు కన్నా.

ఇప్పుడు తలచుకుని ఏంలాభం. నిండా మునిగిన నావకు కెప్టెన్‌గా కూడా ఉంచనీయకుండా తరిమేసింది కమలం పార్టీ. ఇప్పుడు బీజేపీలో కన్నా లక్ష్మీనారాయణ ఓ సాధారణ నాయకుడు మాత్రమే. జగన్‌ని నమ్మక చెడిన నాయకుల్లో కన్నా ఒకరుగా మిగిలిపోయారు. పాపం కన్నా.

# డాక్టర్ వ్యాఘ్రేశ్వరుడు.....

- ఎస్.సతీష్



ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర, విశాఖపట్నం కింగ్ జార్జ్ ఆసుపత్రి ప్రప్రథమ ఆర్థోపిడిక్ క్షేత్ర ఆచార్యుడిగా, రాష్ట్రంలో ఆర్థోపిడిక్ వైద్య విభాగ వ్యవస్థాపకుడుబీ ప్లేసెంటల్ గ్రాఫ్ట్ పద్ధతిని పోలియో వ్యాధి చికిత్సకు ఉపయోగించిన తొలి భారతీయుడుబీ సబ్ట్రో చాంటరిక్ ఓస్టియోటొమి కి మెటాలిక్ గైడ్ పద్ధతిని ప్రవేశ పెట్టిన తొలి భారతీయుడు, మేటి ఆర్తో పిడిక్ ఆచార్యుడు, డాక్టర్ చావలి వ్యాఘ్రేశ్వరుడు. అంతే కాదు మూడు వందల పోలియో క్యాంపులు నిర్వహించి, 30,000 (ముప్పై వేలకు పైగా) శస్త్ర చికిత్సలు చేసి, లక్షా యాబై వేల రోగులకు వైద్య సేవలు అందించిన శ్రేష్ట వైద్యుడు శ్రీ వ్యాఘ్రేశ్వరుడు గారు. ప్రపంచంలో బహు కొద్దిమందికి తెలసిన హాఫ్ నీ జాయింట్ ట్రాన్స్ ప్లాంటేషన్ శస్త్ర చికిత్స నిపుణుడు, తొలి భారతీయుడు కూడా చావలి వ్యాఘ్రేశ్వరుడు గారే. ఈ క్షేత్ర వికాసానికి దోహదపడుతూ, ప్రిన్సిపల్స్ అండ్ ప్రాక్టీసెస్ ఆఫ్ ఆర్తో పిడిక్స్ పుస్తకం రచించిన తొలి భారతీయుడు డాక్టర్ వ్యాఘ్రేశ్వరుడు. అహో!.... తెలుగు నాట ఇలాటి వారు మరిందరు ఉంటే ఎంత బాగుండేది అని అనిపిస్తుంది యవ్వరికైనా. వీరు చేసిన పనులు తలచుకుంటే అబ్బుర పడక తప్పదు. వీరి ప్రతిభ, తదైక భావం సేవానురక్తి శ్లాఘనీయం.

ఆచార్య చావలి వ్యాఘ్రేశ్వరుడు ఎం బి బి ఎస్, ఎం ఎస్, ఎఫ్ ఐ సి ఎస్, ఎఫ్ ఏ సి ఎస్

చావలి వ్యాఘ్రేశ్వరుడు గారు ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర తూర్పు గోదావరి జిల్లాలోని రాజమండ్రిలో జన్మించారు. వీరి తండ్రి ఆయుర్వేద డాక్టర్. ఎం బి బి ఎస్ చేసిన పిదప, ఆంధ్రా మెడికల్ కాలెజి నుండి ఎం ఎస్ (సర్జరి), ఎం ఎస్ (ఆర్తో పిడిక్స్) చేశారు. తరువాత ఇక్కడే ఆర్థోపిడిక్ సర్జరీ ఆచార్యుడిగా వ్యవహరించారు.

1948 లో కార్ నికోబార్ ద్వీపాలకు వెళ్ళి చాలా మంది పోలియో వ్యాధిగ్రస్తులకు వైద్య సేవలు అందించారు. వీరు చేసిన మంచి పనికి గుర్తింపుగా ప్రపంచ ఆరోగ్య సంస్థ ఫెల్లోషిప్ ఇచ్చి ఉన్నత శిక్షణకు అమెరికా పంపించింది. 1954 లో మూడవ అంతర్జాతీయ పోలియో కాన్ఫరెన్స్ లో పురస్కారం అందుకున్నారు.

1956 లో ఇంటర్నేష్నల్ కాలేజ్ ఆఫ్ సర్జన్స్ ఫెల్లోషిప్ అందుకున్నారు. 1965 లో అమెరికన్ కాలేజ్ ఆఫ్ సర్జన్స్, ఫెల్లో నేషనల్ అకాడమి ఆఫ్ మెడికల్ సైన్సెస్ గౌరవం గైకొన్నారు.

వ్యాఘ్రేశ్వరుడు గారు డాక్టర్ మంగళంపల్లి గోపాల్ కిని వద్ద శిక్షణ పొందారు. రాణి చంద్రమణి దేవి కిని గారి వద్ద వైద్యం చేయించుకునే వారు. కిని గారు ముంబై ఆసుపత్రికి తరలి వెళ్ళడంతో, స్థానికి వైద్య సధుపాయం కోసం స్థలం విరాళముగా ఇవ్వగా, డాక్టర్ వ్యాఘ్రేశ్వరుడు వైద్య సేవలు అందిస్తూ వచ్చారు. దేశం నలుమూలలనుంచి జనం ఇక్కడికి వచ్చి వైద్య సేవలు పొందారు.

డాక్టర్ వ్యాఘ్రేశ్వరుడు గారు పలు రాష్ట్రాలు సందర్శించి పోలియో క్యాంపులు నిర్వహించి బాధితులకు ఉపశమనం కలిగించారు.

1967 లో ఆచార్య డాక్టర్ పి బ్రహ్మయ్య శాస్త్రి గారి సహకారముతో ఆంధ్ర మెడికల్ కాలెజ్ విద్యార్థుల సంఘం నెలకొల్పారు. వారి సహాయ సహకారాలతో వైద్య సేవలను మెరుగు పరిచేదిశలో మిక్కిలి కృషి చేశారు.

1972 లో ప్రభుత్వం ఉద్యోగం నుంచి రెటైర్ అయ్యారు. కాని, పోలియో రోగులకు వైద్య సేవలు కొనసాగిస్తూ వచ్చారు. ఆపరేషన్ పోలియో ప్రాజెక్ట్, సత్య సాయి పోలియో ట్రస్ట్ ఆరంభించారు. వీటి ద్వారా మూడు వందల పోలియో క్యాంపులు నిర్వహించారు. 1.5 లక్షల మందిని పరీక్షించారు. 30,000 కి పైగా శస్త్ర చికిత్సలు చేశారు. ఈ సేవలన్నీ ఆయన ఉచితముగానే అందిచారు. ప్రపంచ వైద్య రంగ ఇతిహాసంలోనే ఇలాటి ఉదంతాలు అరుదు. ఈ కోవలో ఓ భారతీయుడు, అందులోనూ ఓ తెలుగు వాడు ఉండడం అందరికీ గర్వకారణం.

వ్యాఘ్రేశ్వరుడు గారి శిష్యుడు, మేటి డాక్టర్ ఎస్ వి ఆదినారాయణ రావు వీరికి సహకారం అందిస్తూ ఉండేవారు. ఒక దరిమిలా ఆయన వ్యాఘ్రేశ్వరుడు గారిని ఉద్దేశించి ఉచితంగా సేవలు అందించడంలో మీకు ఏమొస్తుంది? అని ప్రశించారు. దానికి ప్రత్యుత్తరముగా రోగుల కళ్ళలో వారి దేవుడి పట్ల ఉన్న కృతజ్ఞత కనిపిస్తుందిబీ ఆ అనుభూతి, సంతృప్తి ఎంత డబ్బు పెట్టినా కొనలేము అని సమాధానమిచ్చారు. వారి నిష్ఠ అటువంటిది. ప్రజా క్షేమమే తన అశయంగా మలుచుకున్న గొప్ప వ్యక్తి.

మీకో విషయం చెప్పాలి వైద్య విద్యార్థులు శిక్షణా తరగతిలో ఓ మనిషి శరీరాన్ని డైసెక్ట్, చేస్తుండగా అది చూడ లేక అక్కడనుండి

పారిపోయారు. అప్పట్లో మేటి వైద్యుడు శ్రీ దిగుమర్తి గోపాలస్వామి ఆ కుర్రాడిని దిగ్భందం చేసి శిక్షణా తరగతులలో కూర్చో బెట్టారు. అలా గోపాలస్వామి గారు చేయబట్టే నేడు అంతర్జాతీయ విశిష్ఠత నార్జించిన ఆర్థోపిడిక్ నిపుణుడు డాక్టర్ వ్యాఘ్రేశ్వరుడు లోకానికి సౌలభ్యమైయ్యారు.

**రచనలు:**

డాక్టర్ వ్యాఘ్రేశ్వరుడు అనేక పత్రాలను, పుస్తకాలను వెలువడించారు:

ప్రిన్సిపల్స్ అండ్ ప్రాక్టీసెస్ ఆఫ్ ఆర్తో పిడిక్స్, ఆంధ్ర విశ్వవిద్యాలయం, 1966

బోన్ ట్యుబర్కిలోసిస్ ఇన్ చిల్డ్రెన్, ఇండియన్ జర్నల్ ఆఫ్ పీడియాట్రిక్స్

ప్లాసెంటల్ టిష్యూ గ్రాఫ్టింగ్ ఇన్ పోస్ట్ పోలియో పరాలసిస్, జర్నల్ ఆఫ్ ఇండియన్ మెడికల్ అసోసియేషన్

అటిపికల్ రినల్ రికెట్స్, జర్నల్ ఆఫ్ ఇండియన్ మెడికల్ అసోసియేషన్, 1962

ప్లసెంటల్ ఇంప్లాంట్స్ ఇన్ పోలియో మెలిటిక్స్, ది ఇండియన్ ప్రాక్టీష్నర్, 1965

చౌన్ జెనిటల్ ఆబ్సెన్స్ ఆఫ్ సాక్రం అండ్ కొక్కిక్స్, ఇండియన్ జర్నల్ ఆఫ్ పీడియాట్రిక్స్, 1961

చౌన్ జెనిటల్ ఆబ్సెన్స్ ఆఫ్ హుమెరుస్, ఇండియన్ జర్నల్ ఆఫ్ పీడియాట్రిక్స్ 1961

మోసిటిస్ ఓసిఫికన్స్ ప్రోగ్రెసివ: రిపోర్ట్ ఆఫ్ తొ కేసెస్, ఇండియన్ జర్నల్ ఆఫ్ పీడియాట్రిక్స్

వీరి జ్ఞాపకార్థం, విశాఖపట్నం, కే జి హెచ్ ఆసుపత్రిలో వీరి శిలా విగ్రహాన్ని నెలకొల్పారు.

వైద్యో నారాయణో హరి! అన్న నానుడిని యదార్థం చేసిన మహానుభావుడు డాక్టర్ చావలి వ్యాఘ్రేశ్వరుడు. ఇలాటి మహానుభావుల వల్ల పోలియో లాటి భయంకర వ్యాధిని భారతావని నుంచి నిర్మూలించగలిగారు. వీరి సేవలను మాటలలో చెప్పడం కష్టం. ప్రేరణకు, ఇటువంటి మేటి పురుషులు ఆదర్శముగా నిలుస్తారు. సేవంటే ఇలా చెయ్యాలిబీ వైద్యం ఇలా అందించాలి అని ఎవ్వరికైనా ప్రేరణ ఇవ్వాలి అంటే, డాక్టర్ చావలి వ్యాఘ్రేశ్వరుడు గారిని ఉదాహరించవచ్చు. డాక్టర్ చావలి వ్యాఘ్రేశ్వరుడు ధన్య జీవి.

# భారత్ సరిహద్దులో ఉద్రిక్తతను సడలించండి

-ప్రజామీడియా నెట్‌వర్క్

భారత్ –చైనా మధ్య వాస్తవాధీన రేఖ వెంబడి నెలకొన్న ఉద్రిక్తతను శాంతియుతంగా సడలించాలలూని చైనాను కోరుతూ అమెరికా ప్రతినిధుల సభ ఒక తీర్మానం చేసింది. జాతీయ రక్షణ అధీకృత చట్టం (ఎన్ డీఏఏ)లో సవరణలకు ఏకగ్రీవంగా ఆమోదం తెలిపిన ఒకరోజు వ్యవధిలోనే ఈ తీర్మానం చేయడం విశేషం. గల్వాన్ లోయలో, దక్షిణ చైనా సముద్రం చుట్టుపక్కల వివాదాస్పద ప్రాంతాల్లో చైనా ఆధిపత్య ధోరణిని అమెరికా ఖండించింది. ఈ తీర్మానాన్ని భారతీయ అమెరికన్ రాజా కృష్ణమూర్తి, మరో ఎనిమిది మంది కలిసి ప్రవేశపెట్టారు. “తీర్మానాన్ని ఆమోదించడం ద్వారా చైనాకు అమెరికా చట్టసభ విస్పష్టమైన సందేశాన్ని పంపింది. భారత్ ను కవ్వించేలా చైనా సైన్యం వ్యవహరిస్తుండడం ఆమోదయోగ్యం కాదు. వివాదాన్ని శాంతియుతంగా పరిష్కరించుకోవడం ద్వారా భారత్ –పసిఫిక్ ప్రాంతంలో భద్రతను పునరుద్ధరించడానికి దోహదపడవచ్చు” అని కృష్ణమూర్తి ఒక ప్రకటనలో తెలిపారు. చైనా సైనిక చొరబాట్లకు వ్యతిరేకంగా భారత్ వంటి భాగస్వామ్య దేశాలకు అండగా నిలిచేందుకు అమెరికా సంసిద్ధంగా ఉంటుందని చట్టసభ పునరుద్ఘాటించినట్లు వివరించారు. సరిహద్దు ఘర్షణల్లో చోటు చేసుకున్న ప్రాణనష్టాన్ని చట్టసభ తీర్మానంలో ప్రస్తావించారు. బల ప్రయోగం ద్వారా కాకుండా దౌత్య యంత్రాంగం ద్వారా ఉద్రిక్తత సడలిపోయేలా చూడాలని చైనాకు సూచించారు. భూటాన్, హాంకాంగ్, తైవాన్ ల విషయంలోనూ చైనా తీరును అమెరికా తప్పుపట్టింది. సరిహద్దు దేశాలను బెదిరించేలా చైనా వ్యవహరించడం తగదని అమెరికా విదేశాంగ మంత్రి మైక్ పాంపియో అన్నారు. లండన్ లో ఆయన విలేకరులతో మాట్లాడారు. బ్రిటన్ విదేశాంగ మంత్రి డొమినిక్ రాబ్ తో తాను జరిపిన చర్చల్లోనూ చైనా గురించి ప్రముఖంగా ప్రస్తావనకు వచ్చినట్లు తెలిపారు. భారత్ కు వ్యతిరేకంగా ఇటీవలి కాలంలో చైనా ఘర్షణలకు దిగుతున్న తీరు ఆమోదయోగ్యం కాదని స్పష్టం చేశారు. టిక్ టాక్ సహా 59 చైనా యాప్ లను నిషేధిస్తూ భారత్ తీసుకున్న నిర్ణయాన్ని ఆయన కొనియాడారు. చైనా కమ్యూనిస్ట్ పార్టీ విసురుతున్న సవాళ్లేమిటో మునుపెన్నడూ లేనంత స్పష్టంగా కనిపిస్తున్న తరుణంలో భారత్ –అమెరికా వంటి ప్రజాస్వామ్య దేశాలు కలిసి పనిచేయడం చాలా ముఖ్యమని పాంపియో అభిప్రాయపడ్డారు. అమెరికా–భారత్ వాణిజ్య మండలి నిర్వహించిన ‘ఇండియా ఐడియాస్ ’ సదస్సును ఉద్దేశించి వీడియో కాన్ఫరెన్స్ ద్వారా ఆయన మాట్లాడారు. అమెరికా–భారత్ ల నడుమ విస్తరిస్తున్న సంబంధాలను ప్రత్యేకంగా ప్రస్తావించారు. అమెరికా సహా అనేక దేశాల విశ్వాసాన్ని పొందగలగడం వల్లనే భారత్ ప్రస్తుతం ఈ స్థితిలో నిల్చొందని చెప్పారు. చట్టబద్ధత లేకుండా సముద్రంపై హక్కుల్ని చైనా కోరడం తగదని అన్నారు. అమెరికా రక్షణ మంత్రి మార్క్ ఎస్పెర్ మరో కార్యక్రమంలో మాట్లాడుతూ చైనా ధోరణిని ఖండించారు.

# ఉద్యమ జ్యోతి శ్రీమతి మాగంటి అన్నపూర్ణ

- వాల్మీకి, సీనియర్ జర్నలిస్ట్

"శ్రీ ఆంధ్రగర్భాన స్త్రీరత్నమైపుట్టి బెంగాలు యొడిలోన పెరిగినావు/ గాంధిబోధల యుద్ధరంగమున దిగుచు రాట్నమునుపూని ఖద్దరు కట్టినావు/ 'మమ్ము మరిచిన దేశమ్ము మరవకనుచు భర్తతో పల్కి అమెరికా కంపినావు/ అతను వచ్చినతోడ నాతని కెదురుగబోయి పూజించి ఖద్దరు పుట్టమిచ్చి/ కట్టియున్నవి వారాశి గలపినావు/ భరత స్త్రీజాతియాన్నత్య మరసినావు/ మరల వెలయవే సోదరిమము బ్రోవ/ ఆంధ్ర నారీవతంస! శ్రీ అన్నపూర్ణ!"... ఇలా సమకాలీన కవయిత్రుల నివాళులు అందుకున్న సాహితీవేత్త, స్వాతంత్ర్య సమరయోధురాలు మాగంటి అన్నపూర్ణాదేవి. బెంగాలీ, తెలుగు సాహిత్యాలకు వారధిగా నిలుస్తూనే.. జాతీయోద్యమంలో చురుకైన పాత్ర పోషించారావిడ. "తొలిసారిగా 1921లో బెజవాడలో జరిగిన స్త్రీ మహాజనసభలో ఖద్దరు వస్త్రాలు ధరించిన ఆ పిల్ల ఒక్కటే సభా నిర్వహణ భారం వహించి క్రమాన్ని నెలకొల్పుతూ ఓపికతో, నిశ్చయంతో తిరుగుతుంటే చూశాను. స్వరాజ్యనిధి కోసం తమ విలువైన ఆభరణాలన్నింటినీ, బంగారు గాజులను, బరువైన బంగారు గొలుసును ఇచ్చివేసిన వారిలో, నాకు జ్ఞాపకం ఉన్నంత వరకు ఈమే ప్రథమురాలు" అని బాపూజీనే ప్రశంసిం చిన ఉద్యమ చైతన్యం అన్నపూర్ణది. పశ్చిమగోదావరి జిల్లా చాటపర్రులో మార్చి 3, 1900న జన్మించారు అన్నపూర్ణ. తల్లిదండ్రులు పిచ్చమ్మ, కలగర రామస్వామి. ఏలూరు, గుంటూరుల్లో కొంతకాలం చదువుకున్న అన్నపూర్ణ, తర్వాత కలకత్తాలోని బ్రహ్మసమాజం బాలికల పాఠశాలలో చేరారు. అక్కడే పీయూసీ పూర్తి చేశారు. ఆ సమయంలోనే ఆవిడ బెంగాలీ భాషలో పట్టు సాధించారు. అయితే, అనారోగ్యం కారణంగా ఆమె తిరిగి స్వస్థలానికి వచ్చేశారు. 1916లో 'సీతారామము' అనే చిన్నపిల్లల పుస్తకాన్ని రచించారు. అది కొమర్రాజు లక్ష్మణరావు లాంటి పెద్దల ప్రశంసలందుకుంది. ఉన్నత పాఠశాలల్లో పాఠ్యాంశంగా నిర్ణయమైంది. తర్వాత కాలంలో అన్నపూర్ణ.. విధుశేఖర శాస్త్రి 'వివాహమంగళం', సరళాదేవి నవవర్ష స్వప్నం', 'అరవిందుని లేఖల'ను బెంగాలీ నుంచి తెలుగులోకి అనువదించారు. ఆవిడ జీవితమే ఓ కావ్యవస్తువు మేనమామ మాగంటి బాపినీడుతో 1920లో అన్నపూర్ణ వివాహమైంది. ఆ వెంటనే బాపినీడు వ్యవసాయశాస్త్రం



అభ్యసించేందుకు అమెరికా వెళ్లారు. గాంధీ సందేశాలకు ప్రభావితురాలైన అన్నపూర్ణ విదేశాలకు వెళ్లడానికి సిద్ధం చేసుకున్న తన విదేశీ వస్త్రాలను తగులబెట్టారు. గాంధీజీ విజయవాడ వచ్చినప్పుడు తాళిబొట్టు మినహా మిగిలిన ఆభరణాలను స్వరాజ్య నిధికి ఇచ్చేశారు. ప్రజల నుంచి విరాళాలు సేకరించి ఏలూరులో మోహన్ దాస్ ఖద్దరు పరిశ్రమను స్థాపించారు. 1923లో బాపినీడు తిరిగొచ్చారు. ఆయన బొంబాయిలో ఓడ దిగేసరికి అన్నపూర్ణ ఎదు రెళ్లారు. వేసుకున్న సూటూబూటూ వదలి తాను తెచ్చిన ఖద్దరు దుస్తులు ధరించమన్నారు. భర్త విడిచిన దుస్తుల్ని సముద్రంలో విసిరేశారు. తర్వాత ఆయనతో కలిసి చాలా ప్రాంతాల్లో పర్యటించారు. అనేక సభల్లో ప్రసంగించారు. 1924లో అన్నపూర్ణ ఆరోగ్యం బాగా క్షీణించింది. ఆ సమయంలో కూడా రామకృష్ణ పరమహంస 'లీలామృతం' అనే బెంగాలీ గ్రంథాన్ని తెనుగీకరించారు. భవిష్యత్తులో భారతీయ మహిళల స్థితిగతులను చిత్రిస్తూ, 'నారి' ఎ రచన చేశారు. ఆరోగ్యం దెబ్బతినడంతో 1927 అక్టోబరు 9న తుది శ్వాస విడిచారు. ఎ భర్త అమెరికాలో ఉన్నప్పుడు అన్నపూర్ణ ఆయనకు అనేక లేఖలు రాశారు. వాటన్నింటినీ కలిపి బాపినీడు 1938లో 'అన్నపూర్ణాదేవి లేఖలు' పేరిట ప్రచురించారు. ఆ పుస్తకానికి చివరి మాటలను ఉన్నవ లక్ష్మీనారాయణ రాశారు. ఈ లేఖల ఆధారంగానే తర్వాత కాలంలో అయితం ఇందిర, భారతిలు (జంట. కవయిత్రులైన అక్కాచెల్లెళ్లు) 'అన్నపూర్ణ సుభాషిత రత్నావళి' అనే కావ్యం రాశారు. చట్టి రాధమ్మ, కుడితిపూడి అచ్చమాంబ తదితరులూ అన్నపూర్ణ మీద స్మృతి . కవిత్వం వెలువరించారు. తోటివాళ్లలో ఎ జాతీయోద్యమ స్ఫూర్తి జ్యోతులను వెలిగిం చిన తన 'మానస పుత్రికకు శ్రద్ధాంజలి ఘటిస్తూ మహాత్ముడు అన్న మాటల్లో అన్నపూర్ణ వ్యక్తిత్వం ద్యోతకమవుతుంది. ఇంతకూ గాంధీజీ ఏమన్నారంటే... "భారతదేశం అంతటా నా అదృష్టం వల్ల నాకు లభించిన చాలా మంది కుమార్తెల్లో ఈమె అత్యుత్తమురాలు"!

☺☺☺

# కలిసికట్టుగా చైనా పైకి

- ఎన్.సురేష్






ప్రపంచవ్యాప్తంగా ప్రచ్ఛన్నయుద్ధ ప్రకంపనలు మొదలయ్యాయి. టీకా పరిశోధనకు సంబంధించిన కీలకాంశాలను తస్కరిస్తోందన్న ఆరోపణలపై హ్యూస్టన్ లోని చైనా కాన్సులేట్ జనరల్ ఆఫీస్ ను అమెరికా మూసేయించింది. అందుకు ప్రతిగా చైనాలోని చెంగ్డూలో అమెరికా దౌత్యకార్యాలయ అనుమతుల ఉపసంహరణ శరవేగంగా జరిగిపోయింది. అదే సమయంలో దక్షిణ చైనా సముద్రం వేదికగా ఇరు దేశాలు బలప్రదర్శనకు దిగాయి. అమెరికా ఎన్నికలకు మూడు నెలల ముందు చోటు చేసుకొన్న ఈ పరిణామాలు చైనాతో సంబంధాలు పతనమవుతున్న విషయాన్నే వెల్లడిస్తున్నాయి. మరో ప్రచ్ఛన్నయుద్ధం ప్రారంభానికి సంకేతాలుగా నిలుస్తున్నాయి.చైనాను ఆయుధపోటీలోకి దింపేందుకు అమెరికా కొన్నేళ్లుగా క్షేత్రస్థాయిలో పనిచేస్తోంది. దీనిలో భాగంగానే రష్యాతో ఉన్న ఒప్పందాలను అది రద్దు చేసుకొంటోంది. ఐఎన్ఎఫ్, ఓపెన్ స్కై ఒప్పందాల నుంచి బయటకు వచ్చేసింది. అణు వార్ హెడ్ లను పరిమితం చేసే 'న్యూ స్టార్ట్ ' ఒప్పందానికీ వచ్చే ఏడాది ప్రారంభంలో కాలం చెల్లుతుంది. దీన్ని కొనసాగించేందుకు అమెరికా ఇప్పటివరకు ఎటువంటి చర్యలూ చేపట్టలేదు. అంటే అమెరికా అణ్వాయుధ రేసును మళ్ళీ మొదలుపెట్టనుందనే దీనర్థం! మరోవంక ఈ ఏప్రిల్ లో తక్కువ సామర్థ్యంగల అణ్వస్త్రాన్ని చైనా పరీక్షించినట్లు వార్తలు గుప్పుమన్నాయి. అదేం లేదని 'డ్రాగన్ ' ఖండించినా అమెరికా అనుమానాలు మాత్రం తీరలేదు. తక్కువశ్రేణి అణ్వాయుధాలను పరీక్షించడమంటే ఆధునిక అణుపోటీకి సై అనడమే. ఎందుకంటే భవిష్యత్తులో 'జార్ బంబా' వంటి భారీ అణ్వస్త్రాలను ప్రయోగించే అవకాశమే లేదు. అందుకే స్వల్పశ్రేణి అణువార్ హెడ్ ల అభివృద్ధిపై అగ్రదేశాలు దృష్టిపెట్టాయి.కొన్నేళ్లుగా అమెరికా, చైనాల మధ్య ఘర్షణ వాతావరణం ముదురుతోంది. వైమానిక రంగానికి చెందిన సాంకేతిక విజ్ఞానాన్ని దొంగిలించడం, దక్షిణ చైనా సముద్రంపై ఆధిపత్యానికి ప్రయత్నించడం వంటి అంశాలకు ఆ ఘర్షణ పరిమితమైంది. ఆ క్రమంలోనే ఇరు దేశాల మధ్య వాణిజ్యయుద్ధం మొదలైంది. 5-జీ విషయంలో హువావేపై అమెరికా గురిపెట్టడంతో వ్యాపార సమరం ముదురుపాకాన పడింది. నల్లజాతీయుల (బ్లాక్ లైవ్స్ మ్యాటర్ ) ఉద్యమానికి చైనా రాయబార కార్యాలయం నుంచి లోపాయికారీగా సహకారం అందిందని ట్రంప్ అనుమానిస్తున్నారు. ఈ క్రమంలోనే చైనాతో ప్రచ్ఛన్న యుద్ధాన్ని అమెరికా ఎన్నికల్లో బలమైన అస్త్రంగా మార్చేందుకు ట్రంప్ కార్యవర్గం పదునుపెడుతోంది. దక్షిణ చైనా సముద్రం సహా మొత్తం ఆసియాలో తన ప్రాబల్యాన్ని విస్తరించాలన్న వ్యూహంతో 'డ్రాగన్ ' పావులు కదుపుతోంది. జపాన్, వియత్నాం, తైవాన్, ఇండొనేసియా, భారత్‌ల విషయంలో అది మరీ దూకుడుగా వ్యవహరిస్తోంది. ఇప్పటికే జపాన్, ఫిలిప్పీన్స్‌తో అమెరికాకు రక్షణ ఒప్పందం ఉంది. తాజాగా వియత్నాం సైతం తమ మత్స్యకారుల రక్షణకు అమెరికాతో అవగాహన ఒప్పందం కుదుర్చుకొంది. వియత్నాం రక్షణకు అమెరికా పూచీకత్తుగా మారే ఒప్పందమూ మున్ముందు కుదిరే అవకాశాలు కనిపిస్తున్నాయి. మరోపక్క హాంకాంగ్‌లో జాతీయ భద్రతా చట్టం అమలుతో బ్రిటన్, జర్మనీతో కూడా చైనా సంబంధాలు దెబ్బతిన్నాయి. హాంకాంగ్‌తో ఉన్న నేరస్తుల అప్పగింత ఒప్పందాల్ని ఈ రెండు దేశాలు రద్దు చేసుకొన్నాయి. ఇవన్నీ చైనాకు కళ్లెం వేసేందుకు ఉద్దేశించినవే.తొలి ప్రచ్ఛన్నయుద్ధ సమయంలో భారత్ కొంతమేర సోవియట్ వైపు మొగ్గినా, దాదాపు తటస్థంగానే ఉందని చెప్పవచ్చు అప్పట్లో ప్రచ్ఛన్నయుద్ధ వ్యూహాత్మక వేదిక ఐరోపా, అమెరికా ఖండాల్లో కేంద్రీకృతమై ఉండేది. అందుకే తటస్థంగా ఉన్నా భారత్ కు పెద్దగా నష్టం వాటిల్లలేదు. ఇప్పుడు అమెరికా-చైనా మధ్య ఆధిపత్య పోరుకు భారత్ వేదికగా నిలుస్తోంది. నేపాల్, పాక్ లను

భారత్ చుట్టూ చైనా ఇప్పటికే మోహరించింది. శ్రీలంక, ఇరాన్ వంటివీ ఆ జాబితాలో చేరే అవకాశాలు కొట్టిపారేయలేనివి. భారత్ భూభాగాలను తమవిగా చెప్పుకొంటూ కిందటి నెల నేపాల్, తాజాగా పాకిస్థాన్ రాజకీయ పటాలు విడుదల చేశాయి. అంతేకాదు- గుజరాత్‌లోని జూనాగఢ్ ను సైతం పాక్ తమ భూభాగంగా ప్రకటించడం గమనార్హం. నేపాల్, పాక్ వ్యవహరిస్తున్న తీరు ఒకేలా ఉండటం గమనార్హం.గల్వాన్ ఘటన నేపథ్యంలో- 'ఓ మంచి పొరుగు దేశంగా ఉండాలనే భ్రమ' నుంచి భారత్ త్వరగా బయటకు రావాలి. చైనాకు కోపం వస్తే ఐరాస భద్రతా మండలిలో భారత్‌కు భవిష్యత్తులో శాశ్వత సభ్యత్వం దక్కనీయకుండా అడ్డుపడుతుందనే భయాలు ఉన్నాయి. వాస్తవానికి చైనా ఎట్టి పరిస్థితుల్లో భారత్ కు ఐరాసలో శాశ్వత సభ్యత్వం దక్కనీయదు. అటువంటప్పుడు చైనా ఏమనుకుంటుందో అనే భయాలు అనవసరం. ఇప్పటికే పాంగాంగ్ సరస్సు వద్ద వెనక్కి వెళ్లకుండానే సైనికుల ఉపసంహరణ పూర్తయిందని చైనా రాయబారి చెప్పడం ప్రమాదకర సంకేతాలను పంపిస్తోంది. తాజాగా ఐరాస భద్రతా మండలిలో మరోసారి కశ్మీర్ అంశాన్ని లేవనెత్తేందుకు 'డ్రాగన్ ' యత్నించింది. ప్రస్తుతం నెలకొన్న ఆర్థిక పరిస్థితుల్లో చైనాకు వ్యతిరేకంగా భారత్ పక్షాన రష్యా నిలుస్తుందని చెప్పలేం. ఇరాన్ ను నొప్పించకూడదని అమెరికాను సైతం భారత్ కొంత దూరం పెట్టింది. కానీ, ఇప్పుడు ఇరానే 'డ్రాగన్ ' పక్షాన చేరింది. దీంతో భారత్‌కు మధ్య ఆసియాకు వెళ్లే వాణిజ్యమార్గాలు దాదాపుగా మూసుకుపోయాయి. ఇప్పుడు భారత్ కు మిగిలిన ఏకైక అవకాశం అమెరికానే. ఈ సమయంలో అగ్రరాజ్యం మద్దతు వ్యూహాత్మకంగా, వాణిజ్యపరంగా భారత్‌కు అక్కరకొస్తుంది. చైనా వైఖరితో అమెరికా, రష్యా, బ్రిటన్ వంటి అగ్రదేశాలు విసిగిపోయాయి. ఈ క్రమంలో భారత్ కు ప్రత్యక్షంగానో.. పరోక్షంగానే మద్దతు తెలిపేందుకు సిద్ధంగా ఉన్నాయి. ఇది భారత్ కు సాంకేతిక పరిజ్ఞానపరంగా, వాణిజ్యపరంగా లబ్ధిచేకూర్చే అంశం. గల్వాన్‌లో చైనాతో ఘర్షణ సమయంలో ఆస్ట్రేలియా దూకుడుగా భారత్‌కు మద్దతు తెలిపింది. అమెరికాకు సైతం అఫ్ఘానిస్థాన్ లో అవసరాలు దాదాపు తీరిపోయాయి. దాంతో అది పాక్ ను చేరదీసే అవకాశాలూ లేవు. మరోవైపు రష్యా కూడా చైనా దూకుడును కొంత కట్టడి చేయాలని భావిస్తోంది. తమ శాస్త్రవేత్త వేలేరీ మిత్రోనుంచి దేశ సైనిక రహస్యాలను చైనా తస్కరిస్తోందని గుర్తించి ఎస్ -400 సరఫరాను తాత్కాలికంగా నిలిపివేసింది. అంతేకాదు, చైనా పత్రికలు మెల్లగా రష్యాలోని వ్లాదివాస్తోక్ ప్రాంతం గతంలో తమదే అని సణగడం మొదలుపెట్టాయి. మరోపక్క అమెరికా అధ్యక్షుడు ట్రంప్ రష్యా విషయంలో మరీ వ్యతిరేకంగా లేరు. జి-7ను విస్తరించే క్రమంలో భారత్ తోపాటు రష్యాను కూడా భాగస్వామి చేసుకోవాలని భావిస్తున్నారు. రష్యా సైతం చైనా సైనిక విస్తరణ తన పరపతికి ముప్పుగానే భావిస్తోంది. భారత్, అమెరికా, రష్యాలను ప్రధాన ముప్పుగా భావిస్తోంది చైనానే. డ్రాగన్ కట్టడి విషయంలో భావసారూప్యత ఉన్న ముగ్గురూ ఏకతాటిపైకి రావాల్సి ఉంది. ఈ క్రమంలో రష్యా తటస్థ వైఖరి కూడా భారత్ కు మేలు చేస్తుంది. భారత్ వ్యూహకర్తల నోటి నుంచి తరచూ వినిపించే పదం ద్విముఖ యుద్ధం (టూ ఫ్రంట్ వార్) - అంటే ఆర్థికంగా, ఆయుధపరంగా బలంగా ఉన్న చైనా- పాకిస్థాన్ తో జట్టుకట్టి దాడికి తెగబడవచ్చునని, దాన్ని ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉండాలని మన విధానకర్తలు తరచూ చెబుతుంటారు. అలాంటప్పుడు ఆ దాడిని భారత్ ఒక్కటే ఎదుర్కోవాలనుకోవడం మొండితనమే అవుతుంది. అందుకే భారత్ సైతం ఓ బలమైన మిత్రుడితో జట్టు కట్టాలి. ఆ దోస్తీ భారత్ ను వాణిజ్యపరంగా, సాంకేతికంగా చైనాకు దీటుగా మార్చేందుకు ఉపకరించాలి. ఎందుకంటే ఆధునిక కాలంలో యుద్ధమంటే ఆయుధాలతో మాత్రమే చేసేదికాదు- ఆర్థికంగానూ ఢీ అంటే ఢీ అనేందుకు సర్వసన్నద్ధంగా ఉండాలి!

# వంటింటి వైద్యంతో కరోనా 'ఆవిరి'

-ప్రజామీడియా నెట్‌వర్క్

**వం**టింటి చిట్కాలే కరోనా నియంత్రణకు ఔషధాలుగా పనిచేస్తున్నాయి. చివరకు అంతిమ నిర్ణయంగా చెప్పుకొనే వైద్యశాస్త్రం కూడా దీనివైపే మొగ్గుచూపడం గమనార్హం. కరోనా వైరస్ నియంత్రణకు తాజాగా ఆవిరి చికిత్స (స్టీమ్ థెరపీ) ప్రధాన ఔషధంగా ఉపయోగపడుతున్నట్టు వైద్యులు చెబుతున్నారు. ముంబయిలోని సెవెన్‌హిల్స్ ఆస్పత్రి వైద్యులు 3 నెలలుగా పరిశోధన నిర్వహించి ఈ విషయాన్ని కనుగొన్నారు. ఆ ఆస్పత్రికి చెందిన డా.దిలీప్‌పవార్ నేతృత్వంలో ఈ పరిశోధనలు జరిగాయి. ఆవిరి పట్టిన వారికి మెరుగైన ఫలితాలు వచ్చినట్టు పేర్కొన్నారు. ఆ వివరాలు..? పలువురు కోవిడ్ పాజిటివ్ పేషెంట్లపై స్టీమ్ థెరపీ ప్రయోగం.

- అసింప్టమాటిక్ (ఎలాంటి లక్షణాల్లేని) పాజిటివ్ బాధితులు రోజుకు మూడు సార్లు ఆవిరి పట్టడం వల్ల త్వరితగతిన కోలుకున్నారు.
- సాధారణంగా ఇది హోం రెమిడీ (ఇంటి చిట్కా) అయినా కోవిడ్ సమయంలో బాగా ఉపయోగపడుతోంది.
- పరిశోధనలో 105 మంది బాధితులను రెండు గ్రూపులుగా విభజించారు.
- మొదటి గ్రూపులోని లక్షణాలు లేని బాధితులకు రోజుకు మూడు సార్లు ఆవిరి చికిత్స చేయగా మూడు రోజుల్లోనే కోలుకున్నారు.
- అదే లక్షణాలుండి తీవ్రత ఎక్కువగా ఉన్న వాళ్లు ప్రతి మూడు గంటలకోసారి ఐదు నిమిషాల పాటు ఆవిరి పట్టగా వారంలో సాధారణ స్థితికొచ్చారు.
- కొన్ని రకాల క్యాప్సూల్స్, విక్స్, అల్లం ఇలా కొన్నింటితో ఆవిరి చికిత్స చేశారు.

# సౌదీ "యువ" రాజకీయం!!

- కె.వి.రమణ, ఎం.ఎ. బి.ఇడి



సౌదీ అరేబియా పాలన యిప్పటివరకు సోదరుల మధ్యనే సాగుతూ వచ్చింది. రాచకుటుంబంలోని ముఖ్యులందరికీ ఏదో ఒక ప్రభుత్వ పదవి కట్టబెట్టడంతో వాటి ద్వారా ప్రభుత్వనిధులను తమకు కావలసినవారికి పంచుకునే వెసులుబాటు ఉండడంతో అందరూ ఖుషీగానే ఉంటూ వచ్చారు. పైగా అధికారాలన్నీ రాజు చేతిలో ఉండేవి కావు. 'ఫస్ట్ ఎమాంగ్ ఈక్వల్స్' (సమానుల్లో ప్రథముడు) అనే సిద్ధాంతానికి కట్టుబడి, అందర్నీ సంప్రదించి మెజారిటీ అభిప్రాయాన్ని అనుసరించి మెలగేవాడు. అందుకే యిన్నేళ్లూ సౌదీ అరేబియాలో కుట్రలు జరగలేదు.

అయితే ప్రస్తుత రాజు సల్మాన్ బిన్ అబ్దుల్ అజీజ్ 2015లో గద్దె నెక్కిన దగ్గర్నుంచి పద్ధతి మారిపోయింది. అందుకే అసంతృప్తి ఎక్కువవుతోంది. ఇతను గద్దె నెక్కేనాటికి మహమ్మద్ బిన్ నయీఫ్ అనే అతని అన్న కొడుకు యువరాజుగా, హెూం మంత్రి (ఇంటీరియర్ మినిస్టర్)గా వుండేవాడు. ఇతను అతన్ని తీసేసి తన కొడుకు మహమ్మద్ బిన్ సల్మాన్‌ను 2017 జూన్‌లో యువరాజుగా, డిఫెన్స్ మంత్రిగా, ఉపప్రధానిగా, ఎకనమిక్ కౌన్సిల్ చైర్మన్‌గా నియమించాడు. ధృతరాష్ట్రుడు దుర్యోధనుడికి సర్వాధికారాలు కట్టబెట్టినట్లు కొడుక్కి పూర్తి అధికారాలు యిచ్చేశాడు.

నిజానికి ప్రస్తుత రాజు తర్వాత జీవించి వున్న అతని సొంత సోదరుడు అహ్మద్ బిన్ అబ్దుల్ అజీజ్ రాజు కావాలి. ఇప్పుడు యువరాజు సల్మాన్‌కి అతనిపై కన్ను ఉంది. అతన్ని ఎలాగైనా తప్పించేసి, తనే రాజ్కె పోవాలని యితని ఆశ. తనకు అధికారం దక్కగానే 2017 నవంబరులో అవినీతిపై, మనీలాండరింగ్‌పై పోరాటం పేరుతో 40 మంది రాచబంధువులను ఖైదు చేశాడు. వారిలో మాజీ యువరాజు మహమ్మద్ నయీఫ్ ఒకడు.

పాత రాజు అబ్దుల్లాకు దన్నుగా నిలిచిన వ్యాపారస్తులను, మంత్రులను, దాయాదులను మొత్తం 500 మందిపై విచారణ జరిపించి, వారి బ్యాంకు ఖాతాలు స్తంభింపచేసి, 800 బిలియన్ డాలర్ల ఆస్తులను ఎటాచ్ చేసి, యిబ్బంది పెట్టాడు. చివరకు 2019 జనవరిలో అవినీతినిరోధక కమిటీ వర్క్ పూర్తయిందని ప్రకటించింది. 381 మంది వ్యక్తుల నుండి 107 బిలియన్ డాలర్లు వసూలు చేసి ప్రభుత్వ ఖజానాకు చేర్చారు. ఇదంతా తనకు ఎదురు లేకుండా చేసుకోవడానికి చేసిన కుట్రే అని అందరి అనుమానం.

ఇప్పుడు మళ్లీ రాజుగారిపై కుట్ర అంటూ కొందరిని ఒక హెూటల్లో బంధించినట్లు వార్తలు వచ్చాయి. ప్రభుత్వం వాటిని ధృవీకరించలేదు, నిరాకరించలేదు. ఈ సారి బందీలైన వారిలో భవిష్యత్తులో రాజు కావలసిన అహ్మద్ బిన్ అబ్దుల్, అతని కుమారుడు నయీఫ్ బిన్

అహ్మద్, మాజీ యువరాజు మహమ్మద్ బిన్ నయీఫ్ ఉన్నారట. తన సోదరుణ్ని, సోదరుల కొడుకులను బందీలుగా చేయడానికి రాజు ఎందుకు ఒప్పుకున్నాడు అనేదే యింకా అర్థం కావటం లేదు.

కరోనా భయంతో మక్కాలోని గ్రాండ్ మసీదు మూసివేయడాన్ని అహ్మద్ ఎద్దేవా చేశారని, ఆ విషయం యువరాజు వెళ్లి చెప్పడంతో రాజుకి కోపం వచ్చి ఆదేశాలు యిచ్చాడని అంటున్నారు. అతను గతంలోనే యెమెన్‌పై తండ్రీకొడుకులు చేస్తున్న యుద్ధాన్ని వ్యతిరేకించాడని అంటారు. వ్యాఖ్యలు చేస్తే కుట్ర అయిపోతుందా?

అసలు సంగతేమిటంటే అహ్మద్, నయీఫ్ యిద్దరూ గతంలో హోం మంత్రులుగా పని చేసినప్పుడు పటిష్టమైన యంత్రాంగాన్ని ఏర్పరచారు. తాము భవిష్యత్తులో రాజులైనప్పుడు తిరుగుబాట్లు జరిగితే ముందే కనిపెట్టేందుకు నిఘా వ్యవస్థలు ఏర్పాటు చేశారు. అవి యిప్పుడు యువరాజు సల్మాన్‌కు యిబ్బందిగా పరిణమించాయి. జర్నలిస్టు ఖషోగ్గిని చంపిస్తే ఆ విషయం బయటకు వచ్చేసింది. దాన్ని యితరులపై నెట్టేసి ఏదో కాలక్షేపం చేశాడు కానీ రాచకుటుంబం అతనిపై గుర్రుగా వుండడంతో ఒక ఏడాది పాటు తగ్గి వున్నాడు. ప్రజలకు నచ్చిన సంస్కరణలను కొన్ని ప్రవేశపెట్టి వాళ్ల అభిమానంతో లాక్కు వద్దామని చూస్తున్నాడు.

ఇప్పుడు ఆయిల్ విషయంలో దేశ ఆర్థిక వ్యవస్థతో ఒక ప్రయోగం చేద్దామనుకుంటున్నాడు. అది బెడిసికొడితే ప్రజల్లో అసంతృప్తి కలిగి, తిరుగుబాటు రావచ్చు, తనకు తన విరోధులుగా ఉన్న బమైన రాచబంధువులు దానికి మద్దతు యివ్వవచ్చు. అది జరగకుండా చూడాలంటే ముందు వాళ్లని నిర్వీర్యం చేయాలి. బాబాయికి 78 ఏళ్లు ఉన్నా తన కజిన్ మహమ్మద్ నయీఫ్‌కు 60 ఏళ్లే. అంటే తన కంటె 26 ఏళ్లు మాత్రమే పెద్ద. అతన్ని యువరాజు పదవి నుంచి దింపేసి, తను ఎక్కినపుడు అతను అభినందించడానికి వచ్చాడు కానీ విధేయత (బయా) ప్రకటించలేదు.

ఈ ఆయిల్ ప్రయోగం యిప్పుడే ఎందుకు చేయాలి అంటే మూడేళ్ల ఒపెక్ ప్లస్ ఒప్పందం యీ నెలతో ముగిసిపోతోంది. ఏదో ఒక సాహసం చేసి రష్యాకు, అమెరికాకు బుద్ధి చెప్పి ప్రజల చేత ఓహో అనిపించుకోవాలని ఐడియా. మరో పక్క చూస్తే 84 ఏళ్ల తండ్రి అస్వస్థుడిగా ఉన్నాడు. ఆయనపై ఉన్న దాయాదులకు ఉన్న గౌరవం తనపై లేదని, ఆయన మరణానంతరం తనను లెక్క చేయరని తెలుసు. అందువలన వీళ్లను యిప్పుడే తండ్రి పేరు మీద ఖైదు చేసి, తన ఐడియా చీదేస్తే తనకు వ్యతిరేకంగా ప్రజలను సమీకరించే నాయకుడు లేకుండా చేయాలని అనుకున్నాడు.

2030 నాటికి సౌదీ అరేబియాను గ్లోబల్ పవర్‌గా చేస్తానని, దానికి గాను దాని పెట్టుబడులను డైవర్సిఫై చేస్తానని యువరాజు సల్మాన్ చెప్పి వున్నాడు. కానీ ఆయిల్ ధరలు తగ్గిపోతూ రావడంతో దేశం ఆర్థికవ్యవస్థ దెబ్బ తింటోంది. కరోనా వైరస్ కారణంగా ఆర్థిక కార్యకలాపాలు తగ్గి చైనా సౌదీ నుంచి తన ఆయిల్ దిగుమతులను తగ్గించింది. ఇతర దేశాల్లో కూడా కరోనా వ్యాపిస్తున్న కారణంగా ఆయిల్ ధరలు పడిపోయాయి. 2019 డిసెంబరు 31కి 66 డాలర్లున్న బారెల్ మార్చి రెండోవారానికి సగం రేటుకి లభిస్తోంది. ఈ టైములోనే ఒపెక్ ప్లస్ ఒప్పందంపై సమీక్ష చేయవలసిన అవసరం వచ్చింది.

2014 తర్వాత ఆయిల్ ధరలు దారుణంగా పడిపోయినప్పుడు సౌదీ నాయకత్వంలోని ఒపెక్ (ఆర్గనైజేషన్ ఆఫ్ పెట్రోలియం ఎక్స్‌పోర్టింగ్ కంట్రీస్), దానిలో సభ్యత్వం లేని రష్యా కలిసి ఒక ఒప్పందానికి వచ్చాయి. ధర పెరగాలంటే డిమాండ్ ఎక్కువ, సప్లయి తక్కువ ఉండాలి. సప్లయి తక్కువ వుండాలంటే ఉత్పాదన తగ్గించాలి. అందుకని ఉత్పత్తి తగ్గించాలని యీ దేశాలన్నీ అంగీకరించాయి. ఆ ఒప్పందం యీ నెలాఖరుతో ముగుస్తుంది. ఇప్పుడు కరోనా, యితర కారణాల వలన ధర పడిపోయింది కాబట్టి మన ఉత్పాదన మరింత తగ్గిద్దాం అని సౌదీ ప్రతిపాదించింది.

కానీ రష్యా దానికి ఒప్పుకోవటం లేదు. ఎందుకంటే ఉత్పాదన తగ్గించి రష్యా కొన్ని విధాలుగా నష్టపోయింది. దాని ఎనర్జీ కంపెనీలు నష్టాల పాలయ్యాయి. దానితో సౌదీకి కోపం వచ్చింది. రష్యాను ఎలాగైనా దెబ్బ కొట్టాని, ధరలు యింకా తగ్గించాలని ఉత్పత్తి పెంచేసింది. రోజుకి 97 లక్షల బారెల్స్ యిప్పుడు తయారు చేస్తున్నాం కదా, ఏప్రిల్ నుంచి 123 లక్షలు చేస్తాం అంటోంది. పైగా ధరలపై డిస్కౌంట్ కూడా ఆఫర్ చేస్తోంది. ఇలా రష్యాను దెబ్బ కొట్టి అది దాసోహం అన్నాక, అప్పుడు ఉత్పత్తిని బాగా తగ్గించేయాలని ప్లాను. ఒకవేళ రష్యా లొంగి రాకపోతే కనీసం రష్యన్ మార్కెట్టయినా తనకు కైవసం అవుతుంది.

దీనితో బాటు అమెరికాను కూడా దెబ్బ కొట్టాలని చూస్తోంది సౌదీ. అమెరికాలో షేల్ ఆయిల్‌ను ఉత్పత్తి చేసే కంపెనీలున్నాయి. వీళ్లు బావుల నుంచి తైలాన్ని బయటకు తీస్తే వాళ్లు శిలాజాలనుంచి తయారు చేస్తారు. నెలకు 12 బిలియన్ బ్యారెల్లను తయారు చేసి మార్కెట్‌ను ముంచెత్తుతున్నారు. కానీ ఆ తయారీ ఖర్చు ఎక్కువగా ఉంటుంది. ఇప్పుడు సౌదీ పడగొట్టేసిన ధరకు అమ్మితే వాళ్లు దివాలా ఎత్తుతారు. అదే సౌదీకి కావలసినది. దెబ్బకి రష్యా, అమెరికా రెండూ కుదేలవుతాయి. అవి నాశనమయ్యాక తను ఎంత రేటుకి కావాలంటే అంత రేటుకి అమ్ముకుని సూపర్ పవర్‌గా ఎదగవచ్చు.చివరగా– యీ ఆటలో ఇండియాకు దక్కే అరటిపండు ఏమైనా ఉందా అంటే మనం మన అవసరాల్లో 83% ఆయిలును దిగుమతి చేసుకుంటున్నాం కాబట్టి ధరలు తగ్గితే కేంద్ర ప్రభుత్వ ఖజానాకు లాభమే. ఇక సామాన్యుడి మాట కొస్తే ఏమైనా లాభమా అంటే నమ్మకం లేదు. ప్రస్తుతానికైతే పెట్రోలు, డీజిలు ధరఎనిమిది నెలల క్రితం ఉన్న ధరకు వచ్చింది. అంతర్జాతీయంగా ధర సగానికి పడిపోయింది కదా, మనకెందుకు పడదు అంటే యీ ప్రభుత్వ విధానం అది!

కేంద్రమూ పన్ను వేసి ఆర్జించుకుంటోంది, వివిధ పార్టీల ఆధీనంలో ఉన్న రాష్ట్ర ప్రభుత్వాలూ ఆర్జించుకుంటున్నాయి. ఏమైనా అంటే ప్రజలు ఎక్కువగా సొంత వాహనాలు వాడకుండా, కాలుష్యం పెరగకుండా చూడడానికి యిలా చేస్తున్నాం అంటారు. ఆర్టీసీ బస్సులు, ప్రయివేటు బస్సులు, లారీలు యివన్నీ ధరలు పెంచుతాయి. వస్తువుల రవాణా కాస్ట్‌లీ కావడంతో వస్తువుల ధరలుపెరుగుతాయి. కాస్కేడింగ్ ఎఫెక్ట్‌తో అన్ని ధరలూ పెరుగుతాయి. ఇవి పాలకులకు తెలియదా?



# ప్రత్యర్థులకు టార్జాన్

– వి.ఎస్.శర్మ, స్పోర్ట్స్ యనాలసిస్ట్

ఎదురుచూస్తున్న వన్డే ప్రపంచకప్‌ను రెండోసారి అందించావు. క్రికెట్ పరమపద సోపాన పటంలో ఆశల నిచ్చెనలను ఎక్కించావు. ఛాంపియన్స్ ట్రోఫీతో తిరుగులేని ఘనత అందుకున్నావు. వాటిని చదివినప్పుడల్లా నువ్వు మళ్లీ మళ్లీ గుర్తొస్తావు మహీ!చాలాకాలం వరకు టీమ్ ఇండియాకు చిరుతలాంటి వికెట్ కీపర్ దొరకలేదు. ఏ గిల్ క్రిస్ట్‌నో, మార్క్‌బౌచర్‌నో చూసినప్పుడల్లా మనకూ అలాంటి కీపర్ దొరికితే బాగుండూ అనుకునేవాళ్లం. నువ్వా కొరతను తీర్చావు. అంతేకాదు వారి రికార్డులన్నీ బద్దలుకొట్టావు. కనురెప్ప వాల్చేలోపు రాకెట్ వేగంతో స్టంపింగ్‌లు చేశావు. వికెట్ల వెనకాల చేతుల్ని మెరుపులా కదిల్చేవాడివి. వయసు పెరిగినా గాల్లో తేలుతూ బంతి అందుకొనేవాడివి. రేప్పొద్దున పంత్‌, శాంసన్‌, రాహుల్‌ గ్లోవ్స్‌తో ఇంద్రజాలం చేస్తే నువ్వు మళ్లీ మళ్లీ గుర్తొస్తావు మహీ! జట్టు అన్నప్పుడు కొత్త కెప్టెన్లు రావడం పోవడం సహజం. వచ్చినవారు డేగకళ్లతో గమనిస్తూ మెరుపు నిర్ణయాలు తీసుకోవాలి. ఏదో ఓ మ్యాచులో బౌలర్ వేసిన బంతి బ్యాట్స్ మన్ బ్యాటును ముద్దాడుతున్నట్టు కనిపించి ప్యాడ్లను తాకుతుంది. అంపైర్ ఔటివ్వలేదు. సమీక్ష కోరాలో వద్దో జట్టు సభ్యులు కెప్టెన్‌కు చెప్పలేకున్నారు. ఉన్నది ఒకటే రివ్యూ. తర్వాత వచ్చే బ్యాట్స్ మన్ విధ్వంసకర వీరుడు. అయినప్పటికీ కెప్టెన్ ధైర్యం చేసి డీఆర్ ఎస్ కోరి విఫలమయ్యాడే అనుకో! మాకది ధోనీ రివ్యూ సిస్టమ్ అని స్ఫురిస్తుంది. అప్పుడు నువ్వు మళ్లీ మళ్లీ గుర్తొస్తావు మహీ!

నువ్వే నవ్వించావు .. నువ్వే ఏడిపించావు ..

నువ్వే సంతోషపెట్టావు .. నువ్వే బాధపెట్టావు ..

నువ్వే మునికాళ్లపై నిలబెట్టావు ..

నువ్వే ఎగిరి గంతేసేలా చేశావు ..

నువ్వే ఆలోచింపజేశావు ..

నువ్వే ఆశ్చర్యపరిచావు ..

ఉద్వేగాలేమీ ప్రదర్శించకుండానే ఇప్పుడు మమ్మల్ని భావోద్వేగంలో ముంచెత్తావు..

గుర్తొస్తున్నావు మహీ.. చాలా చాలా గుర్తొస్తున్నావు .. వచ్చేకొద్దీ గుండెల నిండా బరువు పెంచేస్తున్నావ్ మహీ!? పదహారేళ్ల క్రితం జులపాల జుట్టుతో నువ్వు టీమ్ ఇండియాలో అడుగుపెట్టావు. పరుగులేమీ చేయకుండానే రనౌట్ అయ్యావు. గతేడాది నువ్వాడిన ఆఖరి మ్యాచులో మళ్లీ రనౌట్‌గా వెనుదిరిగావు. కొన్ని చరిత్రలు ఎక్కడ మొదలయ్యాయో అక్కడే ముగుస్తాయి. అలాగే ఈ రెండు రనౌట్లు నీ కెరీర్‌కు ఆద్యంతాలు! అందుకే వాటిని తలుచుకున్నప్పుడల్లా నువ్వు మళ్లీ మళ్లీ గుర్తొస్తావు మహీ!మ్యాచ్ ఫిక్సింగ్ కలకలంతో జావగారిపోయిన టీమ్ ఇండియాకు సౌరవ్ గంగూలీ ప్రాణం పోశాడు. తిరుగులేని జట్టును తయారు చేశాడు. 2003 ప్రపంచకప్‌లో రన్నరప్‌గా నిలబెట్టాడు. నువ్వూ అంతే. 2007లో పాతాళానికి పడిపోయిన జట్టును తిరిగి పైకిలేపావ్. అదే ఏడాది ఐసీసీ టీ20 ప్రపంచకప్ గెలిపించావు. భారతీయులు 28 ఏళ్లుగా

మహేంద్ర సింగ్ ధోనీ.ఎప్పటికీ మరచిపోలేని పేరు.అంతర్జాతీయ క్రికెట్ నుండి స్వచ్ఛందంగా విరమణ తీసుకున్నాడు.ఇప్పుడు క్రీడా ప్రపంచంలో ఇదే పెద్ద టాపిక్. అభిమాన లోకమంతా నేడు స్మరిస్తున్న పేరు ధోనీ. అద్వితీయుడు అంటే, అటువంటివాడు రెండవవాడు ఇంకొకడు లేడు అని అర్థం. ధీరుడు అంటే,విజయాన్ని, అపజయాన్ని సమానంగా తీసుకోగలిగిన యోగి అని అర్థం. ఈ రెండూ గొప్పలు చాలా అరుదైనవి. ఈ అరుదైన అద్భుతాలు సొంతం చేసుకున్న ఐశ్వర్యవంతుడు ధోనీ. గొప్ప కెప్టెన్ లు,బ్యాట్స్ మెన్, గొప్ప వికెట్ కీపర్లు క్రికెట్ ప్రపంచంలో కొందరు ఉండవచ్చు గాక. కెప్టెన్సీ-వికెట్ కీపింగ్ -బ్యాటింగ్ లో సమప్రతిభ, ఫలితాలు చూపించిన ప్రపంచ నెంబర్:1 క్రికెట్ ఆటగాడు ధోనీ మాత్రమే. ఇక వికెట్ కీపింగ్ లో,ఈ 15 సంవత్సరాల్లో ఇతనే నెంబర్:.1.రెండుసార్లు భారతదేశానికి ప్రపంచ కప్పులందించిన ఒకే ఒక కెప్టెన్. ప్రపంచ చరిత్రలో ఇతని స్థానం ప్రథమశ్రేణి. భారతీయ క్రికెట్ చరిత్రలో అగ్రస్థానం. ఇటువంటి వాడు మళ్ళీ ఎప్పుడు పుడతారో ఇప్పుడే చెప్పలేం.కెప్టెన్ గానూ మిస్టర్ కూల్. ఆటగాడుగా ఉన్నప్పుడు కెప్టెన్ కు అద్భుతంగా సహకరించాడు. కెప్టెన్ అయినప్పుడు తోటి ఆటగాళ్ళందరినీ కలుపుకొని వెళ్తూ, ప్రోత్సాహాన్ని అందిస్తూ, అట్టడుగు ఆటగాడికి కూడా స్ఫూర్తి, ధైర్యాన్ని నింపుతూ ధోనీ చూపించిన నాయకత్వ

లక్షణాలు ప్రపంచ కెప్టెన్ లందరికీ ఆదర్శప్రాయం. ధోనీ దారిలో నడవడం ఇంకొకరికి అసాధ్యం. తాను కెప్టెన్ గా దిగిపోయిన తర్వాత కూడా, తర్వాత వచ్చిన కెప్టెన్ కు అందించిన సహకారం, ఒదిగిపోయిన లక్షణం కూడా ఆషామాషీ కాదు. ఒక్కమాటలో చెప్పాలంటే, ధోనీది విలక్షణమైన వ్యక్తిత్వం, విభిన్నమైన ప్రతిభ. స్కూల్స్ ఎగ్గొట్టే క్రికెట్ పిచ్చి కుర్రకారు మొదలు,కోట్లాదిమందిని ప్రభావితం చేసిన అబ్దుల్ కలామ్ వరకూ ధోనీ అంటే ఎంతో ఇష్టం.చెప్పలేని ఆరాధనా భావం. ఏ గొప్ప క్రికెటర్ తో పోల్చలేని గొప్పతనం కేవలం ధోనీ సొత్తు. ప్రతిభ, రాణింపు, మంచితనం కలగలసిన మూర్తిమత్వం ధోనీ.దేశంలో అత్యంత వెనుకబడిన బీహార్, జార్ఖండ్ ప్రాంతాల నుండి టార్జాన్‌లా వచ్చిన, ఈ అబ్బాయి క్రికెట్ లోనూ టార్జాన్. క్రికెట్‌ను చెస్ లా ఆడే మేధావి. లెక్కలు ఎరిగిన దార్శనికుడు. నియమావళి తెల్సిన నిబద్ధుడు. ఈ తెలివి బ్యాటింగ్‌లో, వికెట్ కీపింగ్‌లోనూ చూపించిన విలక్షణుడు. బౌలింగ్ చేయించడంలో దిట్ట. పిచ్, వాతావరణాన్ని చిటికలో అధ్యయనం చేసి, బౌలర్లకు ఊహాతీతమైన వ్యూహాత్మక సూచనలు చేయడంలో నేర్పరి. ఇక, స్టంపింగ్స్‌లో కింగ్. 350 వన్డేల్లో 123 స్టంపులు చేశాడు. ఇందులో ఎక్కువ శాతం సెకన్ కంటే కూడా ఎంతో తక్కువ సమయంలో చేసినవే. సూక్ష్మాతి సూక్ష్మమైన కాలంలో స్టంపులు చేసిన సూక్ష్మగ్రాహ్య ప్రతిభామూర్తి. 2007 వన్డే ప్రపంచ క్రికెట్ సమయంలో భారతీయ టీమ్ పరిస్థితి ఘోరాతి ఘోరం. అటువంటి పరిస్థితి నుండి మన టీమ్ ను నడిపిన తీరు అద్భుతం. యువరాజ్ –ధోనీ జంట చూడ ముచ్చటైంది. పాపం!యువరాజ్ కాన్సర్ బారినపడిన తర్వాత, ఒక్కడే క్రీడా క్షేత్రంలో నిల్చొని,వండర్స్ చేశాడు.ఛాంపియన్స్ ట్రోఫీ గెలిచి,ఐ సి సి టోర్నీలన్నీ గెలిచి చూపించిన ఏకైక కెప్టెన్ కూడా ధోనీ. అంతటి కోహ్లీ కూడా ధోనీని ఒకరకంగా గురువుగా భావిస్తాడు.కోహ్లీకి అంత ఇష్టం. క్రికెట్‌లో గెలవడం ఒక్కటే పరమావధి కాదు, అద్భుతంగా ఆడడం కూడా ధోనీ దృష్టిలో గెలుపే. ఆట ద్వారా అభిమానులకు అనిర్వచనీయమైన వినోదాన్ని పంచడం కూడా అతని దృష్టిలో గెలుపే. గొప్ప మానసిక పరిపక్వత ఉన్న వివేకవంతుడు ధోనీ. ధోనీ రిటైర్మెంట్ ప్రకటించిన వెంటనే రైనా కూడా అంతర్జాతీయ క్రికెట్‌కు వీడ్కోలు పలికాడంటే, ధోనీ ప్రభావం ఎంత గొప్పదో తెలుసుకోవచ్చు.క్రికెట్ లో ఎంత రాణించాడో, వాణిజ్య ప్రకటనల్లోనూ అంతే రాణిస్తున్నాడు.సంపద, సుకీర్తి రెండూ మూటగట్టుకున్న మహర్జాతకుడు కూడా. అతనిపై పెద్దగా వివాదాలు కూడా ఏమీ లేవు.కొన్ని వచ్చినా,కాలపరీక్షలో అవి నిలబడలేదు.39 ఏళ్ళ వయస్సు వరకూ ఇంత బాగా ఆడగలగడం అతని శారీరక, మానసిక ఫిట్ నెస్‌కు తార్కాణం. ఆట నుండి మాత్రమే వైదొలిగాడు. క్రికెట్ రంగం నుండి కాదు. కోచ్‌గా, క్రికెట్ బోర్డు ఛైర్మన్‌గా అతని సేవలు బాగా వాడుకోవచ్చు. ఆదర్శ క్రీడాగురువు, ప్రఖ్యాత బ్యాడ్మింటన్ దిగ్గజం పుల్లెల గోపీచంద్ లాగా, ధోనీ భారత క్రికెట్‌కు కోచ్‌గా ఉంటూ కూడా, సొంత క్రికెట్ అకాడెమి స్థాపించడం ఉత్తమోత్తమం. ఉత్తములైన ఆటగాళ్లను జాతికి అందించడంలో ధోనీ సేవలను మనం సద్వినియోగం చేసుకోవాలి. ప్రభుత్వాలు ఆ దిశగా అడుగులు వేస్తాయని అభిలషిద్దాం. ఆదర్శ, అద్భుత ఆటగాడు మహేంద్ర సింగ్ ధోనీకి అభినందనలు.



# రైతుల వెతలకి కారకులెవ్వరు?

– వి.రాజశేఖర్




అమరావతిలో అద్భుతనగరం వస్తుందని ఆశించి భూములు కొన్న రియల్ ఎస్టేటు వ్యాపారస్తులు, సామాన్యులు ఉసురు మంటున్నారు. రైతుల ఆందోళన 260 రోజులకి చేరుతోంది. హైదరాబాదులో ఎయిర్‌పోర్టు ఫలానా చోట వస్తుందని, హార్డ్‌వేర్ పార్కు ఫలానాచోట అన్న వార్తలు విని, కొని, తర్వాత నెత్తి కొట్టుకున్నవారు చాలామంది ఉన్నారు. వాళ్ల గురించి ఎవరూ పట్టించుకోరు, జూదం లాటి యీ వ్యాపారంలో అవి సహజమైనవే. కానీ రైతుల విషయంలోనే అందరూ ఆవేదన చెందుతున్నారు. ఎందుకంటే గతప్రభుత్వం వారికి చాలా ఆశలు చూపించింది. కాకమ్మ కబుర్లు చెప్పింది. చివరకు చేతకాక బోర్లా పడింది. ఈ ప్రభుత్వం వచ్చి ఆ ఆశలను మొదలంటా తుంచేసింది. అయినా టిడిపి అనుయాయులు యింకా ఏదో వస్తుందంటూ వారిలో ఆశలు నింపుతున్నారు. రైతుల గురించి చెప్పాలంటే – వారి ఆందోళన సాగుతూనే ఉంది. తమాషా ఏమిటంటే బాబు హయాంలో భూములు సేకరించినప్పుడూ అక్కడ సెక్షన్ 144 పెట్టారు. కావాలంటే వెనక్కి యిచ్చేస్తామంటున్నపుడూ జగన్ హయాంలో సెక్షన్ 144 పెట్టారు. జగన్ వచ్చాక తన ప్రభుత్వం ఎదుర్కున్న అది పెద్ద సమస్య యిది. టిడిపి దీన్ని జీవన్మరణ సమస్యగా ఎంచుకుంది. ఇసుక సమస్య తీరిపోయిందేమో తెలియదు కానీ దాని గురించి మాట్లాడడం మానేశారు. నిజానికి అది రాష్ట్ర సమస్య.

ఇది కృష్ణా, గుంటూరు జిల్లాలకు, అందునా అక్కడ భూములు కొన్నవారికి, రైతులకు సంబంధించిన సమస్య. కానీ అది తప్ప వేరేదీ తోచటం లేదు టిడిపి వారికి.ఇంత ఘోరం జరుగుతూంటే తిరగబడరేం? మీకు చేవ చచ్చిందా? అని మీడియాలో ఓ వర్గం ప్రజానీకాన్ని అడుగుతూ వచ్చింది. ప్రజాచైతన్యం గురించి మేధావులు తెగ ఆరాటపడిపోతూ ఉంటారు కానీ, సాధారణ ప్రజలు ఓ పట్టాన స్పందించరు. ఎప్పుడో ఎన్నికల సమయంలో తమ అభిప్రాయం చెప్తారంతే. వాళ్లు ఎప్పటికప్పుడు స్పందిస్తూ ఉంటే నాయకులు హెచ్చరికగా ఉంటారు.

ఈ విషయం టిడిపి నాయకులకు తెలియక కాదు. తాము అధికారంలో ఉన్నపుడు ఏ ప్రతిఘటనా ఉండకూడదని, తాము ప్రతిపక్షంలో ఉండగా తిరగబడాలని కోరుకుంటారు. బాబు జగన్‌కు 'చిన్నవాడివైనా చేతులెత్తి మొక్కుతున్నాను, రాజధాని మార్చకు, అన్నీ ఒకే చోట పెట్టు' అన్నారు. నిజానికి ఆయన మొక్కాల్సింది జగన్‌కు కాదు, చేతులు జోడించి క్షమాపణ చెప్పాల్సింది రైతులకు, తన కబుర్లు నమ్మి అధిక రేట్లకు భూములు కొని దగా పడినవారికి! రైతుల దగ్గర్నుంచి 34 వేల ఎకరాలు ఒకేసారి డెవలప్‌మెంట్‌కు తీసుకోకుండా, కొద్దికొద్దిగా తీసుకుని ఎప్పటికప్పుడు డబ్బు చెల్లించి కొనేస్తూ, చిన్నచిన్నగా కట్టుకుంటూ వస్తే తన కెపాసిటీ ఏమిటో ఆయనకే అర్థమయ్యేది. తను కల కనగానే అన్ని చోట్ల నుండి డబ్బులు వచ్చి కురుస్తాయని ఆయన ఎలా అనుకున్నారో, తక్కినవాళ్లను ఎలా నమ్మించారో!

ఆయన అప్పనంగా 34 వేల ఎకరాలు సేకరించారని మీడియాలో ఓ వర్గం యిప్పటికీ ఆకాశానికి ఎత్తేస్తోంది. పైసా ఖర్చు పెట్టకుండా సంపాదించానని యీయనా చెప్పుకుంటాడు. అదేమి లాజిక్కో అర్థం కాదు. పాత యింటిని పడగొట్టి కొత్త ఫ్లాట్లు కట్టి వాటిలో సగం యిస్తానని వచ్చే డెవలపర్ 'నాకు పాత యిల్లు అప్పనంగా వచ్చింద'ని చెప్పుకుంటాడా? పాతదాన్ని పడగొట్టి, డెవలప్ చేసి, కొత్తది కట్టవలసిన కమిట్‌మెంట్ ఉంది కదా! రైతుల గురించి యీ రోజు యింత మాట్లాడుతున్నంత వారంతా బాబు అంత కమిట్‌మెంట్ తలకెత్తుకుంటున్నపుడు వారించలేదేం? ఇది జరిగేందుకు దశాబ్దాలు పడుతుంది, అప్పటిదాకా మీరే పాలిస్తారన్న ధీమా ఏమిటి? అని అడిగారా? కనీసం ప్రభుత్వం తరఫున రైతులకు రాతపూర్వకంగా హామీలు యివ్వండి అని అడిగారా? మన పాత భవనాన్ని ఎవరైనా డెవలపర్‌కు యిచ్చినపుడు 18 నెలల్లోనో, 24 నెలల్లోనే డెవలప్ చేసి యిస్తామని వాడు రాసి యిస్తాడు. ఆలస్యమైతే నెలకింత అద్దె యిస్తానంటాడు. ఇక్కడ సిఆర్‌డిఏ అలాటి టైమ్ ఫ్రేమ్ యిచ్చినట్లు లేదు. (సబ్జక్ట్ టు కరక్షన్) ఒకవేళ ఆ టైముకి యివ్వకపోతే యింత నష్టపరిహారం చెల్లిస్తాను అనే క్లాజు అసలే లేదు. (అది ఏ జిఓలోనూ, ఏ బుక్‌లెట్‌లోనూ, ఎవరి అగ్రిమెంటు లోనూ లేదు). ఇది అన్యాయం కాదా? వైసిపి వాళ్లు డెవలప్ చేసి యిస్తామంటున్నారు కానీ ఫలానా తేదీ లోపున యిస్తామని చెప్పటం లేదు. రైతులు వాళ్లను నిలదీసి అడగనూ లేరు. ఏటేటా యిస్తామంటున్నది కౌలు తప్ప, ఆలస్యానికి నష్టపరిహారం కాదు. రైతులు అడగగలిగిన అంశం ఏదైనా ఉందా అంటే – 'రాజధానికై భూములు యిస్తున్నాం' అని వాళ్లు రాసి యిచ్చారు. అందుకనే వైసి పీ దీనికి శాసన రాజధాని అని పేరు పెట్టి ఒప్పందభంగం కాకుండా చూసింది. దాని వలన ఒరిగేది ఏమీ లేదనేది రైతుల వెతలకు కారణం!

# 100 కోట్ల విలువ చేసే డ్రగ్స్ పట్టివేత

KB.రమేష్, సీనియర్ జర్నలిస్ట్, హైదరాబాద్





దేశవ్యాప్తంగా మత్తు మందు సరఫరా చేయాలన్న ఓ ముఠా గుట్టును రట్టు చేశారు అధికారులు. ముంబై, హైదరాబాద్ నగరాల్లో ఏకకాలంలో దాడులు నిర్వహించారు. డైరెక్టరేట్ ఆఫ్ రెవెన్యూ ఇంటెలిజెన్స్(డీఆర్ఐ) అధికారులు రూ.100 కోట్ల విలువైన 501 కిలోల డ్రగ్స్‌ను స్వాధీనం చేసుకుని, ముగ్గురిని అరెస్టు చేశారు. పంద్రాగస్టు రోజు స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో మునిగి ఉంటుందని, ఎలాంటి నిఘా ఉండదనుకొని భారీగా డ్రగ్స్ సరఫరాకు పూనుకున్న డ్రగ్ మాఫియా ఎత్తులు ఊహించని విధంగా చిత్తయ్యాయి. ఈ నెల 15న హైదరాబాద్ నుంచి ముంబైకి భారీగా డ్రగ్స్ సరఫరా కానుందని డీఆర్ఐ అధికారులకు సమాచారం అందింది, అప్రమత్తమైన డీఆర్ఐ అధికారులు హైదరాబాద్ శివారులోని ఓ ఫ్యాక్టరీ, ముంబైలోని లేబొరేటరీపై నిఘా పెట్టారు. హైదరాబాద్, ముంబై నగరాల్లోని పలు ప్రాంతాల్లో మూడురోజులపాటు అత్యంత రహస్యంగా, పకడ్బందీగా ఆపరేషన్ నిర్వహించారు.

హైదరాబాద్ నుంచి ముంబైకి భారీగా మెఫిడ్రోన్స్ డ్రగ్స్ లోడుతో వెళ్తున్న ప్రయాణికులు లేని ప్రైవేటు ప్యాసింజర్ బస్సును డీఆర్ఐ అధికారులు వెంటాడి పంద్రాగస్టు ఉదయం ముంబైలో పట్టుకున్నారు. అక్కడి లేబొరేటరీ నుంచి భారీగా మెఫిడ్రోన్, కెటమైన్, ఎఫిడ్రిన్ డ్రగ్స్‌ను స్వాధీనం చేసుకున్నారు. అక్కడే ఇద్దరు నిందితులను అరెస్టు చేశారు. వీరిలో 2017లో డ్రగ్స్ కేసులో అరెస్టయిన వ్యక్తే ఈ రాకెట్ సూత్రధారి అని డీఆర్ఐ అధికారులు గుర్తించారు. హైదరాబాద్ నుంచి తీసుకువచ్చిన డ్రగ్స్‌ను ముంబైలోని లేబొరేటరీలో ప్యాక్ చేసి దేశం నలుమూలలా సరఫరా చేసేవారు.

భాగ్యనగరంలో మరోసారి డ్రగ్స్ కలకలం రేగింది. అధికారులు చేసిన సోదాల్లో 250 కిలోల మత్తుమందు స్వాధీనం చేసుకున్నారు..

ఏపీడ్రున్, కేటమైన్, మేపిడ్రీన్ డీఆర్ఐ స్వాధీనపరుచుకున్నారు.

హైదరాబాద్ నుంచి ముంబై కి కార్గో బస్సులో మత్తుమందు రవాణా చేస్తున్నారు. దీంతో కార్గో బస్సును ఛేజ్ చేశారు అధికారులు.

హైదరాబాద్‌లోని ఒక ఫార్మా కంపెనీలో మత్తు మందు తయారీ అవుతున్న సమాచారం అందింది. ఈ సమాచారంతో అధికారులు దాడులు చేశారు.

ఈ సోదాల్లో దాదాపు 100 కోట్ల రూపాయల విలువ చేసే డ్రగ్స్‌ను స్వాధీనం చేసుకున్నారు డిఆర్ఐ అధికారులు. 28 కోట్ల విలువైన 142 కిలోల మెఫిడ్రిన్‌ను, 50 కోట్ల విలువైన రా మెటీరియల్‌ను స్వాధీనం చేసుకున్నారు. దేశవ్యాప్తంగా మత్తుమందును సరఫరా చేసేందుకు డ్రగ్ మాఫియా వేసిన ప్లాన్‌ను అధికారులు రట్టు చేశారు. 2017లో అరెస్ట్ అయిన డ్రగ్ డీలర్‌ను తిరిగి పట్టుకున్నారు. డ్రగ్స్‌తో రూ. 45 లక్షల నగదు కూడా అధికారులు స్వాధీనం చేసుకున్నారు.

నగరంలో డ్రగ్స్ దందాపై అధికారులు డేగకన్నువేశారు. ఇప్పటికే ఎప్పటికప్పుడు పలుచోట్ల తనిఖీలు చేసి డ్రగ్స్ సరఫరా చేస్తున్న వ్యక్తుల్ని ముఠాలను అధికారులు అరెస్టులు చేస్తున్నారు. నగరంలో డ్రగ్ మాఫియా వ్యాపించకుండా అడ్డుకట్ట వేస్తున్నారు. డ్రగ్స్ కేసులో పట్టుబడిన నిందితులపై ఎన్‌డిపిఎస్ చట్టం 1985తో పాటు ఇతర సెక్షన్ల కింద కేసు నమోదు చేసి దర్యాప్తు చేపడుతున్నామని డిఆర్ఐ అధికారులు తెలిపారు.

# వేటూరి వైభవం

- వాసుశ్రీ, సీనియర్ జర్నలిస్ట్

అన్వేషణ' తెలుగు చలన చిత్ర చరిత్రలో ఒకానొక క్లాసిక్. సస్పెన్స్ జోనర్ సినిమాలో ఆల్ టైమ్ హిట్ అనదగ్గ సినిమా. దర్శకుడు వంశీ అపూర్వ సృష్టి. ఈ తరం ప్రేక్షకులు కూడా యూట్యూబ్ ద్వారానో, టీవీల్లో ప్రసారం అయినప్పుడో.. ఆస్వాధిస్తూనే ఉంటారు. ప్రేక్షకులకే కాదు.. సినీ క్రియేటర్ల కు కూడా అన్వేషణ స్ఫూర్తి ఎంతో ఉంది...ఆ సిన్మాకెన్ని జ్ఞాపకాలో...అన్నీపారిజాతాల్లగ రాలి పోయిన జ్ఞాపకాలు. వాడిపోని జ్ఞాపకాలు.

నిజమే వర్తమాన మెప్పుడూ బాగోదు.అది, జ్ఞాపకమైనప్పుడే బాగుంటుంది. ఆ జ్ఞాపకంలో పిసరంత వేదన కలిస్తే చారుకేశి రాగంలామనం రోజు ఎన్నో పాటలు వింటూ ఉంటాం అందులో కొన్ని నచ్చుతాయి నచ్చవు, కొన్ని ఎంత విన్న ఇంకా వినాలనే ఉంటుంది, అలంటి పాటే అన్వేషణ చిత్రం లోని పాట. ప్రముఖ దర్శకుడు వంశీ దర్శకత్వంలో కామినేని ప్రసాద్ నిర్మాతగా కార్తీక్, శరత్ బాబు, భానుప్రియ, కైకాల సత్యనారాయణ ప్రధాన తారాగణంలో ఇళయ రాజా సంగీత దర్శకత్వం వహించిన ఈ సినిమాలోని పాటలు ఎంతో ఆకట్టుకుంటాయి. ముఖ్యంగా "కీరవాణి చిలకల కొలికిలో" పాట.....
""కీరవాణీ, చిలకల కొలికిరో పాడవేమే వలపులే తెలుపగా

విరబుసిన ఆశలు విరితేనెలు చల్లగా
అలరులు కురిసిన రుతువుల తడిసిన
మధురస వాణి, కీరవాణీ
చిలకల కొలికిరో పాడవేమే వలపులే తెలపగా
ఈ పూలలో అందమై ఈ గాలిలో గంధమై
నా తోటలో చైత్రమై ఈ బాటనే నడచిరా
నీ గగనాలలో నే చిరు తారనై
నీ అధరాలలో నే చిరునవ్వునై
స్వరమే లయగా ముగిసే
సలలిత కలరుత స్వరనుత గతియుత గమకము తెలియకనే
కీరవాణీ, చిలకల కల కల పాడలేదు వలపులే తెలుపగా
ఇల రాలిన పువ్వులు వెదజల్లిన తావుల
అలికిడి ఎరుగని పిలుపులా
అలిగిన మంజులవాణీ, కీరవాణీ
చిలకల కల కల పాడలేదు వలపులే తెలుపగా
నీ కన్నులా నీలమై నీ నవ్వులా వెన్నెలై
సంపెంగలా గాలినై తారాడనా నీడనై
నీ కవనాలలో నే తొలి ప్రాసనై
నీ జవనాలలో జాజుల వాసనై
ఎదలో ఎదలే కదిలే
పడుచుల మనసులు పంజర

సుఖముల పలుకులు తెలియకనే పాట సందర్భం హీరోయిన్ కి హీరో లవ్ ప్రపోజల్. దానిని సున్నితంగా ఆమె తిరస్కరణ. "నేను ఓ లక్ష్యం తో ఉన్నాను.. ఇప్పుడీ లవ్వు కొవ్వులేం వద్దని చెప్పడం. పాపం హీరో పువ్వులలో అందం, గాలిలో గంధం, తోటలో చైత్రం అని ఉబ్బించినా... చిలకలా కలకలా కీరవాణి రాగంలో నే పాడలేనంటుంది. వేటూరి చాతుర్యం అంతా " సలలిత ..కలురత స్వరనుత గతియుత గమకం" అంటాడు అంటే స్వరానికి స్వరానికీ మైత్రి చేసే గమకాన్ని కాదు ..చాల సున్నితమైన స్వరంగా




పూచాను అని. కలురత అంటే ఏంటో మా గంటి బావే చెప్పాలి. అలాగే రెండో చరణంలో కవనంలో ప్రాసని అంటే పాటలో అని జవనాలలో జాజుల వాసనై అంటారు బహుశా జవనం అంటే కోరిక లేక ఊహ అని అర్థంలో.

**సముద్రాల ఓ జావళిలో అంటారు "**

కస్తూరి పూసిన జవరాంధ్ర జవనాలు వయసు లోవారి చలిని తీర్చే అందమైన కుంపట్లని "అది వాడారు గురూజీ.శబ్దానికి అత్యంత ప్రాధాన్యత ఇచ్చి,, సినిమా పాటని రక్తి కట్టించిన వాడు వేటూరి. చెవికి ఇంపుగా ఉండటం సినిమా పాటకి ఉండాల్సిన ఏకైక లక్షణమని గుర్తించి అందుకు అవసరమైతే విషమసమాసాలు చేశాడు, మాటలకి గ్రామ్యరూపాలు వాడాడు, నోరుతిరగని గ్రాంధిక సమాసాల్ని అవలీలగా అతికించేశాడు. భాషాపరంగా ఎన్నో ప్రయోగాలు చేశాడు.చేతనావస్థలోనో, సుప్తచేతనలోనో తనలో కలిగే అలోచనల అలజడిని శ్రోతలలో కూడా కలిగించడమే కవిత్వానికి పరమావధి అయితే వేటూరి ఆ విషయంలో కృతకృత్యుడే. ఇళయరాజా సంగీతదర్శకుడిగా రంగప్రవేశం చేసి చిత్రసీమని తల్లకిందులు చెయ్యటం, అక్కడినుంచి పాటకన్నా బాణీకే ప్రాధాన్యత అని అందరూ ఒప్పేసుకోవటం. బాణీకే పాట రాయాల్సి రావటం వేటూరికి అనుకూలంగా ఉండటమే కాదు, ఆత్రేయ లాటి పోటీదారుల్ని పక్కకు నెట్టేసింది కూడ. మూస బాధల పంజరం నుంచి బయటపడి వేటూరి కలం రెక్కలు విచ్చుకుని ఎగిరింది. ఉదాహరణకి "గీతాంజలి" సినిమాలో "ఆమనీ పాడవే హాయిగా" అన్నపాట మెత్తటి పదాల పేర్పుల్తో చాలా హాయిగా సాగిపోతుంది. "వయస్సులో వసంతమే ఉషస్సులా జ్వలించగా / మనస్సులో నిరాశలే రచించెలే మరీచిక / స్వరాల రాయగా పదాల సంపద / తరాల నా కథ క్షణాలదే కదా / గతించిపోవు గాధ నేనని" – ఇలా అర్థాన్ని ధ్వని ద్వారా సూచిస్తూ మెత్తగా సాగిపోవటం వేటూరి పాటల్లో ఒక ముఖ్య లక్షణం. శ్రోతల్లో అతికొద్దిమందే పాటల్లో ప్రతిపదార్థాల కోసం వెదుకుతారనే సత్యాన్ని గ్రహించి చరించినవాడు ఆచరించినవాడు వేటూరి. వేటూరి సాహిత్యానికి ఇళయరాజ బాణీ తోడవడం స్వర్ణ మల్లెలకు సువాసన అబ్బినట్లే.

# మహాకవికి కూడా తప్పని "ప్రచురణ" గండం!!

- బి.రాజేష్

**శ్రీశ్రీగారు తన కవితాసంపుటికి "మహాప్రస్థానం " అని పేరు పెట్టడం, దానికి తగ్గట్టే ఆ సంపుటి అచ్చయి పాఠకుల చేతికి రావడానికి పదేళ్ళకాలం పట్టింది. ఆధునిక తెలుగు సాహిత్యంలో అద్భుత కవితా సంపుటిగా నిలిచిపోయిన మహాప్రస్థానం పుస్తకంగా రావడం వెనుక ఓ పెద్ద కథే వుంది.**

ఈరోజుల్లో మన పిల్లకవులు ఏడాదికి రెండు మూడు కవితా సంపుటాలు తెచ్చేస్తున్నారు. కానీ శ్రీశ్రీ లాంటి మహాకవికి మాత్రం మహాప్రస్థానాన్ని అచ్చేయించుకోవడానికి నానాతంటాలు పడ్డాడు. మహాప్రస్థానం కవితా ఖండికల రచన 1940 నాటికే పూర్తయింది. అప్పటికే ఇందులోని గీతాలు పాపులర్ అయ్యాయి. జనం నోట్లో నానుతున్నాయి. ఇంత ప్రజాదరణ పొందిన మహాప్రస్థానం గీతాలు అప్పుడే అచ్చుకావాలి. శ్రీశ్రీ కూడా మహాప్రస్థానాన్ని పుస్తక రూపంలో చూసుకోవాలని ఉబలాటపడ్డాడు.కానీ.. పరిస్థితులు కలిసిరాలేదు. సొంతంగా అచ్చేయించుకోడానికి శ్రీశ్రీ ఆర్థిక పరిస్థితులు అనుకూలించ లేదు. అచ్చేసిపెట్టే వాళ్ళకోసం వెదికాడు. దొరకలేదు. దీంతో... మహాప్రస్థానగీతాలు పదేళ్ళపాటు పురిటి నొప్పులు పడుతూనే వున్నాయి. చివరకు 1950 లో

**శ్రీశ్రీ మహాప్రస్థానం కల నిజమైంది.**

మహాప్రస్థానంలో 40 కవితలుంటే, వాటిలో 14 కవితల్ని శ్రీ శ్రీ 1934 నాటికే రాశాడు. 1933 లో 3 కవితలు, 1934 లో 11 కవితలు రాశాడు. మహాప్రస్థానంలో ముఖ్యమైన "మరో ప్రపంచం పిలిచింది... అనే గేయం కూడా ఇందులో వుంది. 1936 లో మరో రెండు కవితలు జతయ్యాయి. ఆ తర్వాత శ్రీ శ్రీ కలం ముందుకు సాగలేదు. 1937 దాకాగ్యాప్ వచ్చింది. ఈ కాలంలో శ్రీ శ్రీ రచన లేం చేయలేదు. 1937 ఏప్రిల్ లో "వ్యత్యాసం ", "అభ్యుదయం " అనే రెండు కవితల్ని రాశాడు. మే నెలలో "ప్రతిజ్ఞ " రాశాడు. 1938 నాటికి వీటి సంఖ్య 30కు చేరింది. 1939లో మరో 4 కవితలు రాశాడు.

ఇక సంపుటిలో చివరగా చేర్చాలనుకున్న "జగన్నాథ రథచక్రాలు " గేయాన్ని 1940 రాశాడు. 1940లో శ్రీ శ్రీ రాసిన గేయం ఇదొక్కటే.' మరోప్రపంచం పిలిచిందిగేయాన్ని కేవలం అయిదంటే అయిదు నిముషాల్లో రాసిన శ్రీ శ్రీ కి, ' జగన్నాథ రథచక్రాలు ' ముందుకు కదలడానికి బాగా సమయం పట్టింది. ఓ పట్టాన ఈ గీతం మింగుడు పడలేదట. ఈ గేయాన్ని ప్రారంభించి, మూడ్ లేక మధ్యలోనే నిలిపేశాడు. ఎలాపడితే అలా, ఏదో ఒకటి రాయడానికి శ్రీ శ్రీగారికి మనస్కరించలేదు. తాననుకున్న రీతిలో గేయం పరుగులు పెట్టే వరకు వేచి చూశాడు. ఎలాగైతేనేం చివరకు జగన్నాథ రథచక్రాల గేయానికి మోక్షం కలిగింది. ఆకాశంలోని రథచక్రాలు శ్రీ శ్రీ రచనతో భూమార్గం పట్టాయి.

1940లో తనూహించిన విధంగానే ఈ గేయాన్ని పూర్తి చేశాడు. దీంతో మొత్తం 40 గీతాలయ్యాయి. వివిధ పత్రికల్లో ప్రచురింపబడిన ఈ గీతాలు "మహాప్రస్థానం " పేరుతో సంకలనంగా తేవాలని అప్పట్లో శ్రీ శ్రీ చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. పుస్తకం వేయడానికి ఎవరూ ముందుకు రాలేదు.

**విశ్వనాథ వారి నుంచి పిలుపు !!**

మహాప్రస్థానం అచ్చేయడానికి ఎవరూ ముందుకు రావడం లేదని ఆనోట ఈ నోట విన్న మరోమహాకవి విశ్వనాథ సత్యనారాయణగారు మహాప్రస్థానాన్ని తాను ముద్రిస్తానని ముందుకొచ్చారు. సాంప్రదాయిక సాహిత్యాన్ని మాత్రమే ఇష్టపడే విశ్వనాథవారు ఇలా.. ముందుకు రావడం చాలామందికి ఆశ్చర్యం కలిగించిందట. అయితే శ్రీశ్రీ కవిత్వాన్ని అప్పటికే విశ్వనాథవారు చదివి వున్నారు. శ్రీశ్రీ కవిత్వం ఇంకా పుస్తకంగా రాకపోవడేమిటి? అంటూ ఆయన తన సన్నిహితులతో అన్నారట. (ఆరోజుల్లో కొందరు కవులే ముద్రాపకులుగా ఇతర కవుల పుస్తకాలను అచ్చేసే సాంప్రదాయం వుండేది. ఉదాహరణకు ఆరుద్ర త్వమేవాహమ్‌ను అవంతి సోమసుందర్ తన కళాకేళీ ప్రచురణల తరపున ముద్రించారు).

విశ్వనాథ వారి చొరవతో మహాప్రస్థానం ముద్రణకు మార్గం సుగమమైంది. 1940లో చలం, జలసూత్రం రుక్మిణినాథ శాస్త్రిగారు పుస్తకానికి ఉపోద్ఘాతం కుడా రాసేశారు. ముద్రణకు అన్నీ సిద్ధమయ్యాయి. ఇక పుస్తకం వచ్చేస్తుందిలే అనుకుంటుండగానే ఎందుకనో విశ్వనాథ వారు వెనకడుగు వేశారు. దాంతో కథ మళ్ళీ మొదటికొచ్చింది. మహాప్రస్థానం ముద్రణకు బ్రేకులు పడ్డాయి. చూస్తూ చూస్తూ వుండగానే ఏడేళ్ళు గడిచిపోయాయి.. 1947 ఈలోగా వచ్చింది. భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించడానికి రంగం సిద్ధమైంది. శ్రీశ్రీగారు గతంలో మొదలు పెట్టి, మధ్యలో ఆపేసిన " చూడు చూడు నీడలు " గేయాన్ని పూర్తి చేయాల్సిందిగా ఆరుద్ర ఒత్తిడి చేశారు.

1947 జూన్ 19వ తేదీన శ్రీశ్రీ 'నీడలు ' గేయాన్ని పూర్తి చేశాడు. దీంతో మహాప్రస్థానం గేయాల సంఖ్య 40 కు చేరింది. అప్పటినుంచి మరో మూడేళ్ళ తర్వాత అంటే... 1950, జూన్ లో "మహాప్రస్థానం " అచ్చయ్యింది. ముద్రాపకుడు మచిలీపట్నంకు చెందిన నళినీ కుమార్. ఈయన శ్రీశ్రీ మిత్రుడు కూడా. తొలి ముద్రణ కాపీలు హాట్ కేక్‌లా అమ్ముడుపోయాయి. వెను వెంటనే ద్వితీయ, తృతీయ, చతుర్థ, ఇలా ముద్రణల మీద ముద్రణలు జరిగిపోయాయి.

కవిత్వ విభాగంలో అత్యధిక కాపీలను అమ్మిన పుస్తకంగా మహాప్రస్థానం చరిత్ర సృష్టించింది.

# రైలు బోగిలపై నెంబర్ల అర్థం..

- ప్రజామీడియా నెట్‌వర్క్







మనం ట్రైన్‌లో వెళ్ళేటప్పుడు చుట్టూ ఉన్న పరిసరాలు ఎంతో ప్రశాంతతను ఇస్తాయి. జన సందోహం ఉన్న ప్రదేశాలలో ట్రైన్ వెళ్లదు కాబట్టి వాతావరణం కూడా ఆహ్లాదంగా అనిపిస్తుంది. అలా మనం ట్రైన్ ఎక్కినప్పుడు మన చుట్టూ ఉన్న పరిసరాలను చూస్తూ ట్రైన్‌ని ఎక్కువ గమనించము. మన బెర్త్ తప్ప మిగిలినవి మనం పట్టించుకోము. కానీ ట్రైన్‌లో ఉండే అక్షరాలు, అంకెల వెనకాల చాలా అర్థాలు దాగి ఉన్నాయి.

బోగీ మీద ఒక నంబరు ఉంటుంది. ఆ నంబర్‌లో ఉండే మొదటి రెండు అంకెలు ఆ బోగి తయారుచేసిన సంవత్సరాన్ని చెబుతాయి. ఒకవేళ 04 అంకెతో ఆ బోగి మొదలైంది అనుకోండి, అది తయారు చేసింది 2004వ సంవత్సరంలో అన్నట్టు అర్థం. ఒకవేళ 91తో మొదలైతే 1991 సంవత్సరంలో దాన్ని తయారు చేశారు అని అర్థం. సాధారణంగా ఈ నంబరు 5 లేదా 6 అంకెలు కలిగి ఉంటుంది. మొదటి 2 నంబర్లు సంవత్సరాన్ని సూచిస్తే తర్వాత ఉండే నంబర్లు ఆ బోగి ఎలాంటిదో సూచిస్తుంది.

ఒకవేళ తర్వాత నంబర్లు 025 నుండి 050 మధ్యలో ఉంటే అప్పుడు ఆ బోగీ ఫస్ట్ ఏసి, 2 టైర్ ఏసీని సూచిస్తాయి.

ఒకవేళ 050 నుండి 100 మధ్యలో ఉంటే అది టు టైర్ ఏసీ ఉన్న బోగీ అని అర్థం

101 నుండి 150 మధ్యలో ఉంటే త్రీటైర్ ఏసీ అని అర్థం

151 నుండి 200 మధ్యలో ఉంటే ఏసీ చైర్ కార్ బోగీ అని అర్థం. అంటే ఇందులో బెర్తులు ఉండవు బస్సులో లాగా సీట్లు ఉంటాయి.

201 నుండి 400 మధ్యలో ఉంటే అది స్లీపర్ సెకండ్ క్లాస్ బోగీ అవుతుంది.

400 నుండి 600 మధ్యలో ఉంటే జనరల్ సెకండ్ క్లాస్ బోగీ అని అర్థం

601 నుండి 700 మధ్యలో ఉంటే అది లోయర్ బెర్త్ సిట్టింగ్ అరేంజ్మెంట్ ఉన్న జనశతాబ్ది ఎక్స్‌ప్రెస్.

701 నుండి 800 మధ్యలో ఉంటే సిటింగ్ ఏర్పాటుతోపాటు లగేజ్ పెట్టుకునే వీలున్న బోగీ అని అర్థం. ట్రైన్ లోపల కూడా కొన్ని అక్షరాలు ఉంటాయి. అవేంటో అవి ఏం సూచిస్తాయి

WGSCN అనే కోడ్ అర్థం ఏమిటంటే

W అంటే prefix సిరీస్ ప్రారంభ అక్షరం

G n+ Self-generating (lighting by axle generators) స్వయం చాలిత బోగీ

S అంటే... సెకండ్ క్లాస్ (Second Class)

అయితే ఇక్కడ WGSCNలో చివరన ఉన్న రెండు అక్షరాలు (CN) బోగీని బట్టి మారుతాయి.

CN అంటే 3 టైర్ స్లీపర్ కోచ్

CW అంటే టు టైర్ స్లీపర్ కోచ్

CB అంటే పాంట్రీ, లేదా కిచెన్, లేదా బఫెట్ బార్ అని అర్థం

CL అంటే కిచెన్ కార్

CR అంటే స్టేట్ సెలూన్

CT అంటే ఫస్ట్ క్లాస్ టూరిస్ట్ కార్. అందులో బాత్ రూమ్, కిచెన్, సిట్టింగ్, ఇంకా పడుకోవడానికి కూడా వీలు ఉంటుంది అని అర్థం.

CTS అంటే సెకండ్ క్లాస్ టూరిస్ట్ కార్. ఇందులో కూడా కిచెన్, బాత్రూం, ఇంకా కూర్చోడానికి పడుకోడానికి వీలు ఉంటుంది అని అర్థం.

ఇక WGSCN కిందే ఉన్న 96241 అనే నంబర్ గురించి పైనే చెప్పుకున్నాం కదా. ఆ బోగీ 1996లో తయారైందని, 241 అంటే ఆ బోగీ స్లీపర్ సెకండ్ క్లాస్ అని తెలుస్తుంది.

AC అంటే ఎయిర్ కండిషన్ ఇది సాధారణంగా అందరికీ తెలిసిన విషయమే

C అంటే coupe. ఇందులో ఒక లోయర్ బెర్త్ ఒక అప్పర్ బెర్త్ ఉంటుంది.

D అంటే డబల్ డెక్కర్

రైలు చివర బోగీ పై X అన్న అక్షరం ఉంటే అది ఆ రైలు చివరి బోగీ అని అర్థం.

Y అంటే లేడీస్ కంపార్ట్మెంట్. ఇందులో ఆరు బెర్తులు నుండి లాక్ చేసుకోవడానికి తలుపు కూడా ఉంటుంది.

అలా ట్రైన్ కి సంబంధించిన ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్క నంబర్ కి ఏదో ఒక అర్థం ఉంటుంది.

Printed & Published by Shri Kanaparthi Rajarao and Printed at Amma Offset Printers, D.No.30-8-35, Bhanu Street, Visakhapatnam-530020, A.P. and Published at Praja Manipusa (Telugu), Sai Towers II, Plot No.17, House No.10-12-6/59, Rednum Gardens, Visakhapatnam - 530002. Cell : 9492423833 Email : prajamanipoosa2020@gmail.com,